

# ఆధ్యాత్మిక జీవనం

ఆంగ్లమూలం
**కె.ఆర్. పరమహంస**

తెలుగు అనువాదం
**కొత్తింటి సునంద**

# విషయ సూచిక

అధ్యాయము 1

# మానవ ప్రవృత్తి

మానవుడు శరీరము, మనస్సు, ఆత్మ అనే మూడు పక్షాలు కలిగి ఉంటాడు. అదే విధంగా మనం అనగా మానవులం రెండు ప్రపంచాల మధ్య ఊగిసలాడుతుంటాము. ఒకటి ఐహికము, రెండవది పరలోకము/ దేవలోకము. మానవుడు శూన్యం అయినప్పటికి మానవుడు కోరుకొంటే దేవాంశ పొందగలడు. దైవప్రేరణ నందుకోగలడు. దైవత్వాన్ని సంపాదించుకోగలడు.

మనసు శరీరం మీద నాలుగు విధాలుగా ప్రభావం చూపుతుంది. 1. శరీరధర్మం మీద, అనాలోచితమైన ప్రభావం చూపడం. 2. మనస్సు పెట్టి ఎరుకతో, ఇచ్ఛాశక్తితో శరీరాన్ని నడపడం, 3. భావావేశంతో సంబంధంలేని శరీరభాగాలపై ప్రభావం చూపడం, 4. కొన్ని అసాధారణమైన ప్రదర్శనల ద్వారా ప్రభావం చూపడం.

మనసు బాహ్య ప్రపంచంలో ఉన్న భౌతిక విషయాలమీద అనేక రకాలుగ ప్రభావం చూపుతుంది. ఒకటి: శారీరకమైనవి, రెండు: (P.K. Effect) పి.కె. ఎఫెక్ట్ ద్వారా.

మూడు: కొన్ని సంకేతాల ద్వారా ఇతరుల మనస్సులతో అనుసంధానం చేసుకోడం వలన.

నాలుగు: ఎదుటివారి మనస్సులను/మనసులో ఉన్నదానిని చదవడం; టెలిపతీ; ఇంద్రియేతర గ్రహణం/స్ఫూర్తి సంపాదించడం ద్వారా.

శరీరం తన ధర్మాలను, ఉచ్ఛ్వాస నిశ్వాసాలను, జీర్ణప్రక్రియలాంటి వాటిని తనంతట తాను చేసుకొంటూ పోతుంది. కొన్ని సందర్భాలలో మనస్సు ఇచ్ఛాశక్తితో పనిచేస్తుంది. బుద్ధి పూర్వకంగ ప్రయత్నించి ఇతరులను అనుకరించే అనుకరణీ విద్య దీనికి ఉదాహరణగా చెప్పవచ్చు. మనస్సు బుద్ధిపూర్వకంగా ఏదైనా పని చేపట్టినప్పుడు ఏదైనా సంక్లిష్టమైన సమస్య ఎదురైతే అది అవాక్కవుతుంది.

కొన్ని అవాంఛనీయమైన వ్యతిరేకభావాలు; భయం, ఈర్ష్య, కోపం, అసహ్యం వంటివి కలిగినప్పుడు మనస్సుకు ఖేదం కలుగుతుంది. వాటిని బయటి ప్రపంచంలోని వ్యక్తులమీద చూపడం జరుగుతుంది. ఇవి నరాల మీద ప్రభావం చూపి, ఊపిరితిత్తుల వ్యాధి, గుండెజబ్బు, ఉదర సంబంధమైన వ్రణాలు వంటి వ్యాధులను కలిగిస్తాయి. ప్రశాంతమైన మనస్సు; ఆహ్లాదకరమైన మనస్సు కలిగిన వ్యక్తులు ఈ వ్యాధుల నుండి త్వరగానే బయటపడగలుగుతారు. మానసిక బలం లేనివారు అలజడికి లోనయినవారు అంత త్వరగా కోలుకోలేరు.

కేవలం ప్రార్థనతో గాని, స్పర్శతోగాని రోగనిర్మూలనం చేయడం, యోగవిద్యతో గాలిలోకి లేవడం వంటివి ఎలాగ సాధ్యమో అర్థంకాదు. కాని అటువంటివి జరుగుతుంటాయి కాదనలేము. అదే కోవకు చెందినది (P.K. Effect) పి.కె.ఎఫెక్ట్. ఆత్మశక్తితో తాను కోరుకొన్న సంఖ్యనే పాచికలు వేసినప్పుడు కనపడడం అనేది ప్రొఫెసర్ (Rhine) రైన్ నిర్ధారించారు. దీనివలన మనస్సు బాహ్య ప్రపంచంలోని విషయాల మీద తన ప్రభావం చూపగలదని రుజువయ్యింది. మన మనసులోని మంచి చెడు భావాల ప్రభావం శరీరం మీద పడ్తుంది.

ఆత్మ కాలాతీతమైనది, శరీరం కాలంలోనే జీవిస్తుంది. కాకపోతే (Psyche) ఆత్మశక్తి లేదా అభౌతిక శక్తి అనేది ఇటు శారీరక ధర్మానికి

బద్ధంగాను వ్యవహరించగలదు; అటు ఆత్మతో అనుసంధానం చేసుకొని, దేవభూమిలో కూడా అడుగిడగలదు. ఆత్మశక్తి శరీరంతో కలసి పనిచేస్తున్నంత సమయమూ భౌతికలోకంలో, కాలానికి బద్ధంగా అది అభౌతికమైన ఆత్మతో అనుసంధానం చెంది దేవభూమిలో అడుగిడినప్పుడు కాలానికి అతీతంగ వ్యవహరిస్తుంది. ఈ పనులను (Psyche) సైకీ ఐచ్ఛికంగానూ, అనాలోచితంగానూ కూడ చేయగలదు.

కొందరు తాత్వికులు మనిషి ప్రకృతిని (ప్రవృత్తిని) ఆత్మ శరీరాల సంఘర్షణల ఆధారంగా నిర్వచించే ప్రయత్నం చేశారు. మనస్సు, శరీరం కలసి మనిషి అవుతాడు. అదే ఆత్మ (Soul) తో కలసినట్లయితే మనీషి అవుతాడు. దైవత్వాన్ని పొందుతాడు.

మనిషికున్న సంకల్పం స్వేచ్ఛాయుతమైనది. మనసు శరీరధర్మంతో కలసి తనకు ఇష్టమైన పనులు చేయగలదు. భౌతిక పరమైన జీవనం గడుపుతూ, శరీరవాంఛలను తీర్చుకోగలడు. కొందరికి తిండిమీద యావ, మరి కొందరికి ఇంద్రియలోలత్వం, కొందరికి ధనం మీద ఆపేక్ష, మరి కొందరికి కీర్తి కాంక్ష అన్నిరకాల అలవాట్లు, మంచి చెడు వ్యసనాలు, దుఃఖం, సంతోషం ఇవన్నీ భౌతికపరమైన విషయాలు. కొందరికి ఏవో కొన్నిటిమీద కాకుండ, ఒకేసారి అనేక రకాల విషయాలమీద ఆసక్తి ఉండడం మనం గమనించవచ్చు. మనస్సు, శరీరం కలసి చేసే ఈ రకరకాల విన్యాసాలు చాలా ఆశ్చర్యాన్ని కలిగిస్తాయి.

పుట్టుకతో ఒక విధమైన వైయక్తిక స్వభావం (Temperament) కలవారు కొన్ని విషయాలమీద, వేరే విధమైన స్వభావమున్న వారు ఇతర విషయాలమీద ఆసక్తిని కనబరుస్తారు. పుట్టుకతో వచ్చిన గుణగణాలనే కొనసాగించాలనే నియమమెక్కడా లేదు. వాటిని అధిగమించొచ్చు. కాకపోతే

ఇది విపరీత (ఆపత్కాలం) పరిస్థితులలో మాత్రమే సాధ్యం. సాధారణ/ సునాయాస జీవనంలో సాధ్యంకాదు.

ఏదైనా ఆపత్తు సంభవించినపుడు మనిషి తన స్వార్థం వీడి అందరి బాగుకోసం పాటుపడతాడు. ఆధ్యాత్మికమైన ఆలోచన కలిగిన వ్యక్తి ప్రతి క్షణమూ ఏదో విపత్తు సంభవించినట్లే భావించడం జరుగుతుంది. ప్రతి నిముషమూ మనం ఏదో ఒక విషయం మీద నిర్ణయిం తీసుకోవలసి ఉంటుంది. ఆ క్షణంలో ఇహము, పరము పోటీపడతాయి, నిర్ణయం మీద ప్రభావం చూపేందుకు తహతహలాడుతాయి. భౌతికపరమైన వాంఛలు తీర్చుకొని తన వ్యక్తిగతాన్ని సంతోషపెట్టనూవచ్చు. అందరికి మేలుచేసే నిర్ణయాన్ని తీసుకొని దైవత్వానికి దగ్గర కానూవచ్చు.

అంచేత విపత్కాలంలో సరియైన నిర్ణయం తీసుకొనేందుకు వీలుగ తమ మనస్సుకు శరీరానికి సరియైన శిక్షణ తీసుకొంటారు సాధుపుంగవులు. తమ అంతరాత్మ ప్రభోదాలను వింటారు. తమలోను, ఇతరులలోనూ నిక్షిప్తమై ఉన్న దైవత్వాన్ని వెలికితీసే ప్రయత్నం చేస్తారు. తమ దైనందిన జీవితంలో, నిత్యకృత్యాలలో ఈర్ష్య, ద్వేషం, స్వార్థం, అజ్ఞానం లేకుండ చూసుకుని ప్రేమానురాగాలతో నిర్ణయాలు తీసుకొనే ప్రయత్నం చేస్తారు.

ఆధ్యాత్మిక శిక్షణ వలన మనిషి స్వార్థం విడనాడి అందరిమేలు కాంక్షిస్తాడు. సైనిక శిక్షణ కంటే ఈ ఆధ్యాత్మిక శిక్షణ కఠినతరం. అందుకనే మనం ఎక్కువమంది మంచి సైనికులను చూస్తాము. తక్కువమంది సాధువులను చూస్తాము. మనిషి జీవిత పరమార్థం; దైవత్వాన్ని అందుకోడం. సర్వవ్యాప్తమైన, అలౌకికమైన ఆశక్తిని పొందడం. స్వార్థాన్ని విడనాడడం. 'నేను' ను జయించడం. 'నేనులేను' అనే భావాన్ని పొందడం.

ఆధ్యాత్మిక శిక్షణ తీసుకొన్న వ్యక్తి ఆపత్కాలంలో మాత్రమే కాకుండ, జీవితంలోని చిన్నచిన్న విషయాలలో కూడ స్వధర్మాన్ని విడనాడి, పరుల

మేలుకోసం పనిచేస్తాడు. సాధువులు తమ శత్రువులని కూడ ప్రేమిస్తారు అనే దానికంటే వారు ఎవరినీ తమ శత్రువులుగ పరిగణించడం అనడం సబబు. వారు అందరినీ ఒకే రకమైన ప్రేమతో, అభిమానంతో అలరిస్తారు. ధర్మాన్ని నిలబెడ్తారు. సాధుపుంగవుల జీవిత చరిత్రలను చదవడం మనందరికి ఆవశ్యకం. వారు ఏ విధంగ, 'నేను' అనే అంశాన్ని జయించి, నిస్వార్ధపరులుగ మారినారో, దైవత్వాన్ని పొందారో తెలుసుకోడం వలన మనమూ మన జీవితంలో గూడు కట్టుకొని ఉన్న స్వార్థాన్ని, అజ్ఞానాన్ని పారదోల గలుగుతాము.

పరిపూర్ణవ్యక్తి ఎవరు అంటే, ఏ వ్యక్తి అయితే తనలోని దైవత్వాన్ని కనుగొని, తాను ఏ దైవశక్తికి ప్రతిరూపమో గ్రహించి, అందులో విలీనమయ్యేవాడు అని చెప్పొచ్చు.

అధ్యాయము 2

# దేవుడు - దైవత్వము

దైవసన్నిధి చేరుకోడమే మానవజీవిత పరమార్థమైనప్పుడు ఆ దేవుడు ఎవరు?

(St. Bernard) బెర్నార్డ్ అనే మహానుభావుడిలా నిర్వచించాడు, "దేవుడు అన్నిచోట్లా ఉన్నాడు. కాకపోతే వివేకవంతులలో ఒకరకంగాను, అవివేకులలో ఇంకొకరకంగాను దర్శనమిస్తాడు. అవివేకులలో ఉన్న దేవుడు వారికి ఎరుకలోరాడు. జ్ఞానంతో దేవుని ఉనికిని తెలుసుకోవచ్చు. మంచితనం ద్వారా అంతకు మించి ప్రేమద్వారా దేవుని చేరుకోవచ్చు".

Ruys broeck ఇలా చెప్తాడు, "దేవుని ప్రతిరూపం మొత్తం మానవాళిలో అంతా విస్తరించి ఉంది. ఏ ఒక్కడిలోనో కాకుండా, ప్రతి ఒక్కరిలోనూ దైవత్వమంతా, పూర్తిగ నిండి ఉంది. ఆ విధంగ చూస్తే మనమంతా ఒకటే, మనమందరమూ దేవుని ప్రతిరూపాలం. మన జీవితానికి ఆధారభూతమైనది, మనలను నేరుగా దేవునితో అనుసంధానం చేసేది దైవత్వం."

దేవుడు ఏ వర్గానికీ చెందడు, ఎటువంటి గుణాలు లేనివాడు. ఎటువంటి కార్యక్రమాలు ఎటువంటి సంబంధ బాంధవ్యాలు లేనివాడు. మాటలలో దేవుణ్ణి నిర్వచించజాలము. దేవుడున్నాడు అంతే.

శిల్పులు చెక్కిన పవిత్రమూర్తిలోనూ దేవుడున్నాడు, పశువుల (పందుల) తొట్టెలోనూ దేవుడున్నాడు. 'రాయినెత్తువాని కింద నేనున్నాను' చెక్కను చీల్చు, అక్కడ నేనున్నాను' 'నీవే నేను ఈ వాక్యాలలో ఉన్న గూఢార్థాన్ని గ్రహించిన వారికి దేవుడు అన్నిచోట్లా కనిపిస్తాడు.

దేవుడు సర్వవాపితుడు. అనుభవాతీత శక్తి. సర్వజీవాధారం. జీవులు ప్రాణశక్తి దేవుడు. ఏ కొలమానంతోనూ లెక్కింప సాధ్యం కానివాడు. దైవత్వము సంపాదిస్తే తప్ప దేవుని గురించి తెలుసుకోలేము.

దేవుడు ఈ ప్రపంచాన్ని 'మాయ' ద్వారా సృష్టించాడు. వేదాంత పరంగా చూస్తే 'మాయ' భ్రాంతికాదు అది వివేచనము; విజ్ఞానము; సర్వశక్తివంతమైన వివేచన ఈ ప్రపంచాన్ని సృజించింది. సర్వవ్యాప్తి వంతమైన జ్ఞానం అందులో గోచరంగా కనిపిస్తుంది. అగోచరంగా నిక్షిప్తమై ఉంటుంది.

ఈ ప్రపంచం దేవుడి విన్యాసానికి (తాండవానికి) స్పందించే డోలనం. మనమందరం ఆ దివ్యజ్ఞాన డోలనంతో ముడిపడి ఉన్న కేంద్రము. ఈ ప్రపంచం దేవుడి ఆటస్థలం. మనమంతా ఆ ఆట కొరకు చేయబడిన ఆటబొమ్మలం. ఆ దివ్యజ్ఞానానికి ప్రతిరూపాలం. ఈ ప్రపంచమొక ధ్వనితరంగం, ఒక లయ, ఒక సంకేతవ్యవస్థ, అది దైవత్వాన్ని ప్రతిఫలింపచేస్తుంది. మానవులంతా భగవంతుడు ఆడించే ఆటలో భాగస్వాములై దానిని కొనసాగించవలసి ఉంది. మానవుల కందులోనే ఆనందముంది. జీవన సాఫల్యముంది.

ఈ విశ్వమూ దైవమే, ఈ విశ్వంలోని పరిపూర్ణ వ్యక్తిత్వమూ దైవానిదే. విశ్వానికి అధిపతీ, అంతరాత్మ దైవమే. ఈ విశ్వం యొక్క చలనమూ దైవ ప్రేరితమే, ఆ చలనం వలన కలిగే ఫలితాలు దైవ ప్రేరితాలే. ఆకారం లేని దైవం యొక్క అస్తిత్వాన్ని మనం బ్రహ్మపదార్థ మంటాము. సాకారమైన దైవ స్వరూపాన్ని వ్యక్తిగత దైవమంటాము. నిజానికి ఆ రెండు స్వరూపాలలో తేడాలేదు. దైవమే ఈ భూమి వేరు వేరు మానసికమైన, భౌతికమైన ఆకారాలలో అవతరించడం జరిగింది. ఆ రూపాలనే మనం మానవులు అంటున్నాము.

ఈ సృష్టియొక్క ఉనికికి మూలాధారం, గుణాతీతమైన, తర్కానికి అందని ఆధ్యాత్మిక శక్తి. గుణరహితమైనప్పటికీ, మానవుని అనుభవానికి అందుబాటులోనే ఉంటుంది. ఇది నిరాకారమైన దైవత్వం. ఇదే మానవ జీవిత గమ్యం. ఇదే దైవసాయుజ్యానికి చేర్చే జ్ఞానం.

భగవంతుని గూర్చిన ఈ జ్ఞానము తనను తాను పూర్తిగ విస్మరించిన/ తనను తాను పూర్తిగ త్యాగం చేసిన/ త్యజించిన వారికి మాత్రమే లభ్యమవుతుంది. అటువంటి అవకాశము ఏ కొద్దిమందికి మాత్రమో దొరుకుతుంది. కాకపోతే ఈ అవకాశం వివేకంగల మనుషులందరికి లభిస్తుంది. తామెవరో, తమకు ఈ విశ్వానికి, దైవానికి గల సంబంధమేమిటో తెలుసుకొన్నవారికి అందుబాటులో ఉంటుంది.

నిరాకారమైన దైవానికి మూర్తిమంతం చేశాయి హిందుమతం, క్రైస్తవము. హిందువులు దైవాన్ని త్రిమూర్తులలో ఆవిష్కరించినట్లే క్రైస్తవులు 'ట్రినిటీ' (యెహోవా, హోలీ స్పిరిట్, క్రైస్ట్?) లో ఆవిష్కరింప చేశారు. మూర్తిమంతం చేసిన ఈ దైవస్వరూపాలకు మూలము నిరాకారమైన దైవత్వమే. దైవత్వమంటే కల్తీలేని స్వచ్ఛమైన మంచితనము, ప్రేమ, వివేకము. దైవత్వం అంతగా అభివృద్ధి చెందని అణువునుండి అన్ని అమరికలు సమగ్రంగ, సంపూర్ణంగా ఏర్పడిన జీవుల వరకు అన్నీ దైవాంశసంభూతాలే.

కేవలం తత్వవేత్తలు, వేదాంతులు చేసే చర్చనీయమైన అంశం, మెట్టవేదాంతపరమైన అంశం మాత్రమే కాదు దైవత్వం మానవాకారంలో జన్మించిన దైవ స్వరూపం కంటె గొప్పది; అనిర్వచనీయమైనది. పూజనీయమైనది. సాకారమైన దేవుడికంటె గణనీయమైనది. కాని దైవాంశాన్ని దైవత్వాన్ని చేరుకోడం మరీ జటిలమైన విషయం. దానికి

ఎంతో క్రమశిక్షణ అవసరం. మతపరమైన నియమపాలన కంటే కఠినమైన క్రమశిక్షణ అవసరం. దైవము, దైవత్వము దీనిలో తేడావుంది. దైవత్వం అచలము (నిశ్చలము). అది దేవుడిలో ఉండే మూలపదార్థము. దేవుడు, ఇతర చరాచర జగత్తు యావత్తు ఆమూలపదార్థ అంశంతో సృష్టించబడినవే.

ఈ అంశాన్ని గురించి ఆల్డస్ హక్స్‌లే (Aldous Huxley) ఈ విధంగా వివరిస్తున్నారు.

అణువునుండి అన్నివిధాలుగ అన్ని అంశలు సక్రమంగ ఉన్న అన్ని అమరికలు సమగ్రంగ ఉన్నజీవుల వరకు, అత్యుత్తమమైన (మానవ) మెదళ్ళ వరకు అన్ని జీవాలు/ప్రాణులు దైవత్వంకు సంబంధించిన సృష్టిలోని భాగాలే. దైవత్వశక్తి ప్రతిజీవిలోనూ, ప్రతిప్రాణిలోనూ ఏదో ఒక బిందువు దగ్గర కలయడం తథ్యం. వేరువేరుగ గోచరమవుతున్న ప్రాణులన్నింటిలోనూ ఆ దైవత్వశక్తి ఉంటుంది.

ఆయా ప్రాణులకు తాము దైవత్వంతో కూడిన సృష్టిరూపాలు అని తెలియకపోవచ్చు. తమ మూలాధారం దైవాంశ అని తెలియపోవచ్చు. అయినప్పటికి విశ్వమంతటా వ్యాపించిన ఈ ప్రాణికోటి మొత్తం ఆ దైవాంశకు సంబంధించిన బిందువులే దైవత్వం విశ్వమంతటా వ్యాపించి ఉన్నదనడానికి ఇదే నిదర్శనం. (హేతువాదులు ఈ విధంగ దైవత్వాన్ని సందర్శించుకోవచ్చు. ఇతరులు దైవాంశని ఇతర రూపాలలో దర్శించు కోవచ్చు.)

దైవ విగ్రహం / దైవ ప్రతిరూపం / దైవ చిహ్నం మత ధర్మానుచరణలో ముఖ్యభాగాలు. భక్తి, అనుశక్తి, విశ్వాసం ఉండడం వలన ఆ మత

చిహ్నంలో దైవత్వం గోచరిస్తుంది. భక్తుల పూజలు అందుకోవడం వలన మామూలు విగ్రహం/చిహ్నం ఎంతో శక్తిని సమకూర్చు కొంటుంది. నిరంతరంగ, ఏళ్ళ తరబడి, అనేక తరాల మనుషులు పూజించడం వలన ఆ విగ్రహం/చిహ్నం నిజంగానే దైవప్రతినిధిగా/దైవంగా భక్తులకి అనిపిస్తుంది.

పూజలందుకొనే ఆ విగ్రహం/చిహ్నం దైవత్వానికి నిజమైన ప్రతినిధి కాకపోవచ్చు. దాన్ని పూజించడం యదార్థమైన దైవత్వ దర్శనం కాకపోవచ్చు. తరతరాలుగ, పూజింపబడటం చేత ఆయా వ్యక్తుల మనస్సులలో నిక్షిప్తమైన భక్తి భావన ఆ విగ్రహం/చిహ్నం దైవత్వాన్ని సంతరించుకొనే విధంగా చేస్తుంది. మానసికంగ ఆ విధమైన భక్తి భావన కలిగిన వారందరికి అది దైవత్వశక్తిగానే కనిపిస్తుంది.

ప్రతి ఒక్కరికీ తనలోని దైవత్వం దర్శించుకోడం సులభతరం. ఇతరత్రా అన్వేషణ కష్టతరం. బాహ్య ప్రపంచంలోనున్న అన్ని విషయాలపట్ల విముఖత్వం చూపేవారికే అంతర్గతంలో నున్న ఔన్నత్యాలు వెల్లడవుతాయి. కాని బాహ్య ప్రపంచాన్ని విస్మరించకుండా ఉండడం కూడ ఆధ్యాత్మిక జీవనానికి అవసరం.

బాహ్య జగత్తులోని విషయాలపై విముఖత చూపడం ఒక విధమైన బలవంతాన్ని ఒత్తిడిని కలగచేస్తుంది. అలాకాకుండ బాహ్య జగత్తులోని ప్రలోభాలని, ఆ కర్ణఘోషలను కైవల్యానికి సాధనాలుగ మార్చుకోడం అవసరం. అంతర్గత విలువలు బాహ్యపరమైన ఒత్తిళ్లు రెండూ అవసరమే. కోరికలను అణచుకొని, శరీరాన్ని హింసించడం కంటే ఆలోచనల స్థాయి పెంచుకోవడం ఆధ్యాత్మిక జీవనానికి అవసరం.

మనం నివసిస్తున్న ఈ ప్రపంచం కొన్నిసార్లు నిరుత్సాహంగానూ, కొన్నిసార్లు బాధాకరంగాను, కొన్నిమార్లు ఆనంద దాయకంగానూ

కనపడవచ్చు. తనలోను, ఇతరులలోను అన్నింటా దైవాన్ని దర్శించగల వారికి ఈ ప్రపంచం వేరేగా కనిపిస్తుంది. కొన్ని అభిప్రాయాలను, కొన్ని ఇష్టాయిష్టాలను తిరస్కరించి, మనసు ద్వారాలను తెరిచి ఉంచుకోడం ద్వారా సత్యాన్ని సాక్షాత్కరింపచేసుకోవచ్చు.

దైవం సర్వత్రా వ్యాపితం అనే మాటను రుజువు చేయడానికి ఎన్నో దృష్టాంతాలున్నాయి. ప్రకృతి మనిషికి దైవమిచ్చినవరం. దాని కనుగుణంగా సంచరించేది పోయి, దానిమీద ఆధిపత్యం చెలాయించాలని చూడడం మనిషి చేస్తున్నతప్పిదం. పశుపక్ష్యాదులను, క్రిమికీటకాలను, ఇతర భిన్న ప్రాణులను ఎంతో మర్యాదగా చూడాలి. అవి మనిషి సేవకోసం పుట్టినట్లు భావించరాదు.

దైవత్వానికి ఎన్నో అంశాలున్నాయి. అవన్నీ వదిలివేసి ఏదో ఒక అంశానికి ప్రాధాన్యమివ్వడం తగదు. క్రతువులకు, మతసంబంధ కార్యాలకి మాత్రమే ప్రాధాన్యమివ్వకూడదు. పూజలు, పునస్కారాలు మనిషికి క్రమశిక్షణ కలిగించవచ్చు, కాని అతడి ప్రవర్తన పూర్తిగా మారదను కొన్నవ్యక్తి యొక్క అంతర్గతం మారదు. మతపరమైన ఆచారాలు, సాంప్రదాయాలు మనిషిలో మార్పుతెచ్చే విధంగా ఉండాలి.

మనమీ ప్రపంచాన్ని ఏ దృక్పథంతో చూస్తున్నామో మన పూర్వీకులు ఇచ్చిన పరిజ్ఞానంతో ఆ జ్ఞాపకాలే మన దృష్టికోణాన్ని నిర్ణయించేది. వారి ఆలోచనలు, వారి అలవాట్లే మనని నడిపించేది. భిన్నత్వం ఈ సృష్టి యొక్క అసలు స్వరూపమని కూడ నమ్మించేది 'నేను, నాది' అనే భావన పరంపరానుగతమైన ఆలోచనలలోనుండి పుట్టినదే.

మన ఆధ్యాత్మిక గురువులు ఈ 'నేను, నాది' అనే భావనను తుడిచిపెట్టాలి అనిచెప్తారు. ప్రతి ఒక్కరు తమలోని వ్యక్తిగత భావనలను

తమ కోరికలనే కాకుండా తమ జ్ఞాపకాలను, తమ స్పందనలను, అలవాట్లనన్నిటిని కాదనుకోవాలి. 'నేను'ను రూపుమాపాలి.

అరబిందో మహర్షి అభిప్రాయమిది: సర్వవ్యాపితమైన సత్యం ఒకవైపు, భౌతికపదార్థాన్ని దాని అభిముఖంగా ఆత్మను కలిగి ఉంటుంది. భౌతిక పదార్థం ఆత్మతో చిక్కుబడి ఉంటుంది. ఆత్మ భౌతికపదార్థం నుండి (పరిణామం) వెలువడిందే. దీని పరిణామ క్రమంలో పుట్టేది భౌతిక పదార్థము. ప్రాణము (జీవము), జీవతత్వము, మనసు, అతిగొప్ప మనసు, పరమానందము, ఆత్మచైతన్య శక్తి, ఉనికి అసలు యధార్థము సచ్చిదానందము (సత్ చిత్ ఆనందము). ఈ సచ్చిదానందము విభిన్నత్వాన్ని సృష్టిస్తుంది. అశాంతిని బాధని కలుగచేస్తుంది.

మనిషిని దైవస్వరూపాన్ని తెలుసుకోకుండా చేసేవి మూడు విషయాలు: ఒకటి కాలము రెండు దైహికము (భౌతికము) మూడు వైవిధ్యము భగవంతుడు/భగవత్ స్వరూపము. కాలాతీత స్వరూపము. కాని ఆ స్వరూపాన్ని కాలానికి కొట్టిపడేయడం వలన మనిషికి భగవంతుని పట్ల ఒక విధమైన సంకీర్ణ భావముంది. భగవంతుడు అత్యంత శక్తిశాలి అనుకొంటాడే గాని, దైవము వివేకము, ప్రేమకు మరొక రూపమని అర్థం చేసుకోడు. భగవంతుడు శక్తి స్వరూపుడగా మాత్రమే తలచి ఆ స్వరూపాన్ని ప్రసన్నం చేసుకొనేందుకు బలులు ఇవ్వడం వంటివి చేస్తాడు మనిషి.

యుద్ధభూమిలో అర్జునుడికి కనిపించే కృష్ణుడు భీకరాకారంలో (విశ్వరూపం) లో ఉండటం జరుగుతుంది. ఆ విశ్వరూపానికి భయ భ్రాంతులైన వారు దైవాన్ని ప్రసన్నం చేసుకొనేందుకు ఏవేవో పద్ధతులలో పూజిస్తారు. అందులో బలి ఇవ్వడం ఒకటి: తాత్కాలికమైన/ఇహలోక కోరికలను తీర్చుకొనేందుకు ఈ భయంకరమైన పద్ధతి అవలంభించడం జరుగుతుంది.

దైవాన్ని కాలానికో, ప్రకృతికో ప్రతీకగా తీసుకోవడం వల్ల ఇలా జరుగుతుంది. అనుగ్రహం పొందడానికో, చెడుని నిర్మూలించడానికో బలులివ్వడమనేది చరిత్రలో మనకు కనిపిస్తుంది. భగవంతుడు మానవ రూపంలోనో/ఇతర ప్రాకృతిక రూపంలోనో జన్మించడాన్ని అవతారమంటారు. ఈ అవతరాం ఒక కాలపరిమితికి చెందింది. 'ఆలోచనాపరులు అవతారం పదే పదే/మరల మరల పునరావృతమయ్యే అనుభవంగా భావిస్తారు.

కాని భగవద్ స్వరూపము కాలాతీతమైనది. అది అనిర్వచనీయమైనది, ఆనందదాయకమైనది, అది ఆత్మ సంబంధమైనది. పరమాత్మను పరమాత్మగానే కొలవాలి. సర్వవ్యాపి అయిన దేవుడినే కోరుకునే వారికి తక్షణమే ఆ అనుభూతి కలుగుతుంది. వారికి కలిగే అలౌకిక ఆత్మానందం దేవుని ప్రసాదము.

మనిషి సంపూర్ణంగా విముక్తి పొందాలంటే పాపభీతి నుండి బయటపడితే చాలదు. అతడి మనసులో పాపం పట్ల పూర్తి జుగుప్స/అసహ్యం ఏర్పడాలి. అంతరాత్మ పూర్తిగా మారిపోవాలి. ఆ విధమైన జుగుప్స ఏర్పడడం వలన అతడి పాత జ్ఞాపకాలు నాశనమవుతాయి. ఆ నేను జ్ఞాపకాల విచ్ఛిన్నంతో 'నేను' అనే భావం, ప్రత్యేక సృష్టి అనే భావం చెల్లాచెదురవుతుంది. యదార్థం బోధపడుతంది. బ్లేక్ (Blake) అనే కవి, తత్వవేత్త ఏమంటాడంటే "మనసుపొరలు తొలగించి చూస్తే, తలుపులు బార్లా తెరచి చూస్తే అంతా విధితమవుతుంది. అనంతమైన సృష్టి గోచరిస్తుంది". Aldous Huxley 'హృదయనైర్మల్యం కలవారికి సంసారము, నిర్వాణము, దృశ్యము, అదృశ్యము, కాలము, అనంతము అన్నీ ఒక రకంగానే గోచరిస్తాయి' అంటాడు.

అధ్యాయము 3

# మతానుభవం

'నీతి' గురించి ఆలోచిస్తుంటే అది పరిపూర్ణం / పరిపుష్టం కాదని, దానికంటె గొప్పది ఇంకేదో మనకు కావాలి అనిపిస్తుంది. ఆంగ్లంలో 'రెలిజియన్' అనేమాట re-ligare అంటే మళ్ళీ మొదటికి చేరుకోడం అని అర్ధం. దైవత్వము నుండి పుట్టిన మనం మరల దైవత్వాన్ని చేరుకోడం అన్నమాట.

వేరు వేరు మతాలున్నాయి. దేని ఆదేశాలు వాటివే. అవి వేరు వేరనిపిస్తాయి కాని అది నిజంకాదు. మూలంలో అన్ని మతాలు చెప్పేదొకటే.

మతము, నీతి పరస్పరాధార భూతాలు. మతాన్ని అనుసరించే వ్యక్తి నీతిగ వ్యవహరించక పోతే అతడు మోసగాడవుతాడు. మతమంటే ఒక లక్ష్యాన్ని చేరుకోడం మాత్రమేకాదు. తనలో వున్న మంచిని గ్రహించి, తదనుగుణంగ వ్యవహరించడం మతం.

'నీతి' ఆదర్శవంతం. అది మనం అందుకోవలసిన ఎత్తు; చేరుకోవలసిన స్థాయి. కాని ప్రపంచంలో అటువంటి ఆదర్శవంతమైన స్థితిలేదు. ఆ స్థితిని చేరుకోడం దాదాపు అసాధ్యం.

మతం నీతికంటె ఉన్నతమైనది. అది 'నీతి'లాగ తాను చేరుకోలేని స్థాయికోసం పాకులాడదు. ఆదర్శం కోసం ఎగబాకదు. వ్యక్తిగత ఆదర్శం మాత్రమే చాలదంటుంది మతం.

మతం సూత్రాలలో, సిద్ధాంతాలలో లేదు. మతమంటే మనం చదివే పుస్తకాలలో ఉన్నది; మనం నమ్మిన సిద్ధాంతాలలో ఉన్నది కాదు. అది

మన అనుభవంలోకి రావాలి. 'స్వచ్ఛమైన మనస్సు ఉన్నవారు తమ నిజ జీవితంలో దేవుని దర్శించగలరు. ఇందుకు బాహ్యమైనదేదీ అవసరం లేదు. దేవునిలో ఐక్యం కావడం అనగా మోక్షసాధన కొరకు ఎటువంటి పద్ధతులూ అనుసరించాల్సిన అవసరంలేదు. ఎందుకంటే మన ఉనికి; మన ప్రతికదలిక అన్నీ దైవత్వంతో ఒనగూడినవి. దేవుని చేరుకొనే శక్తి మనలోనే ఉంది. పద్ధతులు కేవలం పసివారికి. మతాలు పుస్తకాలను సృష్టిస్తాయిగాని పుస్తకాలు మతాన్ని సృష్టించలేవు. ఆత్మను సృష్టించలేవు. అన్ని మతాలు కోరే లక్ష్యమొకటే. తన మనస్సులోని, తన ఆత్మలో దివ్యత్వాన్ని సందర్శించడం/పొందడం. ఆ లక్ష్యాన్ని సాధించేందుకు వేరు వేరు మతాలు వేరు వేరు మార్గాలనుసరించవచ్చు. లక్ష్యం మాత్రం ఒకటే. తనలోని దివ్యత్వాన్ని అనుభవంలోకి తెచ్చుకోడం. మతమనేది మనిషి అంతరంగ కోరికలలో అతి ప్రధానమైనది. అతడి మనసులో ఉన్న శాశ్వతత్వం/అమరత్వం పొందాలనే కోరికనుండి పుట్టిందే మతము. అది తొలగించుకోవాలన్నా తొలగించుకోలేని తాపత్రయం. బాహ్య ప్రపంచంలో ఏదీ అతడిని తృప్తిపరచలేదు. మనిషి అంతరాళంలో దాగివున్న ఆ దాహం తీర్చుకోడం కోసమే మనిషి మతాన్ని ఆశ్రయించడం జరిగింది.

మతం ద్వారా మాత్రమే మనిషి సత్యానికి చేరువ కాగలడు. సత్యమే అతడి పరమావధి. సత్యమే మనిషి జీవితంలోని అన్ని పొరలనూ స్పృశింపగలదు. మనిషి–దేవుడు, వారి సాన్నిహిత్యం, వారి అనుబంధం– ఈ మాటలే అన్ని మతాలకు ఆధారభూతమైనవి. మనిషి జీవనసాగరం అల్లకల్లోలమైనపుడు, వేదన కలిగినపుడు మనిషికి సాంత్వన కలిగించ గలిగింది మతము ఒకటే.

ఆ కారణం చేతనే మనిషిని దృఢంగ కట్టి ఉంచగలిగేది. అతడిని నడిపించే చోదకశక్తి, అతడికి శాంతిని, జ్ఞానాన్ని కలిగించేది, వెలిగించేది

మతమే. అందువల్లనే మనం చరిత్రలో గమనిస్తామొక అంశం. అది మతానికి మనిషి ఇచ్చిన ప్రాధాన్యత అన్ని కాలాల్లోనూ అన్ని యుగాల్లోనూ సాధుపుంగవులకు, మతపెద్దలకు ప్రత్యేకమైన గుర్తింపు; గౌరవము ఇవ్వడం జరిగింది మతం మనిషి సంస్కృతిలో సింహభాగమైంది. ప్రపంచంలో ఉన్న అద్భుతమైన కట్టడాలు; శిల్పాలు, సంగీతము, చిత్రలేఖనం అన్నీ మతాభినివేశంలో పుట్టినవే.

మనిషి ఆలోచనలకీ, ఆదర్శాలకి అన్నిటికి మూలం అతడిలో ఉన్న తపన, పరిపూర్ణత్వాన్ని పొందాలన్న కోరిక. మేధస్సు ద్వారాగాని, సౌందర్యారాధన వలన గాని ఆ సిద్ధిని పొందడం అతడికి తృప్తినివ్వవు. తనలోనే దివ్యత్వాన్ని దర్శించాలి. ఈ తపనే మతాభినివేశానికి మూలం.

శాశ్వతత్వాన్ని, అమరత్వాన్ని పొందాలనేది మనిషి కాంక్ష. తన బలహీనతలు; తనలోని అపరిపక్వత్వము, తన కురుచత్వము అతడిని కుంగదీస్తాయి. దైవత్వంలోని పరిపూర్ణత, గొప్పదనం అతడిలో సంభ్రమం కలిగిస్తుంది. తనలో నిక్షిప్తమై ఉన్న దివ్యత్వము మూలాధారమైన దివ్యత్వం వైపు లాగుతుంది. దాదాపు అన్ని మతాలు మనిషిలో దివ్యత్వమున్నదని గుర్తించాయి. కాని వేదాంతంలో ఈ అంశానికిచ్చిన ప్రాముఖ్యత మరితర మతాలు ఇవ్వలేదు. మతానికొక ఆదర్శముండాలి/లక్ష్యముండాలి. అది కేవలమొక సిద్ధాంతంగ ఉండరాదు. మతమంటే కొన్ని గుణాల పట్టిక కారాదు. కొందరు వ్యక్తుల సమూహంకారాదు. దానికి హద్దులుండరాదు. దైవత్వంలేని కొందరు వ్యక్తులు ఒక సమూహంగ ఏర్పడినంత మాత్రమున ప్రయోజనం లేదు.

నీతి అందుకోవలసిన స్థాయి(స్థితి)ని చెప్తుంది. మత చైతన్యం ఉన్న దానిని ప్రకటిస్తుంది. మనిషిలో అంతర్గతంగ నిక్షిప్తమై ఉన్నదైవత్వాన్ని

ప్రస్తావిస్తుంది. కనుక అది నిజం. వ్యక్తిలోని దైవత్వాన్ని వెలికి తీసేందుకు వివిధ మతాలు వివిధ మార్గాలనుసరించొచ్చు.

మతం మనిషి, దేవుడు వేరు వేరు కాదు. రెండూ కలసి ఒకటే. మనిషి సంకల్పం దైవసంకల్పంతో విలీనం చేయడమే మతధ్యేయము. మనుషులు దేవుని నుండి పుట్టిన అనేక ప్రతిరూపాలు.

మతము ఆచరణకు ఆలవాలము, నీతి ఆదర్శవంతము. వ్యక్తులు ఆదర్శవంతమైన ఆ నీతిని ఆచరణలో పెట్టే విధంగా తీర్చిదిద్దాలి. ఆ విధంగా చూస్తే అవి ఒకదానిపై ఇంకొకటి ఆధారపడి ఉన్నాయి. నీతి విధించే విధులు, మతం విధించే విధులు ఒకటే. నీతి సూత్రాలు ఒకదానితో మరొకటి ఢీ కొట్టొచ్చు. అదే విధంగ కొన్ని మత సూత్రాలు ఇతర మతసూత్రాలతో పొసగక పోవచ్చు. కాని నీతికి మతానికి ఎప్పుడూ ఘర్షణ రాదు. నీతి దానంతటదే వర్ధిల్లడం కష్టం. దానికి మతం యొక్క ఆసరా అవసరము. మతము విశ్వాసంతో కూడినది. ఆ విశ్వాసమే నీతికి ఆలంబన.

మత విశ్వాసం; నమ్మకాలు, ఆచరణలు సమాజం యొక్క ప్రదర్శనను నిర్దేశిస్తాయి. ఒక దేశంలోని ప్రజల సామూహిక నడవడి ఆ దేశంలో పాటిస్తున్న మతాన్నిబట్టి ఉంటుంది. ఆ సామూహిక నడవడి మనకొక ప్రమాణంగ / కొలమానంగ పనికొస్తుంది. అది ఎంత వరకు వ్యక్తులను తమ జీవన పరమావధిని చేరుకోడంలో కృతకృత్యమయ్యిందో తెలుపుతుంది.

తమను తాము సంస్కరించుకోకుండ దేవుడిని ప్రార్థించిన ఫలిత ముండదు. 1.కొందరు దేవుడిని తమ కోరికలు తీర్చే సాధనంగ పరిగణించి, మంత్రాలు, తంత్రాల సాయంతో దేవుడి మెడ ఒంచి

ఒప్పందం చేసి తమ కోర్కెలు తీర్చుకోవాలనుకొంటారు. బలులు, కూడ ఆ కోవకు చెందినవే. 2. మరి కొందరు తాముచేసే పనులన్నిటికి దేవుడి ఆమోదముద్ర ఉందని చెప్తారు. తమ స్వార్థం కోసం; తమ కీర్తి కాంక్షకోసం, ధనసేకరణ కోసం చేసే పనులకు దేవుడి వత్తాసుందని నమ్మబలుకుతారు. మతాన్ని అడ్డుపెట్టుకొని, అకృత్యాలు చేస్తుంటారు.

ఈ చర్య దృష్ట్యా చూస్తే 'సనాతనధర్మం' మనిషిని ఆధ్యాత్మిక జీవనం వైపు ప్రోత్సహిస్తుందని అర్థమవుతుంది. శాశ్వతము, ప్రాచీనము అయినటువంటి ఈ సనాతనధర్మము హిందూదేశములో గతంలో ప్రభవించిన దాదాపు అన్ని మతాలకి ఆధారభూతం. ఆ విధంగ చూస్తే పశ్చిమ దేశాలలో పుట్టిన మతాలకి పుట్టినిల్లని చెప్పుకోదగిన 'మానవత్వ మతం' కూడ ఈ కోవకు చెందిందే. ఈ (Religion of Humanity) మానవత్వ మతం' ఇలా అంటుంది.

"మనిషి ప్రేమ, బాధ్యత ఎల్లలు/సరిహద్దులు దాటి కుటుంబం నుండి దేశానికి; దేశం నుండి అన్ని దేశాల ప్రజలకి విస్తరించినప్పుడు; విజ్ఞానము (Science) ప్రపంచమంతటినీ పొదుపుకొని అందరు మనష్యులను, సమాజాలని ఒకటిగ నిలిపినపుడు మానవాళి దాని కేంద్ర బిందువు అవుతుంది. పాత మతాలు మానవాళి యొక్క ఈ తత్వాన్ని, ఈ ఐక్యతని బలపరచినంత కాలము వాటి మర్యాదను కాపాడుకొన్నాయి. ప్రేమను, సేవా తత్పరతను, సామాజిక న్యాయాన్ని, మంచితనాన్ని, విజ్ఞాన సముపార్జనని అవి ప్రోత్సహించాయి. మానవత్వమతం పుట్టింది మానవత్వంలలో, మానవ ఐక్యతలో, అది ఎదిగింది మానవ ప్రేమలో, దాని ధ్యేయం మానవసేవే. మానవసేవే మాధవసేవగా ప్రకటిత మయ్యింది. తక్కిన విధులకి, బాధ్యతలకి ప్రాధాన్యత తగ్గింది. కుటుంబాన్ని ప్రేమించడం కంటే సమాజాన్ని ప్రేమించడం పెచ్చు,

సమాజాని కంటె దేశాన్ని ప్రేమించడం మరింత పెచ్చు, దేశానికంటే మానవాళి మొత్తాన్ని ప్రేమించడం అత్యంత గొప్ప ఆదర్శం.

మానవత్వ మతం పాతమతాలని నాశనం చేయదు. కాని వాటి ఆదర్శాలను ఆచరణలో పెడ్తుంది. 'కుటుంబం కంటె సమాజం మిన్న' అంటే కుటుంబాన్ని నిర్లక్ష్యం చేయాలని అర్థం కాదు. దాన్నింకా పరిపుష్టం చేస్తుంది. దేశాన్ని ప్రేమించు కాని మొత్తం మానవాళినింకా హెచ్చుగా ప్రేమించు అని బోధిస్తుంది. ధనసంపాదన వద్దని, భౌతికావసరాలు తీర్చుకోడం అవసరమని అనదు. వాటికంటె మొత్తం మానవాళికి శ్రేయస్సు సమకూర్చడం ముఖ్యమని అంటుంది. వ్యక్తుల కంటే సమాజం; సంఘీభావం గొప్పవని అంటుంది. ప్రేమ అనురాగం, విజ్ఞానం అన్నీ మానవసేవకు అవసరమైనవే అంటుంది. అది ఒక దానికొకటి వత్తాసు పలుకుతూ మానవాళి బాగుకోసం ముందడుగు వేయాలి" అంటుంది. వివేకానంద ఇలా అంటారు "మతమొక సిద్ధాంతం కాదు, వ్యక్తి ఉన్న స్థితి కంటె ఉన్నతస్థితికి చేర్చే మార్గమది. మానవుడికి అమరత్వాన్ని సాధింపచేసేది, పశువుగ ఉన్న మనిషిని దేవుడిని చేసేది మతం. మనిషికి మేధస్సు; మనసు రెండూ ముఖ్యము. ఆ రెండు కలసి పనిచేస్తేనే అభివృద్ధి సాధ్యం. మేధస్సు మాత్రమే ఉండే మనిషి ఎండిపోతాడు.'

కేవలం సిద్ధాంతాల ఆధారంగ మతం మనుగడ సాధ్యంకాదు. అది కార్యరూపంలోకి రావాలి. అనుభవైక వేద్యం కావాలి. అది నిశ్చలంగ నిలచి ఉండక గమనశక్తిని కలిగి ఉండాలి. బాల్యం నుండి యౌవ్వనానికి, యౌవ్వనదశ నుండి పరిపక్వానికి ఎట్లా చేరుకొంటామో అదే విధంగ సిద్ధాంతం నుండి కార్యరూపంలోకి రావాలి.

అధ్యాయము 4

# మానవ జీవితం

## జీవితస్వభావం

జీవితమంటే ఏమిటి? మిగిలిన అన్ని విషయాలతో బాటు, జీవితంలో మన స్థాయి లేదా స్థితి మన జీవితాన్ని నిర్వచించడంలో తోడ్పడుతుంది. మన కలలు, కోరికలు, మన జయాపజయాలు, మన గతానుభవాలు, నేటి పరిస్థితులు ఇవన్నీ మనం జీవితాన్ని అర్థం చేసుకోడంలో తోడ్పడతాయి. తల్లిదండ్రులు నీతిమంతులు ధర్మ వర్తనులైన వారి పిల్లలకు, తల్లిదండ్రులు జగడాలుచేసేవారు దురాశకల వారు అయినవారి పిల్లలకు తేడా ఉంటుంది. జీవితంలో ఎన్నో రంగులు, ఎన్నో విశేషాలున్నాయి. వాటన్నిటినీ ఏకరువు పెట్టడం గాని, అన్ని పార్శ్వాలను వివరించడం గాని కుదరదు.

జీవితంలో భిన్నధృవాలున్నాయి. మన జీవితంలో జరిగే అనేకమైన సంఘటనలు, విషయాలు– అవి కాదు ముఖ్యం. వాటిపట్ల మన స్పందన ముఖ్యం. మన జీవితంలో అంతర్గతం, బాహ్యమని రెండు భిన్న ధృవాలున్నాయి. ఈ రెండింటికీ నిరంతర ఘర్షణ జరుగుతుంటుంది. దాని పరిణామమే జీవితం.

భౌతికస్థాయిలో కూడ మనకిది కనిపిస్తుంది. మనం తినే తిండి, పీల్చేగాలి, తాగేనీరు అన్నీ కలుషితం. కాకపోతే మన శరీరంలో మనల్ని క్రిముల నుండి, రోగాలనుండి రక్షించలేని పరిస్థితిలో మనం రోగాల పాలపడతాం. ఇక్కడ కూడ ఘర్షణ కనిపిస్తుంది. బాహ్య ప్రపంచంనుండి మన శరీరంలోకి ప్రవేశించే క్రిములకు, రక్తంలో ఉన్న రక్షక భటవర్గానికి జరిగే పోరాటం కూడ మన జీవితాన్ని నిర్దేశిస్తుంది.

జీవితంలో మనకు మంచి, చెడు– రెండూ ఎదురవుతాయి. మంచి మనకు మేలు చేయడం; చెడు మనకు కీడు చేయడం మనకు తెలుసు.

ఈ సంఘర్షణ మన జీవితంలో మరొక రూపంలో కూడ కనిపిస్తుంది. ఇప్పుడు మనమున్న స్థితినుండి మార్పుచెంది మరొక విధంగ పరిణమించడం తీసుకోండి. పరిస్థితుల ప్రభావం వల్ల మన బాహ్య జీవితంలో మార్పు సంభవించవచ్చు. మనలో అంతర్గతంగ ఉన్న లోపలి మనిషి ఎటువంటి మార్పుకు లోనుకాకపోవచ్చు.

జీవితంలో మూడు ముఖ్యమైన కొలమానాలున్నాయి. అందులో మొదటిది జీవితాశయాన్ని ఏర్పరుచుకోడం. జీవితానికొక లక్ష్యమున్న వ్యక్తి వెయ్యి తప్పులు చేస్తే అది లేనివాడు యాభైవేల తప్పులు చేస్తాడు. జీవితానికి ఒక లక్ష్యం ఆదర్శముండడం ముఖ్యమని స్వామి వివేకానంద అన్నారు.

మన జీవితంలో అతిముఖ్యమైన ఆదర్శం/లక్ష్యం మనలో నిబిడీకృతమై ఉన్న దైవత్వాన్ని కనుగొనడం. మనలోకి మనం తొంగిచూడ గలిగితేనే మనల్ని మనం నియంత్రించగలుగుతాం. అది ఇతరులతో అయ్యేపని కాదు. ఎవరికి వారు చేసుకోవలసిందే. జీవితంలో ప్రతిక్షణం దైవత్వాన్ని ప్రతిఫలింప చేయడమే మన ధ్యేయం కావాలంటారు స్వామి వివేకానంద.

మన లక్ష్యం అలౌకికము; అత్యున్నతము/ఉత్కృష్టము, ఆత్మానందం కలిగించేది అయి ఉండాలి.

అలౌకికము అనగా భౌతికము కానిది. ఆత్మకు సంబంధించినది. జీవిత పరమావధి కేవలం భౌతికానందం కాదు, అనుభవాల ద్వారా జీవిత సారాంశాన్ని కనుగొనడం; ఒక ఆదర్శం నుండి ఇంకొక

ఆదర్శానికి ప్రయాణించడం; అంచెలంచెలుగా సాధించిన జ్ఞానాన్నుండి ఉత్కృష్టమైన జ్ఞానాన్ని పొందడం. ఇవీ మన లక్ష్యాలు కావాలి.

కోరికలు లేకుండ జీవించాలి అని మనుషులు నిరంతరం ప్రయత్నిస్తారు. భౌతికమైన కోరికలకు అంతమే లేదు. అంచేత లోభి ఇంకా ఇంకా డబ్బు కూడబెడతాడు. దొంగ దొంగతనం చేస్తాడు. కొందరు వేదాంతాన్ని వంటపట్టించుకొనే ప్రయత్నం కూడ చేస్తారు. కోరికలు తీరిన తరువాత ఏం చేయాలో తెలియని స్థితి ఏర్పడుతుంది. విషయసేకరణ మాత్రమే విజ్ఞాన సముపార్జన కాజాలదు. విషయ సేకరణ దుఃఖకారకం కూడ కావచ్చు. విషయసేకరణ కాకుండ వివేకాన్ని, వివేచనని పెంపొందించుకోవాలి. ఆత్మానందం మన జీవితాన్ని ఆనంద మయం చేస్తుంది. ఏ మనిషి అయితే తన ఆనందాన్ని తనలోనే వెతుక్కుంటాడో, తనకు కావలసిన వెలుగును తనలోనే వెతుక్కుంటాడో, తనకు కావలసిన వెలుగును తనలోనే దర్శిస్తాడో, తనకు అవసరమైన ప్రశాంతతని తనలోనే కనుక్కొంటాడో అతడి జీవితం సఫలమని భగవద్గీత చెబుతుంది. లక్ష్యాన్ని ఏర్పరచుకొన్నాక దానిని సాధించే మార్గాన్ని ఏర్పరుచుకోవాలి. దానికి తగిన సన్నాహం చేయాలి. తగిన వసతులు ఏర్పరుచుకోవాలి. లక్ష్యాన్ని గాలికి, అవకాశానికి వదిలేయ కూడదు. దానికి అవసరమైన శక్తిని, నైపుణ్యాన్ని, వనరులు చేకూర్చు కోవాలి. అప్పుడే లక్ష్యసాధన సాధ్యం.

అదే విధంగ మనస్సుకు తగిన తర్ఫీదు ఇవ్వాలి. ఇది నిరంతరంగ కొనసాగాలి. ఇది ఎవరికి వారే చేయాలి.

అనుభూతి; ఆలోచన; ఆలోచనను అమలు చేయడం – ఇవి వేరు వేరు ప్రక్రియలు కావు. ఒకదానితో మరొకటి ఆధారపడి ఉంటాయి. అయినప్పటికి అవి వేరు వేరుగ పనిచేయడం జరుగుతుంటుంది. ఈ

మూడింటిని అనుసంధానం చేసి వాటితో పని చేయించగలిగితే మనస్సు కెంతో ఆనందం కలుగుతుంది. మానసికానందం భౌతికానందానికి దారితీస్తుంది.

ఆదర్శము ఆచరాణాత్మకం కావాలి. ఒక క్షణంలో ధ్యానంలోకి వెళ్ళగలగాలి, మరుక్షణంలోనే శారీరక శ్రమ చేయడానికి సన్నద్ధం కాగలగాలి. ఒకవైపు ప్రవచనాలని విపులీకరించ గలగాలి. మరొకవైపు సాధారణమైన పనిచేయగలగాలి.

వజ్రంలాంటి కఠినత్వం; దృఢత్వం ఉండాలి; స్త్రీ సహజమగు సౌకుమార్యం, మృదుత్వం ఉండాలి అంటారు స్వామి వివేకానంద. ఈ గుణాలను పెంపొందించుకోడం వలనే మన అంతరంగం ధృఢతర మౌతుంది. మనకెన్నో బలహీనతలు, అవివేకమైన ఆలోచనలు ఎదురు తగుల్తుంటాయి. వాటి ప్రభావానికి లోనుకాకుండ, మనస్సును పవిత్రంగ ఉంచుకోగలగాలి. మన లక్ష్యసాధనకనుగుణంగ మలుచుకోవాలి.

మనం ఆదర్శవంతమైన లక్ష్యాన్ని ఏర్పరుచుకోవడంతో పనిపూర్తి కాదు. దానిని అమలులో పెట్టాలి. దీనికి రెండు విధానాలున్నాయి. ఒకటి పట్టుదలతో అమలుచేయడం, రెండు ఆదర్శాన్ని ఎటువంటి ఒత్తిడి లేకుండ, దానినే మన జీవనవిధానంగ మార్చుకోడం.

మన ఆదర్శాలు మన అలవాట్లు కావాలి. నిజ జీవితంలో భాగం కావాలి. అనుసరించకపోయినట్లయితే అటువంటి ఆదర్శం డొల్లవంటిది. ఆచరణాత్మకం కాని ఆదర్శం ప్రయోజనం లేనిది.

దేవుడు, దైవత్వం ఇవి మన అనుభవంలోకి రావాలి. తర్కంతో దైవత్వాన్ని నిరూపించడం, మతాన్ని అనుభూతి చెందడం సాధ్యం కాదు. దేవుడు నిజం; మతం నిజం అని మనం నమ్మినప్పుడే అవి అనుభవంలోకి వస్తాయి.

మనమేర్పరుచుకొన్న లక్ష్యాన్ని ఆషామాషీగ తీసుకోరాదు. దాన్ని గట్టిగ నమ్మాలి. దానిని శ్రద్ధగ ఆచరించాలి. ఆచరణలో అవాంతరాలు ఏర్పడవచ్చు. అడ్డంకులు తగలొచ్చు. వాటిని ప్రక్కనపెట్టి అకుంఠితమైన దీక్షతో ముందుకు కొనసాగాలి అని భగవద్గీత చెప్తుంది.

మన లక్ష్యసాధనలో చెడుతలంపులు, చెడు ఆలోచనలు మన మనోధైర్యాన్ని దిగజార్చే ప్రయత్నం చేస్తాయి. అదే మంచి ఆలోచనలు, క్రియాత్మకం అవుతాయి. లక్ష్యమేర్పరుచున్నొ పిదప ఎటువంటి పరిస్థితి లోనూ దానిని విస్మరించరాదు. లక్ష్యం సాధించే వరకు కొనసాగించాలి. దీక్షతో, పట్టుదలతో పనిచేయాలి; ఎక్కడ, ఎప్పుడు ఆగిపోయే ప్రసక్తి రానీయకూడదు.

చాలాసార్లు మనకు మనమే అవాంతరాలు కలిగేట్లు చేసుకొంటూ ఉంటాము. మనకడ్డు వచ్చేవాటిని తొలగించుకోడమే మన విధి. లక్ష్యసాధన చాలా కష్టతరం. దానిని సాధించడానికి ఎంతో దీక్ష పట్టుదల కావాలి. క్రమశిక్షణ ద్వారా శక్తి ఇనుమడిస్తుంది. లక్ష్యసాధన మీదే దృష్టి కేంద్రీకరించడం వలన మనశక్తి యుక్తులన్నీ ఆ దిశలోనే పయనిస్తాయి. మనకున్న శక్తినంతటినీ లక్ష్యసాధనకే వినియోగించాలి.

ఈ లక్ష్యసాధన మన స్వార్థ ప్రయోజనానికి వినియోగించడం అవివేకం. స్వామి వివేకానంద, 'మన విముక్తితో పాటు ఇతరులకు మేలు కలగచేయడమనేది మరవరాదు. మనలోని దైవత్వాన్ని వెలికిదీసే ప్రయత్నంలో ఇతరులు తమ దైవత్వాన్ని సాక్షాత్కరింప చేసుకొనేందుకు తోడ్పడాలి అంటారు.

కబీరు మాటలలో చెప్పాలంటే నీవు పుట్టినప్పుడు నీవు ఏడుస్తూ ఈ లోకంలో అడుగుపెట్టావు. జనం నీ పుట్టుకపట్ల హర్షం వెలిబుచ్చారు.

నీవు మరణించినప్పుడు లోకం ఇటువంటి మంచి వ్యక్తిని పోగొట్టు కున్నందుకు దుఃఖించాలి. నీవు లోక కళ్యాణం కొరకు జీవించాలి.

జీవితం చావుపుట్టుకల మధ్యన జరిగే తంతు అనుకొంటారు కొందరు. కాని మహాఋషులు మానవ జీవితం శాశ్వతత్వానికి వంతెన వంటిదంటారు. జీవనప్రవాహం శాశ్వతమైన ఆనందమనే సముద్రాన్ని చేరేవరకు ఆగదు. దాని అంతిమ లక్ష్యమదే. ప్రయాణం మధ్యలో కలిగే ఆనందంగాని, బాధగాని దానినాపలేవు. మానవ జీవితమెంతో ఉత్కృష్ట మైనది, విలువైనది. దానిని అతి జాగ్రత్తగ జీవించాలి.

ఎటువంటి కృత్రిమత్వం లేకుండ నిరాడంబర జీవితాన్ని గడపడమే ఆదర్శవంతము. క్రియాశీలత్వము, నిశ్చలత్వము, అనురక్తి, విరక్తి, సాంప్రదాయం, పురోగమనం, ధైర్యము, అణకువ, తల్లిమనసు, పసిబిడ్డ నిర్మలత్వం అన్నీ ఉండాలి.

పవిత్రత, కరుణ వంటిగుణాలు కలిగి ఉండాలి. ఏపని చేస్తున్నా దానిలో ఆధ్యాత్మికత పొంగి పొరలాలి. దైవచింతన జీవితాన్ని ఆనంద మయం చేస్తుంది. వీటన్నిటినీ మించిన జీవిత పక్షం నిస్వార్థమైన ప్రేమ, అడగకుండ ఇచ్చే ప్రేమ. ఇవ్వడం తప్ప పుచ్చుకోవడం తెలియని ప్రేమ. ప్రపంచంలోని అందరు నావాళ్ళే అనిపించే ప్రేమ. ఎవ్వరో కాని అపరిచితులుకారు, అందరూ పరిచితులే, ప్రేమాస్పదులే. రాతి హృదయాన్ని సైతం కరిగించగల ప్రేమ, ఇతరులకు ఆనందాన్ని పంచి ఇవ్వగలిగినప్పుడే ఆ జీవితం ధన్యమవుతుంది.

ఈ ప్రేమ స్వార్థరహిత సేవలో తప్ప ఇంకొక విధంగ వ్యక్తీ కరించడం కుదరదు. ఈ ప్రేమ ఎల్లలులేనిది. కులం; మతం; జాతి; రంగు వంటి భేదాలెన్నదీ ప్రేమ. ఇది సముద్రమంత లోతైనది.

అయినప్పటికీ బంధనాలు లేనటువంటిది. ఒత్తిడి లేనటువంటిది. ఇతరుల పట్ల మన కర్తవ్యాన్ని విస్మరించరాదు. దేవుని పట్ల చూపే ప్రేమ గొప్పది. ప్రాపంచిక ప్రేమ బాధకు దారితీస్తుంది. ధనవంతులు దేవుణ్ణి తమ ధనంతోను, ధనహీనులు దేవుని నామం స్మరించుచూ కొలవవలెను.

**జీవితంలోని కోణాలు**

ఓ! అమరులారా! అజ్ఞానాంధకారానికి ఆవల దేదీప్యమానంగ వెలిగే పరమాత్మను నేను కనుగొన్నాను. అతడి ఉనికిని తెలుసుకొన్నవారే చావును జయించి అమరత్వం సాధించగలరు. అని ప్రకటించాడొక వేదవేద్యుడైన ఋషి.

అత్యున్నతమైన ఆధ్యాత్మిక జీవితాన్నెలా గడపాలో ఉపనిషత్తులలో అతిగోప్యమైన/నిగూఢమైన భాషలో బోధించారు గురువులు. ఎటువంటి కర్మలాచరించాలో, యజ్ఞాలు, ఉపవాసాలు, ధ్యానాలు, దీక్షలు చేయాలో వేదాలలో విపులంగ ఉంది.

'The cloud of unknowing' -

క్రిస్టియన్ మతానికి చెందిన ఒక మహాగ్రంథంలో ఇలా రాసి ఉంది. జీవితం నాలుగు విధాలు: 1. సాధారణము 2. ప్రత్యేకము 3. ధ్యాన పూరితము 4. పరిపూర్ణము.

1. 'బాప్టిజం' పుచ్చుకొనే సామాన్య మానవుల జీవితం సాధారణం.
2. ప్రపంచసుఖాన్ని విసర్జించి గడిపే ఆధ్యాత్మిక జీవనం ప్రత్యేకం.
3. పూర్తిగ దేవుని ధ్యానంలోనే గడిపే జీవితం ధ్యానపూరితం.
4. దేవునిలో ఐక్యమైన వారి జీవనం పరిపూర్ణం.

లోతుగ తరచి చూస్తే ఆధ్యాత్మిక జీవనానికి, లౌకిక జీవనానికి పెద్దతేడా లేదు. దృక్పథంలో మాత్రమే తేడా. లౌకికులు ఆధ్యాత్మిక జీవనం గడుపుతుండొచ్చు. ఆధ్యాత్మికులు లౌకికత్వాని పాటిస్తుండొచ్చు.

లౌకిక జీవితంలో కూడ ఎంతో అందము, ఆనందము ఉన్నాయి. తన కుటుంబ సభ్యులకోసం ప్రేమతో శ్రమించే ఇల్లాలు, ప్రేమతో పాఠాలు చెప్పే గురువు, చదువుకే అంకితమైన విద్యార్థి, ప్రేమతో రోగికి సేవలందించే వైద్యుడు– అందరు తమ జీవితాలను చక్కగ గడిపినట్లే. వీరు పవిత్రమైన జీవితాన్ని గడపాలని కోరుకొంటే ఆత్మతో అనుసంధానం చేయడానికి సిద్ధపడితే వారి జీవితాలు ఇంకా తులనాత్మకమవుతాయి.

మనిషి సంఘజీవి; అతడి చుట్టూ ఉన్న ప్రపంచం మీద అతడు; అతని మీద ప్రపంచమూ ప్రభావం చూపుతారు. వ్యక్తిగ; సంఘజీవిగ అతడు తన బాధ్యతలు నిర్వర్తించాలంటే ఎంతో నైపుణ్యం కావాలి. మనసుకు, బయట ప్రపంచానికి పొంతన సాధించినవారి జీవితం మధురం. బౌద్ధం; అహింస, సత్యసంధత, దొంగతనం చేయకపోవడం, సచ్ఛీలత, మద్యం సేవించకపోవడం అనే ఐదు సూత్రాలను పాటించ మంటుంది పతంజలి యోగశాస్త్రం. అహింస, సత్యము, దొంగతనం చేయకపోవడం, సచ్ఛీలము ఆస్థి కూడబెట్టుకుండుటను పాటించ మంటుంది. ఇవి ఈ సృష్టి ఉన్నంతకాలమూ అన్ని కాలాలలో, అన్ని స్థితిగతులలో పాటించాల్సిన సూత్రాలు.

ఇతరులకు సేవ చేయడమే మన పరమధర్మం. ఒక్కొక్కసారి ఆ పనిచేయడంలో కొంత బాధ కలగవచ్చు. కాని అందులో ఎన్నోరెట్లు ఆనందముంది. తమ వ్యక్తిగత జీవితంలోనూ, సమాజంలోనూ లక్ష్యసిద్ధికోసం పాటుపడాలి.

## జీవిత ధ్యేయం

మనకి తరచు ఎదురయ్యే ప్రశ్న – జీవిత ధ్యేయమేమిటి? ముఖ్యంగా 'నా జీవిత ధ్యేయమేమిటి?' అనేది. ఆనందాన్ని ప్రశాంతతను పొందడం అనుకొన్నాము. కాని మనకు లభించినదేమిటి? ఆందోళన, నిరాశ, నిస్పృహలు. ఎక్కడ తప్పు జరిగింది?

మనం మన ఆలోచనా సరళిని మార్చుకొని, మనమింతకు ముందు ఆలోచించిన దానికి వ్యతిరేకంగ ఆలోచిస్తామనుకోండి, నా యీ జీవితం నేను ఆనందం అనుభవించడానికి కాదు, ఇది ఇతరుల ఆనందం కోసం నాకివ్వబడింది అనుకోండి. నా యీ జీవితం దేవునికి అంకితం అనుకోండి. అదే మీ జీవితానికి సరియైన నిర్వచనం.

దేవుడికి నీవు సమర్పించదలచుకొన్న అన్ని నైవేద్యాలకంటె, నన్ను నీవు నైవేద్యంగ అర్పించుకొంటే దేవుడికది అత్యంత ప్రీతిపాత్ర మవుతుంది. అబ్రహాం తన ఏకైక కుమారుడు ఇసాక్‌ని దేవునికి 'బలి' ఇవ్వడానికి సిద్ధపడ్డాడు. జీసెస్ జీవితంలోను, మరణంలో కూడ తనను తాను దేవుడికి బలి ఇచ్చే గొర్రెపిల్ల అయినాడు. నిన్ను నీవు అర్పించుకోడం నీ గొప్ప ప్రేమను, నీ నమ్మకాన్ని, నీ త్యాగాన్ని తెలుపుతుంది. కాని మనమది చేయము. అందుకే అన్నిరకాల బాధలు కష్టాలు.

ఆంగ్లపదం Sacrifice, శాక్రిఫైజ్‌ని మనం సరిగా అర్థం చేసుకోలేదు. మనం ఏదైనా బహుమతి ఇతరులకి ఇస్తే, తీసుకొన్నవాడికి ప్రయోజనం కలుగుతుంది కాని ఇచ్చేవాడికి ఏం జరుగుతుంది అనుకొంటాము. లాటిన్ భాషలో శాక్రిఫికేర్ (Sacrificare) అనే పదానికి, 'పవిత్రతను పొందిన' అనే అర్థం. మనం పూవో, పండో దేవునికి సమర్పిస్తాము. ఆ ఇచ్చిన వస్తువు పవిత్రతని సంతరించుకొంటుంది. ఆ ఇవ్వడమనే పని

దివ్యత్వాన్ని పొందుతుంది. దేవుడది స్వీకరించడం ద్వారా అది పవిత్ర మౌతుంది. అదే విధంగ నన్ను నేను సమర్పించుకోడం ద్వారా ప్రయోజనం పొందేది నేనే. నేను పవిత్రమయ్యాను. దేవుడికి ఒరిగేది ఏమీలేదు. నాకే మొత్తం లాభం. దేవుడికి లేనిదేదీలేదు. నా జీవితానికే సార్థకత కలుగుతుంది.

మనం ఎప్పటికప్పుడు మనలని మనం కొత్తశక్తితో; కొత్త ఉత్సాహంతో నింపుకోవాలి. మనలని మనం కొత్త వ్యక్తులుగ, శక్తివంతులుగ తీర్చిదిద్దు కోవాలి. మనకి; మన ఇరుగు పొరుగుకి, సమాజానికి ప్రయోజనం చేకూర్చే వ్యక్తులుగ పరిమితి చెందాలి. మనలోకి మనం తొంగి చూసుకొని మనలోని చెడుఆలోచనలను పారదోలి, మంచి ఆలోచనలతో నింపుకోవాలి.

'బ్రతుకు, బ్రతికించు' అనేది మన ధ్యేయం కావాలి. ఎవరు తమ విధులను, బాధ్యతలను విస్మరించకుండ పాటిస్తారో, వారు ఇతరుల హక్కులను గౌరవిస్తారు. 'బ్రతికించు' అంటే మన పొరుగువాడు బాధపడుతూ ఉంటే కూడ చూస్తూ ఉండడం కాదు. ఆ బాధని తొలగించ గలగాలి. ఏ అవకాశమొస్తుందా అని ఎదురుచూసి దాన్ని దొరక బుచ్చుకొని ఇతరులకు మేలు కలుగచేయాలి. 'వసుధైక కుటుంబ'మనే భావనని స్వీకరించి అందరికీ ఆనందం కలిగించగలగాలి. అప్పుడు శాంతి, సౌభ్రాతృత్వం ఏర్పడి జీవితం ధన్యమవుతుంది.

నీ జీవితంలోని పెద్దపనికాని, చిన్నపనికాని ప్రకృతి ధర్మాన్నను సరించిచెయ్యి. వ్యక్తిగ నీ బాధ్యతలన్నీ నిర్వర్తించు. ప్రకృతి ననుసరించడం నీ బాధ్యత. ఏపని చేపట్టినా ఆ పనిని ఎట్లా చేస్తున్నావనేది ముఖ్యం. మనమెంత బాగా చేస్తున్నప్పటికీ కష్టాలెదురవడం మానవు. అవి కూడ జీవితంలోని భాగాలే. అయితే కష్ట సమయంలో కూడ నీలోని ప్రశాంతత చెక్కుచెదరరాదు.

## మానవుని భవితవ్యము

ప్రతివ్యక్తికి తాను మంచి జీవితం గడిపేదెట్లాగ అనేది ఒక పెద్దసవాలు. జీవితం దేవుడు మనకిచ్చిన వరం. కాని మంచి జీవితం విజ్ఞత, వివేచన ద్వారా సంక్రమిస్తుంది. విజ్ఞానమంటే విషయ సేకరణ కాదు, సేకరించిన విషయాలని సృజనాత్మకశక్తిగ మలుచుకోగలగాలి. వివేకము జీవితాన్ని లోతుగ పరిశీలింపచేస్తుంది. దాని ద్వారా ఆనందం, ప్రశాంతత కలుగుతుంది.

మన అంతరంగం అంతర్ముఖమైనపుడు, "నేనెందుకు, ఎట్లాగ జీవిస్తున్నాను? నేనెక్కడినుండి వచ్చాను? ఎక్కడికెళ్తాను? నా జీవిత ధ్యేయమేమిటి? ఈ జీవితాన్ని నేనెలా ఆనందమయం చేసుకోగలను?' – ఇటువంటి ప్రశ్నలే మనిషి భవితవ్యాన్ని నిర్ణయించేది.

మనిషి బాధ్యత తాను లోకోత్తర పురుషుడు కావడం. ఈ ప్రపంచం లోని ప్రతిక్రియ, శక్తి, ప్రకృతి వగైరా అన్నీ ముందుగానే నిర్ణయించబడి ఉన్నాయి. ప్రపంచంలో ప్రతీది ప్రకృతి ధర్మాలకనుగుణంగ ఉంటుంది. తేనెలోని తీపి, గులాబీలోని పరిమళం, కుక్క విశ్వాసం, బాతు నిదానము; గాడిద ఓర్పు, భూమి ఉపయోగత్వము ఎన్నటికీ మారవు. చేప నేలమీద బ్రతుకజాలదు, చిరుత తన చర్మం మీదున్న మచ్చలను తొలగించు కోలేదు. సరీసృపాలు గాలిలో ఎగరలేవు. కాని మనిషి భవితవ్యము వేరు. మనిషి చంద్రుడిమీద మనగలడు, సముద్రపు లోతుల్లోకి వెళ్ళగలడు. అణువుని విచ్ఛేదించగలడు. ఆకాశాన్ని పరిశోధించి కొత్త లోకాలని కనుగొనగలడు. ప్రకృతి ధర్మాలను ఎదురించగలడు. ఈ శక్తే అతడిని లోకోత్తర పురుషుణ్ణి చేయగలదు.

కాని అతడి ప్రవర్తన విచిత్రమైనది. అతడు చంద్రుడి మీదకు వెళ్ళగలడు కాని తన ఇంట్లో సామరస్యంగ ఉండలేడు. అతడికి భావావేశం

ఉంది కాని కరుణ లేదు. వేగముంది కాని దిక్కుతోచదు. ఉత్పత్తి చేయగలడు, సమానంగ పంచలేడు, వస్తువులున్నాయి కాని భగవంతుడులేడు. అతడికి ధనార్జన మీద, అధికారం మీద కన్ను, కాని సత్యం మీద వివేచనమీద శీతకన్ను; చుట్టూ యంత్రాలుంటాయి. మానవత్వం లేదు. అతిగా ఆలోచిస్తాడు కాని స్పందించడు. తెలివి ఉంది, జాలిలేదు. మంచి లక్షణాల మీద చెడు లక్షణాలు స్వారి చేస్తాయి.

ఆ చెడు లక్షణాలు కొండొకచో హద్దులు మీరుతాయి. ఒక పులి మరొక పులిని చంపదు, తోడేలు ఇంకొక తోడేలును వేటాడదు. కాని ఒక నియంత లక్షలాది జనాలను మృత్యువుపాలు చేస్తాడు. ఒక రొట్టెముక్క ఇస్తే చాలు కుక్క జీవితాంతము విశ్వాసంగ ఉంటుంది. కాని మనిషి అలా ఉండడు. కామం, క్రోధం, దురాశ, ఈర్ష్య, గర్వం వంటి చెడుగుణాల అతడిని నడిపిస్తాయి. మనిషి క్రూరత్వానికి సరిసాటి ఇంకొకటిలేదు.

మంచి మనిషి దేవదూత కంటె గొప్పవాడు. చెడ్డమనిషి దయ్యము కంటే నీచుడు. మనిషిలో అన్నీ విపరీత బుద్ధులే. వ్యతిరేక భావాలే. అతడి భవితవ్యమిదీ అని చెప్పడం కష్టం.

బాధపడటం మనిషి విధి. బాధే జీవితం. అదే అతడిని ముందుకు నడిపించేది. నడిచే దారి అంతా ముళ్ళమయం. మనిషి కష్టం అతడు చేరుకోదలచిన గమ్యాన్ని బట్టి ఉంటుంది. తక్కువ శ్రమ(ధనం)తో ఎక్కువ ప్రయోజనం పొందాలనుకొంటే కష్టం పాలు కూడ ఎక్కువే ఉంటుంది. ప్రతి కష్టానికి ఒక ధర ఉంటుంది.

మనిషి తను చరిత్రలో నిలచిపోవాలని, గొప్పవాడు కావాలని కాంక్షిస్తాడనుకోండి అతడు చాలా ఎక్కువగ కష్టపడాల్సి ఉంటుంది.

మనిషి నిరంతరం మార్పు అనే ప్రవాహంలో కొట్టుకొని పోతుంటాడు. కొత్త ఆలోచనలు, భావాలు, కోరికలు, భావోద్రేకాలు అతడిని ఉక్కిరి బిక్కిరి చేస్తుంటాయి. వీటిమధ్య సంయమనం లేకపోతే అతడి గతి అధోగతి అవుతుంది. చక్కటి అవగాహన ఉన్నట్లయితే సరియైన దిశగా అతడు ప్రయాణిస్తాడు. రెండు విధానాలలోనూ శ్రమ తప్పదు. కష్టం తప్పదు.

మనిషి పెనుగులాటకు ఎన్నో కారణాలు: కొన్ని సహజసిద్ధమైనవి, కొన్ని తార్కికం; కొన్ని సామూహికం, కొన్ని అంతర్దృష్టితో కలుగుతాయి. తల్లి తన బిడ్డల ఆనందం కోసం పడే పాట్లు సహజసిద్ధమైనవి. తండ్రి తన కుటుంబం ఆనందం కోసం 'తార్కికంగ ఆలోచిస్తాడు. ఒక నాయకుడు ఎక్కువమంది శ్రేయస్సు కొరకు సామూహికంగ ఆలోచిస్తాడు. ఒక సాధువు సత్యాన్ని అంతర్దృష్టితో ఛేదిస్తాడు. వీరందరూ ఎంతో శ్రమిస్తారు. ఎన్నో కష్టాలు కోరుకొంటారు. కాని బాధ వీరికి సుఖంగా ఉంటుంది. అందులోనే వారికానందం లభిస్తుంది.

మానవ జీవితాన్ని నడిపించే మరొక ధ్యేయం: అత్యున్నతస్థాయి లేదా ఉత్కృష్టస్థాయిని చేరుకోడం. దీన్నే హిందూ ఋషులు 'పరిపూర్ణత్వ' మన్నారు. మానవ చైతన్యంలోని పలు అంశాలు అద్భుతంగ మేళవిస్తే అవి పరిపూర్ణత్వం సాధిస్తాయి. మానసికాన్ని, శారీరకాన్ని అంతర్గతం అన్నిటినీ పరిపుష్టం చేస్తే విడుదలయ్యే శక్తిని ఆశలని, ఆశయాలని, ఆదర్శాలని సాధించేందుకు వాడాలి.

మనిషి భవితవ్యాన్ని నిర్దేశించే శక్తి కలిగిన ఉత్కృష్టమైన విలువలు: సత్యము, అందము, న్యాయము, ప్రేమ ఎటువంటి పక్షపాత ధోరణి లేకుండ ఉన్నదాన్ని ఉన్నట్లు ప్రతిఫలింపచేసేది సత్యము. దేవుడే సత్యము,

సత్యమే దేవుడు. సత్యము ఉన్నది, అసత్యము భ్రమ. సత్యము నిజము; అసత్యము మూఢనమ్మకం. మనిషి విధి సత్యాన్ని శోధించడం.

అందము పరిపూర్ణము/సంపూర్ణము. అన్ని భాగాలు సరియైన పాళ్ళలో ఉండటం; ఒక వస్తువు అన్ని అంశాలలో సమగ్రత సాధించడం అందం లక్షణం. గులాబి పువ్వు సుకుమారత్వంలో, సువాసనలో, రంగులో, ఆకారంలో, తాజాదనంలో అన్నింట్లో సమగ్రత సాధించింది. భగవంతుని సృష్టిలో అన్నీ అందమైనవే. అందం భగవంతుని స్వరూపం. మనిషి భగవంతుని ప్రతిరూపం కనుక అన్నింటిలో అందాన్ని అన్వేషించి సాధించాలి. అందాన్ని ధ్యానించిన కొద్దీ మనిషి ఆ అందంలో భాగమవడం జరుగుతుంది.

తర్కానికి, మనస్సాక్షికి మధ్యకుదిరేది/కుదిరించేది న్యాయము ఎవరికి ఏది చెందాలో దాన్ని వారికి ఒప్పగించడం న్యాయం పని. న్యాయశాఖ రాష్ట్రపరిపాలనలో ముఖ్యమైన భాగం. రెండు వ్యతిరేక శక్తులను కలపడం, మంచికి చెడుకి మధ్య జరిగే గొడవలని నివారించి సామరస్యాన్ని సాధించడం న్యాయం పని. న్యాయమంటే క్రమపద్ధతి; అందం, సమతుల్యత. మనిషి ఎల్లప్పుడూ న్యాయవంతంగ ఉండాలి. దేవుడు ఏనాడూ, ఎవరిపట్లా అన్యాయం చేయడు.

మనిషి మనసును దైవత్వంతో నింపేది ప్రేమ. ఈ ప్రపంచాన్ని నడిపే చోదకశక్తి ప్రేమ. ఆధారభూతం ప్రేమ. అన్నింటిలో దాగివున్న అంతర్గత నిజాన్ని బయట పెట్టేది ప్రేమ. మనిషి ఆత్మ పరితపించే దివ్యమైన అందం ప్రేమ. మనిషికి మనిషికి మధ్య చెలరేగే కలహాలను మట్టుపెట్టేది ప్రేమ. మనిషి మనసును భావనలను సంకల్పాన్ని స్పందింపజేసే దివ్యశక్తి ప్రేమ. ప్రేమించే వ్యక్తి అనునిత్యము అందాన్ని కనుగొనే ప్రయత్నంలో ఉండడమే కాదు, అందాన్ని సృజించి, ఆరాధించి,

దానికి శాశ్వతత్వం సంపాదించాలనే తపనతో ఉంటాడు. ప్రేమ బలహీన మైన ఉద్రేకం కాదు; తాత్కాలికం కాదు. అది సృజనాత్మకమైనది. జీవితాన్నంతా చుట్టివేసేది.

మనిషి భవితవ్యం ఉత్కృష్టమైన లక్ష్యాలవైపు పయనించడం, మేధస్సులోని సహజమైన గుణాలను, ఆధ్యాత్మిక గుణాలను అనుసంధా నించడం. మేధస్సు దేవుడు మనిషికిచ్చిన బహుమతి. భగవంతుడు మనిషిలో నివశిస్తున్నాడని తెలిపేది మేధస్సే. దాని సాయంతో మనిషిలోని మనస్సాక్షిని/అంతరాత్మని ప్రేరేపించాలి. అప్పుడే మనిషి సమాజం పట్ల తనకున్న బాధ్యతని గ్రహిస్తాడు.

మనిషిలో గొప్ప మేధస్సు ఉంటే చాలదు. అతడి అంతరాత్మ మహనీయత కలిగి ఉండాలి. మేధస్సు ఏమి చెప్తుందంటే మనిషి జీవితంలో సృజనశక్తే ఎక్కువ ప్రాముఖ్యమని; దేన్నయినా తన అధీనంలో ఉంచుకొని అనుభవించడంలో గొప్ప ఏమీలేదు. చరిత్ర గొప్ప కళా కారులను, శాస్త్రవేత్తలను; పరిశోధకులను, అన్వేషకులను, తాత్వికులని, కవులని గుర్తుపెట్టుకొంటుంది కాని తమ అధీనంలో ఉంచుకొనేవారిని కాదు. మనిషి తనలో నీతివంతమైన వ్యక్తిత్వం పెంపొందించుకొనే ప్రయత్నం చేయాలి. ఈ ప్రపంచంలో ఏదీ తనకోసమే తాను ఉండదు. సూర్యుడు వేడిని, వెలుతురుని ఇవ్వడానికి ఉన్నట్లే ప్రకృతిలోని సమస్త జీవులు, చెట్లు చేమలు, కొండలు లోయలు, నదులు వగైరా ఇతరుల కోసమే ఉన్నాయి. కొవ్వొత్తి వెలుగునిస్తుంది. చెట్టు తనను నరకవచ్చే వాడికి సైతం నీడనిస్తుంది. ఆవు పాలిస్తుంది కాని తాగదు. మనిషే విచిత్రమైన ప్రాణి. అన్నీ తనవే, తన కోసమె ఉన్నాయంటాడు. ఇది నా యిల్లు, నా ఆస్తి, నా సంపద, నా అధికారం అంటాడు. ప్రకృతిని చూసి నేర్చుకోవాల్సిందెంతో ఉంది.

ప్రపంచంలోని ప్రతీది ఎదుగుదల దశలో ఉందని, తను ఆ ఎదుగుదలకి దోహదం చెయ్యాలి కాని ఆటంకం కలిగించరాదు. విత్తనం మొక్కయి, చెట్టయ్యి పూలు పండ్లు ఇస్తుంది లేదా క్షీణిస్తుంది. మనిషి కూడ ఎదగాలి, మనసును, ఆత్మని బలపరచాలి లేదా మనిషి కూడా క్షీణిస్తాడు.

ఈ సృష్టిలో మార్పు జరగడము, మార్పు జరగకుండ ఉండడం రెండూ ఉన్నాయి. కాలాలు, ఋతువులు, శరీరం మారుతుంటాయి. అదే విధంగ మార్పులేనివి– మామిడిచెట్టు నుండి మామిడిపండే వస్తుంది, కోడి గుడ్డునుండి కోడిపిల్లే పుడుతుంది. మనిషి మానవుడిగానే ఉండాలి.కాని అప్పుడప్పుడు దానవుడిగ మారతాడు.

తన శరీరం మాత్రమే నశిస్తుందని, ఆత్మకు చావులేదని మనిషి గ్రహించాలి. మనిషి దేవునికి ప్రతిరూపం. దివ్యత్వం అమరం. మనిషిగా పుట్టి తాను చేసే పనులన్నింటికి దేవుడికి జవాబు చెప్పాల్సి ఉంటుంది. దేవుడు తనకిచ్చిన సంపదను పేదలకోసం కాకుండ తనకోసం మాత్రమే వెచ్చిస్తే శిక్షార్హుడవుతాడు. సమాజాన్ని విస్మరించరాదు. మంచిపనులనే కొనసాగించాలి.

**జీవితాన్ని జీవించడం**

ఆత్మను ఆత్మగానే పరిగ్రహించడం ఆచరణాత్మకమైన మతం. ఈ సూత్రమే అన్ని విషయాలకి మూలాధారం కావాలి. ఈ విషయాన్ని గ్రహించాలంటే రెండు మార్గాలున్నాయి. వైరాగ్యము, ధ్యానము.

సన్యసించడం వైరాగ్యము వలన, ధ్యానము వలన సాధ్యము. సన్యసించడమంటే అన్ని బంధాలను తెంచివేసుకోడం. నాకీ భౌతిక

జీవితమొద్దు, దీనికంటె ఉన్నతమైనది కావాలని కోరుకోవడం సన్యసించడం. ధ్యానం ద్వారా మనకు కలిగిన హానిని తొలగించుకోడం.

మన జీవితమెంత వైశాల్యమైనదైతే అంత మంచిది. కొన్నిటికే పరిమితమైతే అది మరణానికి మాత్రమే దారి తీస్తుంది. మనం విశాల దృక్పథంతో అందరికోసం బ్రతికిన క్షణాలే నిజమైన క్షణాలు. సంకుచిత దృష్టి కలిగిన మనిషికి మరణ భయం కలుగుతుంది. మనిషి ఎప్పుడైతే 'నేను అన్నింటా ఉన్నాను, అన్ని జీవాలలో ఉన్నాను, నేనే ఈ ప్రపంచం' అనుకొంటాడో భయం వీడిపోతుంది.

'వేదాంతం' ఈ జీవితం పరస్పరాధార భూతమని చెప్తుంది. ఒక అణువు, తక్కిన అణువులన్నింటినీ తనతోపాటు తీసుకొని వెళ్ళగలిగితేనే ముందుకు పోగలుగుతుంది. కలసికట్టుగ పనిచేస్తేనే అభివృద్ధి సాధ్యం. జాతి, జాతీయ భావం వంటి సంకుచిత భావాలతో ఏదీ సాధించలేము. ప్రతి ఆలోచన ప్రపంచాన్నంతా చుట్టివేయాలి. ప్రతి ఆదర్శము, ఆశయము ప్రపంచంలోని మానవాళినంతా, జీవితాన్నంతా చుట్టుముట్టాలి.

మనిషి ఒంటరి జీవితం గడపడం అసాధ్యం. అందరి సంతోషమె తన సంతోషము అని అర్థం చేసుకోవాలి. అసలీ విశ్వం ఆ గట్టిపునాది మీదే ఏర్పడింది. ఇతరుల దుఃఖం తన దుఃఖమని, ఇతరుల ఆనందమె తన ఆనందమని, తన ప్రేమని ప్రపంచమంతా వ్యాపింపచేయగలగడం వ్యక్తి విధి.

స్వార్థం మరణం, నిస్వార్థం జీవనశక్తి. ఇతరులకు సేవచేయడం జీవించి ఉండడం, తన స్వార్థం కోసం చేయడం మరణ సదృశ్యం. తాడిత, పీడిత, వర్గాలను ఆదుకోవడం మన కర్తవ్యం. మానవసేవ చేసి, ఆ తరువాత నిన్ను నీవు దేవునికర్పించుకో. అప్పుడు నీకు

విపరీతమైన శక్తి, బలము కలుగుతాయి. ఇతరులను ప్రేమించలేని జీవితం వ్యర్థం; సంకుచితం; ప్రేమే ఈ జీవనానికి మూలసూత్రం నిస్వార్థ ప్రేమ మన ఆదర్శం కావాలి.

సంకుచితత్వాన్ని వీడి జీవితాన్ని విస్తరింప చేయాలి. అందరికి విజ్ఞానాన్ని వెదజల్లాలి. శ్రేయస్సును పంచిపెట్టాలి. మనం దైనందిన జీవితంలో ఘర్షణ ఎదుర్కొంటుంటాము. మనం మన విధులను ప్రేమతో చేయగలగాలి. అప్పుడు ఆ విధులను నిర్వర్తించడం మనకు ఆనందం కలిగిస్తుంది. ప్రేమ, స్వేచ్ఛలో ఇమిడి ఉంటుంది. మనకు దైనందిన జీవితంలో తారసపడే కోపము, ఈర్ష్య వంటి దుర్గుణాలనుండి తప్పించుకొని స్వేచ్ఛ సంపాదించాలి.

అన్ని కళల కంటె జీవించడం గొప్పకళ. ఎన్ని సిద్ధాంతాలు చేసినా దానికి సరిరావు. అది అనుభవించాల్సిందే. దాని ఉనికి చంచలము, ఊహాతీతము. సంగీతం లాగా దానికొక తాళగతి ఉంది. కాని దానిచుట్టూ గందరగోళం ఆవరించి ఉంది. ఒక చిత్రం లాగ అది రంగులతో భాసిల్లుతుంది. దానిచుట్టు నలుపు తెలుపు గీతలుంటాయి. ఒక రాయిగాని, చెక్కగాని నిర్జీవంగ ఉన్నట్లు తోస్తుంది. కాని శిల్పి ఉలితో చెక్కి లోన దాగివున్న మూర్తిని ఆవిష్కరింపచేసి, సజీవం చేస్తాడు. జీవితం కూడ అంతే. జీవితం వేరు వేరు దారాలతో కూడినది. వాటినన్నింటిని చిక్కటి అల్లిక చేయాలి. సిద్ధాంతాన్ని, ఆచరణాన్ని, బాహ్యాన్ని, అంతర్గతాన్ని సమతూకంలో ఉంచడమే జీవితం.

స్వామి వివేకానంద ఇలా అంటారు, "ఏదైనా ఒక ఆలోచన ఆదర్శం తీసుకో, రేయింబవళ్ళు దాన్నే స్మరిస్తు ఉండు, దానినే నీ జీవితానికి మూలబిందువు చెయ్యి. నీ శరీరంలోని ప్రతి భాగము; అణువణువు

దానితో నింపు మిగిలిన ఆలోచనలు పక్కనపెట్టు. విజయం ఈ విధంగానే సాధ్యము. గొప్ప ఆధ్యాత్మిక వేత్తల జన్మ ఇలాగే సాధ్యమయ్యింది". మన గత రాష్ట్రపతి డా.ఎ.పి.జె.అబ్దుల్ కలాం ఈ మంత్రాన్నే నిత్యం పఠిస్తుంటారు, చెప్తుంటారు.

మనకు మంచి ఆలోచనలు, చెడు ఆలోచనలు కూడా కలుగు తుంటాయి. మంచి ఆలోచనలు కలిగితే సంతోషించాలి. చెడుని దూరముంచాలి. ఎప్పటికప్పుడు ఇలా చేయడం వలన మనసుకు ప్రశాంతత కలుగుతుంది.

మన ధ్యేయాలేకాదు ఆ ధ్యేయాలని సాధించే మార్గాలు కూడ స్వచ్ఛంగా ఉండాలి. మనం బాగుంటేనే ప్రపంచం బాగుంటుంది. మనలని మన స్వచ్ఛంగ, పరిపూర్ణంగ ఉంచుకోగలిగితే ప్రపంచమూ అదే విధంగ ఉంటుంది.

ఒక ఆదర్శాన్ని తీసుకొని దానికోసం పనిచేయాలి. మన శక్తి అంతా దానికే ధారపోయాలి. మన ఆదర్శం సత్యపూరితమై ఉండాలి. మనచుట్టూ ఉన్నవారు వారి ఆదర్శాలని నెరవేర్చుకొనేందుకు మనం సాయపడాలి. సహనం లేకపోయినట్లయితే మనమీజీవితంలో ఏదీ సాధించలేము. మన భావోద్రేకాలకు అడ్డుకట్ట వేయలేకపోతే ప్రగతి సాధించలేము. తారకమంత్ర మిక్కడ అదుపులో ఉంచుకోడం విశృంఖలత దుఃఖాన్ని, వేదనని కలిగిస్తుంది.

ఇతరులకు సాయమందించే పనిలో నిమగ్నమైన వ్యక్తికి శాంతి కలుగుతుంది. ఇతరులకోసం పాటుపడేందుకేదో ఒక మార్గం లభిస్తుంది.

మన ప్రవర్తన మన శీలం మీద ఆధారపడి ఉంటుంది. మన శీలం మన అంతర్గత ఆలోచనలపై ఆధారపడి ఉంటుంది. మనలోని దివ్యత్వాన్ని వెలికి తీయడంపై ఆధారపడి ఉంటుంది.

ఇప్పుడు మనం గడుపుతున్న జీవితం అసత్యమైనది. దానికి మన ఆదర్శాలకి పొంతనలేదు. అంచేత దానిని పారద్రోలి, యదార్థమైన జీవితాన్ని వెలికి తీయాలి. అది అమృత ప్రాయము, అజరామరము.

సత్యాన్వేషణ గుహలలో, అడవులలో మాత్రమే సాధ్య మనుకొంటాడు మనిషి. కాని అది సరియైన ఆలోచనకాదు. అది ఏస్థితి గతులలోనైనా సాధ్యమే. సత్యాన్వేషణ చేసిన వారందరు గుహలలో, అడవులలో ముక్కు మూసుకొని కూర్చోలేదు. వారిలో కొందరు రాజ్యాలేలినవారు, సైన్యాలని నడిపినవారు, లక్షలాది ప్రజల శ్రేయస్సు కోసం పనిచేసినవారు, నిరంతరం శ్రమ చేసిన వారు ఉన్నారు.

**సమతుల్యమైన ఆధ్యాత్మిక జీవనం**

సరితూకం తప్పి ఉనికిలోకి వచ్చిన వస్తువుగా ఈ ప్రపంచాన్ని వర్ణిస్తుంటారు. అందుచేతనే దీనికి అంతటి చొచ్చుకొని పోయేశక్తి, నిరంతర చలనము, వ్యతిరేక శక్తుల మధ్య ఘర్షణ/రాపిడి ఏర్పడ్డాయి. ఈ కారణం చేతనే వ్యక్తుల జీవితాలలో, దేశాల చరిత్రలలో, జాతులలో, నాగరికతలలో పెనుమార్పులు, పైకి లేవడం, కిందపడడాలు. ఈ కారణం వల్లనే యుద్ధాలు కొన్నాళ్ళు, శాంతి కొన్నాళ్ళు ఉంటాయి. ప్రేమ ద్వేషం, స్వార్థం నిస్వార్థం పోటీ పడుతుంటాయి. ప్రపంచం నాశనానికి అంచులో ఉంటుంది.

ఒక వ్యక్తి గాని దేశంగాని గొప్పదనం సాధించాలంటే మూడు గుణాలవసరం. 1. మంచితనం మీద నమ్మకం, 2. ఈర్ష్య అనుమానాలు లేకుండడం 3. మంచిని పెంచే వారికి సాయం చేడయం.

మంచిగ ఉండడం, మంచిని చేయడమనే దానిని ఎల్లప్పుడూ అంటిపెట్టుకొని ఉండడం. నీతిలేనివారు/నీతిహీనులీలోకంలో ఆనందంగ

జీవించడం చూసి మనలో ఒక ఊగిసలాట కలగవచ్చు. కాని అది పనికిరాదు.

మండూకోపనిషత్తులో ఇలా ఉంది. "సత్యమొక్కటే జయిస్తుంది, అసత్యం జయించదు'. ఆ విజయం వెనువెంటనే జరగకపోవచ్చు, కాని అంతిమంగా అది తప్పదు. దాని ఫలితం మనకు భౌతికరూపేణ కనపడక పోవచ్చు కాని అంతరంగంలో తృప్తి కలుగుతుంది. బాహ్య ప్రపంచంలోని మన సంపద విజయాల వంటివి ఆంతరంగిక తృప్తితో పోలిస్తే ఏపాటి? అది జీవనసాఫల్యం అదిలేని ఆనందమేది? అందరూ శాంతిని కోరుకుంటారు. కాని శాంతికోసం ఏమి చేయాలో వాటిని పాటించరు. శాంతికాముకులు తమ ఆలోచనా సరళిని సరిదిద్దుకోవాలి. శాంతి సత్యానికి చేరువలోనే ఉంటుంది. మహాత్మాగాంధీ ఇలా అంటారు, "శాంతి మార్గమే సత్యమార్గం. శాంతి కంటె సత్యం గొప్పది. అసత్యం హింసకు మూలాధారం. నిజాయితీపరుడు ఎంతో కాలం హింసను కొనసాగించ లేడు. కొంతకాలానికి తాను హింసను కొనసాగించినంత కాలము సత్యానికి దూరమౌతానని హింస తనకవసరం లేదని గ్రహిస్తాడు".

మంచితనం జడపదార్థం కాదు. పైకి కనపడని విధంగ, గుప్తంగ పనిచేసినా దానికి విపరీతమైన శక్తి ఉంది. చాలామందికి మంచితనం చేసే మహత్తరమైన విషయాలు తెలియవు. ఎక్కువ మందికి మంచితనం మీద, నీతి నిజాయితీల మీద నమ్మకం ఏర్పడాలి. అదే ప్రస్థుత పరిస్థితిలో అవసరం.

సద్గుణాలు ఎంతవసరమో దుర్గుణాలంత అనవసరము. ముఖ్యంగ, ఈర్ష్య, అనుమానం ఉండరాదు. హింస ప్రపంచాన్ని అట్టుడికిస్తోంది. కత్తి, తుపాకి వీటికి బాహ్య రూపాలు మాత్రమే. అసలైన హాని కలిగించేది

ఈర్ష్య, అసూయ. ఏ మతగురువు మాటలువినో, ఇంకేదో మూఢనమ్మకం తోనో ఒక వ్యక్తి ఒక మంచిపని చేయవచ్చు కాని మానవాళిని నిజంగ ప్రేమించేవారెవరూ ఇతరుల పట్ల ఈర్ష్య, అనుమానం కలిగి ఉండరు. కీర్తికాంక్షతోనో, ధనాశతోనో ప్రపంచంలోని గొప్పవారు ఒకరిమీద ఇంకొకరు అసూయపడొచ్చు. అసూయ ఉన్నంత కాలము అహింసకు దూరం కాలేరు.

(మానసిక దౌర్భల్యమున్నవారికి) అభద్రతా భావమున్న వారికి అన్నిటిమీద, అందరిమీద అనుమానమే. తమచుట్టు ఏవేవో వ్యతిరేక శక్తులు, శతృబృందాలు ఉన్నట్లు ఊహించుకొని జీవితమంతా వాటితో పోరాడుతూ గడిపేస్తారు. ఈర్ష్య, అనుమానాలు లేకుంటే మనం మన శక్తిని మంచి పనులకు వినియోగించవచ్చు.

మూడవది:- మంచి ప్రవర్తన కలిగి ఉండి, ఇతరులకు మేలు చేసేవారికి సాయం చేయడం. మనం ఇతరులకు సహాయం చేస్తే వారి దగ్గరనుండి ఏదో ఒకటి, కనీసం కృతజ్ఞత అయిన ఆశిస్తాం. అలా కాకుండ (వసంతం) నీటి ఊట ఏవిధంగ అందరికీ ఉపయోగపడుతుందో ఆ విధంగ చేయడం నిజమైన సాయమంటారు శంకరాచార్యులు.

ఎటువంటి కోరిక కాంక్ష లేని వ్యక్తికి మాత్రమే నిస్వార్థంగ పనిచేసే శక్తి ఉంటుంది. తీవ్రమైన కాంక్ష ఉండే వ్యక్తి తనకెదురయ్యే ప్రతివ్యక్తిని, ప్రతిపనిని తమ కోరిక తీర్చుకోడాని కుపయోగిస్తాడు. తమకుపయోగపడే వ్యక్తులకే వారు సాయపడతారు. అది నిజమైన సాయం కాదు. మనమీ మూడు సద్గుణాలు కలిగి ఉన్నట్లయితే మనమెక్కడున్నా మంచి జీవితాన్ని గడపగలుగుతాం.

ప్రపంచం తనంత తాను మార్పు చెందినా చెందకపోయినా మంచివారి కోసం మారుతుంది. మనలని మనం జయించగలిగితే ప్రపంచాన్ని జయించగలము. ఎందుకంటే ప్రపంచమెక్కడో బయటలేదు. మనలోనే ఉంది. రక్తం ప్రవహింపచేసి రాజ్యాలు కైవశం చేసికొన్నవారి విజయం విజయమే కాదు. 'తమలోని అపరిపక్వమైన అహాన్ని జయించి దానిస్థానే పరిపక్వమైన అహాన్ని ప్రతిష్టింపచేసేవాడే' నిజమైన విజేత అంటారు శ్రీ రామకృష్ణ పరమహంస. అహంకారం నాశనమైనప్పుడే మనలని మనం దేవుని బిడ్డలుగ సేవకులుగ అనుభూతి చెందగలం.

నిజమైన సంతోషం మనకున్నవాటిని బట్టి కాకుండ, మనం ఏవీ లేకుండ జీవించగలుగుతామో అప్పుడానందం కలుగుతుంది.

దేవుడిని నిజంగా ప్రేమించేవాళ్ళు ఏ కులానికీ చెందరు. కుల వ్యవస్థని నమ్మరు. దైవప్రేమ శరీరాన్నీ, మనసుని, ఆత్మని పవిత్రం చేస్తుంది. భక్తి మనుషులకి ఔన్నత్యం కలిగిస్తుందంటారు శ్రీ రామకృష్ణ పరమహంస.

దైవం మీద మనసు లగ్నం చేయడం వలన ప్రాపంచిక సమస్యలకి దూరంగా ఉండొచ్చు అంటారాయన. ప్రాపంచిక సమస్యలు మనిషిని చుట్టుముట్టేసి ఉక్కిరి బిక్కిరి చేస్తాయి. దుఃఖం, వేదన కలిగిస్తాయి. ప్రాపంచిక విషయాలమీద మనసు కేంద్రీకరించినకొద్దీ అవి మనలని బంధింపచేస్తాయి.

రామకృష్ణులవారు రెండు సలహాలిస్తున్నారు సమస్యలనుండి దూరం కావడానికి. ఒకటి మరణాన్ని స్మరణలో ఉంచుకోడం, రెండు దేవునికి సమర్పించుకోడం. పుట్టిన ప్రతి ప్రాణీ మరణించక తప్పదు. పల్లెనుండి పట్నానికి పనిమీద ఎలాగ జనం వచ్చిపోతారో అదే విధంగ, మనం ఏదోపనిమీద ఈ లోకానికి కొచ్చాము అదవగారు వెళ్ళిపోతాము.

దేవుడికి నీ పవర్ ఆఫ్ పట్టా రాసియ్యి. నిన్ను ఏ వేదనా బాధించదు. మంచి వ్యక్తికి బాధ్యతలప్పగించి నప్పుడు కూడ ఏ అనర్థమూ కలగదు. దేవుని ఇచ్ఛ కొనసాగనీ.

మనిషికి , సమాజానికి ఉన్న సంబంధ బాంధవ్యాలను నిర్ణయించేదే 'జీవనకళ'. సమాజంలో తన విధులని, బాధ్యతలని నిర్వర్తిస్తూ, దేవుని మీద మనసు లగ్నం చేయాలి. దేవునికి తన జీవితాన్ని అర్పించాలి, సాధుపుంగవులతో సత్సంగం చేయాలి, తనపనిలో తాను నిమగ్నమయి ఉండే సమయంలో కూడ దేవుణ్ణి స్మరిస్తు ఉండాలి. తాను నిమిత్త మాత్రుణ్ణని, అంతా దేవుని దయ అని తలచాలి, తాను చేస్తున్నది దైవ కార్యమేనని భావించాలి, ఆ కార్యం యొక్క ఫలితాన్ని దేవునికే అర్పించాలి. మంచి జీవితం/ ఆధ్యాత్మిక చింతన యొక్క ధ్యేయం మన తోటివారికి సేవ చేయడమే, అది భగవదర్పితం చేయడమే.

మనిషి తాను వసుదైక కుటుంబంలోని ఒక భాగమని, భావించి, సమతుల్యత కలిగిన ఆధ్యాత్మిక జీవనాన్ని ఆలింగనం చేసుకోవాలి. పరమహంస యోగానంద ఇలా అంటారు. "ప్రపంచం మరల సామాన్య జీవితం గడిపే దిశగా నడిచే రోజు దగ్గర్లోనే ఉంది. మన జీవితంలోని ఇతర విషయాల ప్రాముఖ్యత తగ్గించుకొని దేవుని కొరకు సమయం కేటాయించాలి. మానవులంతా అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళు అనే జ్ఞానంతో బ్రతకాలి. ప్రపంచం రోజు రోజుకి చిన్నదై పోతూ ఉంది. అసహనం; అపోహ పోవాలి."

శాస్త్రపరిజ్ఞానం, టెక్నాలజి, అంతర్జాలం (internet) సాయంతో ప్రపంచంలోని దేశాలు దగ్గరవుతున్నాయి. ప్రపంచం చిన్న ప్రాంతంగ మారిపోతూ ఉంది. పరస్పరం పొత్తు కుదరని ఆలోచనలు, భావాలు ఉన్న

మనుషులకు ఒకటే కుటుంబంలో ఇమిడి ఉండడం కష్టం. దేశాల విషయంలో ఇది మరింత కష్టం. ముఖ్యంగా ప్రేమరాహిత్యం దీనికి కారణం. వ్యక్తులు కూడ ఈ సమస్య నుండి విముక్తులు కావాలంటే మానవాళి అందరికీ శాంతిని, సామరస్యాన్ని చేకూర్చగల అంశాలను పెంపొందించుకోవాలి. మనస్ఫూర్తిగ, ఆత్మావలోకనం చేయాలి. ఆధ్యాత్మిక చింతన చేకూర్చగల అంశాలను పెంపొందించుకోవాలి. మనస్ఫూర్తిగ, ఆత్మావలోకనం చేయాలి. ఆధ్యాత్మిక చింతన చేకూర్చుకోవాలి. మానవాళి ప్రస్థుతం ఆధ్యాత్మికత లభించక అర్భకంగ తయారయ్యింది. శాస్త్రపరిజ్ఞానం, టెక్నాలజి భూమీ్మదుండే సమస్త జనాలకు ఆహారమందించడానికి మార్గాలు నేర్పింది. సంపన్న దేశాలు కూడ అసంతృప్తితో రగులుతున్నాయి. తమ జీవితాల కర్థమేమిటో తెలియక చకితమవుతున్నాయి. అసంతృప్తి అభివృద్ధికి మార్గాలు వెతుకుతుంది. ఈనాడున్న ఒత్తిడులు మనకొక మార్గం చూపాల్సి ఉంది. ఎక్కడ తప్పు జరిగిందో, లోపమెక్కడుందో, మన జీవిత ధ్యేయమేమిటో, దీనికి పరిష్కారమేమిటో, దానిని ఆచరించేదెట్లాగో తెలుసుకోవాలి.

'జీవిత ధ్యేయం సత్యాన్వేషణ' అంటారు పరమహంస యోగానంద. మనకు వేరు వేరు ధ్యేయాలుండొచ్చు. చివరిది, అంతిమమైంది, అతి ముఖ్యమైనది ఒకటే:– తనను తాను తెలుసుకోడం, తనలోని దైవాన్ని తెలుసుకోడం, ఆ దైవమే సత్యమని తెలుసుకోడం. ఆధ్యాత్మిక పేదరికమంటే అర్థం ఆత్మ అలమటిస్తున్నదని అర్థంకాదు. ఆత్మ అంతంలేదు. ఆత్మే జీవనం, ఆత్మ ప్రేమ, మనలని నిలబెట్టేది ఆత్మ. మనమా అంతరాత్మ తలుపులు మూసివేస్తే మనలోని కరుణ, ధైర్యము వంటి ఉన్నత గుణాలు ఆకలితో అలమటిస్తాయి. అభివృద్ధి కుంటు పడుతుంది. అటువంటి గుణాలు మాయమే అయిపోవచ్చు.

దైవత్వం, శాశ్వతత్వం మనం కొత్తగా సంపాదించుకోవలసిన అవసరంలేదు. అది ఇదివరకే ఉంది. కాని మనకది తెలియదు. వేదం ఏం చెప్తుందంటే "కదలకుండ ఉండు నేనే దేవుడినని" తెలుసుకో. నీవు చలనం లేకుండ ఉన్నప్పుడు, నీ మానసిక పరిధిని అధిగమించినపుడు, నీ అంతరంగంలోకి అవ్యాజమైన ప్రేమ, ఎల్లలు లేని దైవాంశం, అంతులేని వివేచన ప్రవహిస్తాయి. అదే మన అసలు సిసలు నిజం. కాని ఆస్థితిని చేరుకోవాలంటే సరియైన ఎరుక చైతన్యం కావాలి.

వివేచన, సత్యము, దైవత్వము మన జీవితాలని దృఢంగ బంధించి ఉంచుతాయి. దైవధ్యానం అందులో ముఖ్యమైనది. ధ్యానానికి సమయం లేదనే వారికి నిజంగా ఆసమయం లేకకాదు. (అలజడి) అశాంతికి అలవాటుపడడం. దైవం కోసం సమయం లేదంటే నీవు నీకోసం సమయం లేదని చెప్పడం. అంతరాత్మకి సమయం లేదని చెప్పడం. అది అన్ని విధాల నష్టాలకి, అపజయాలకి దారితీస్తుంది. ఆధ్యాత్మిక సమతూకం సాధించిన వ్యక్తికి అపజయం ఉండదు. మనిషి జయాప జయాలు మనకున్న సంపద వగైరాలని బట్టి కాకుండ మనమేమిటి అనే దానితో కొలుస్తారు. నీవు ఇతరులకేమిచ్చావు అనేది కొలమానం. అశాంతి అనేది (అంతరంగం యొక్క రోగం) మానసిక రోగం. అశాంతి, అసంతృప్తి అసమానం, అలజడి, కారుణ్యలేమి అన్నీ పరస్పరాధారం. ధ్యానానికి సమయం లేకపోవడమనేది ఒక జబ్బు. ఆ జబ్బున్నట్లు గుర్తించగానే దానికవసరమైన చికిత్స చేయాలి. లేకపోతే ఆధ్యాత్మిక జీవనం అపరిపక్వంగానే ఉంటుంది.

వస్తువులు, భౌతికమైన సంపద వగైరాలు తాత్కాలికంగ సంతోషాన్ని కలిగించొచ్చు. కాని అంతరంగం అశాంతితో ఉంటుంది. ఆ అశాంతిని పోగొట్టుకోవాలని ఏవేవో చేస్తాడు మనిషి, మరింత అశాంతిలో కూరుకొని

పోతాడు. సమస్యల నుండి పారిపోయే ప్రయత్నం చేస్తాడు కాని సరియైన పద్ధతికాదు. సమస్యల నెదుర్కోకపోతే అవి అట్లాగే ఉండిపోతాయి. అశాంతి కొనసాగుతూనే ఉంటుంది.

కొందరు తమ గతవైభవాన్ని ఆధారం చేసుకొని బ్రతకాలని చూస్తారు. గతమెంత గొప్పదయినప్పటికీ ఇప్పటి నీ పరిస్థితి ఏమిటి అనేది ముఖ్యం. నేడు నీవేమిటి అనేదే ముఖ్యం. మనం గతం అనే చెట్టు ఫలాల కోసం అర్రులు చాస్తాం, మూలాలైన వేర్లని విస్మరిస్తాం. ఆనాటి ఘనత నేటి క్షీణదశను కాపాడలేదు. గతాన్ని మరచిపో, నేటి గురించి, రేపటి గురించి ఆలోచించు. వర్తమానం; భవిష్యత్తు మీద దృష్టిపెట్టు.

'నాకు మళ్ళీ పాత బ్రతుకును బ్రతికే అవకాశం ఇస్తే' అని కొందరంటుంటారు. అది సమంజసమైన ఆలోచన కాదు. మనకు ఆరోగ్య సూత్రాలన్నీ తెలుసు. కాని వాటిని పాటించం ఎగ్గొడతాము. సంతులిత ఆహారమేదో తెలుసు. కాని మనమది స్వీకరించకుండ మన జిహ్వాచాపల్యాన్ని తృప్తిపరిచే ప్రయత్నం చేస్తాం. విజయం సాధించడానికి ప్రకృతి కొన్ని నిర్దిష్ట సూత్రాలేర్పరిచింది. మనకవి తెలుసు కాని పాటించము. మనంతట మనం వాటిని మరుగు పరుస్తాము. ఆ తరువాత మనం విధిని తిడతాము.

తల్లిదండ్రులు పిల్లలకవి చెయ్యొద్దు, ఇవి చెయ్యొద్దు అని నీతి సూత్రాలు చెప్తారు. కాని ఆ పిల్లల ముందే వాటిని ఉల్లంఘిస్తారు.

'నా గత జీవితాన్ని మరల జీవించే అవకాశమొస్తే' అనే వ్యక్తి గతంలో కంటె తానిప్పుడు వివేక వంతుడయ్యాడని నమ్ముతున్నాడని అర్థం. అదే నిజమైతే గతాన్ని, గతంలో చేసిన తప్పులని, పాపాలని, కలిగిన వేదనని పక్కన పెట్టి ఇప్పటి జీవితాన్ని సరికొత్తగా, ఏ నిముషానికా నిముషం

మంచితనంతో బ్రతకొచ్చు. ఏ రోజుకారోజు వినూత్నమైన ఆలోచనలతో పరిశుద్ధమైన భావాలతో ఆరోజు కాని ఆ క్షణాల్నికాని మరల తిరిగి రావన్నట్లుగా, ఆరోజు, ఆక్షణం మాత్రమే మిగిలి ఉన్నాయన్నట్లు ప్రవర్తించాలి. ఒక నావ కెప్టెన్ ఆ నావను అడుగడుగున జాగ్రత్త తీసుకొని ముందుకు నడిపించినట్లు జీవితనౌకని నడిపించాలి. గతం గురించి బాధ, భవిష్యత్తు గురించి ఆందోళన వదిలేయాలి. అంతరాత్మ ప్రబోధాల ననుసరించి జీవితాన్ని సరికొత్తగ మొదలుపెట్టి ఆ రోజే తనకి ప్రపంచం లోని ఇతరులకి కొత్త జీవితానికి నాంది అని భావించాలి.

మాదక ద్రవ్యాలకలవడిన వ్యక్తిని ఆ అలవాటు మాన్పించడానికి మరికొన్ని మాదక ద్రవ్యాలివ్వరు. అదే విధంగా అశాంతితో రగులుతున్న వ్యక్తికి మరింత అశాంతి కలగచేసే ప్రక్రియ మంచిదికాదు. ధ్యానమొకటే దానికి మందు. శరీరాన్ని, మనసుని, భావోద్రేకాలని అంతరంగాన్ని నిశ్చలంగ నిలపడం, దైవత్వంతో నింపడమొకటే మార్గం.

ధ్యానం మన అంతర్గతంలోని ఉన్నత భావాలను బాహ్య ప్రపంచం లోని జీవితానికి అనుసంధానం చేస్తుంది. ఈ ప్రక్రియ మనలని మన కుటుంబం నుండి గాని ఇతర సంబంధాల నుండి తెంచివేయదు. దాని బదులు బంధాలను మరింత పటిష్టం చేస్తుంది. మనలో ప్రేమని, సేవాతత్పరతని పెంచుతుంది. ఇతరుల శ్రేయస్సుకోసం ఎప్పుడు మనం ప్రార్థన చేస్తామో అప్పుడే మన ఆధ్యాత్మిక చింతన మొదలవుతుంది.

ధ్యానమంటే చాలామందికయిష్టం. ధ్యానం చేయడానికి సమయం లేక తమ అంతరంగాల్లోకి తొంగిచూసే ధైర్యం లేక తమలో ఉన్న తమకిష్టం లేని అంశాలకు ఎదురుపడే సాహసం చెయ్యలేక దాని బదులు ఏవేవో బహిర్గత విషయాలతో పొద్దుపుచ్చుతారు.

మానసిక సోమరితనం దీనికి కారణమని పతంజలి అంటారు. అదే ఆధ్యాత్మిక చింతనకడ్డుపుల్ల వేసేది. కొందరు సరే! దేముడా! నేనీరోజు నీవు నాకిచ్చిన సమస్యలతో తలమునకలుగా ఉన్నాను. రేపు నీ గురించి ఆలోచిస్తాను" అంటారట. యుగయుగాలుగ, లక్షలాది జనం సాకునే అడ్డం పెట్టుకొన్నారు. ఇదొక భ్రమ. ఎందుకంటే 'ఆ రేపు' రానేరాదు.

ఇటువంటి సర్దుబాటు తత్వముతో తమ జీవితాలను బాగుపరచు కొనే అవకాశాన్ని వినియోగించుకోరు. తీరా తమ జీవితాలు వేదనతో, ఆశాభంగాలతో, ఛిద్రమయ్యే వరకు వేచి ఉండి అప్పుడు దేవుడి దెశ తిరుగుతారు. తమ జీవితం విచ్ఛిన్నమయ్యేవరకు, బాధా తప్తమయ్యే వరకు ఎందుకు వేచి ఉండాలి? చిన్న ప్రయత్నం చేస్తే చాలు. ధ్యానం దేవుని ఉనికిని మీలో నింపుతుంది.

మనస్సాక్షి అంతరాత్మ ప్రబోధాల కనుగుణమైన జీవితం ఎంతో మార్పు తెస్తుంది. సమతుల్యత కలుగచేస్తుంది. పరమహంస యోగానంద ఈ విధంగ ప్రార్థిస్తారు.

"తల్లీ! జగన్మాతా! నేను నా యీ జీవితాన్ని ఆనందంగ గడిపే మార్గం బోధించు. నా విధులను నిర్వర్తించడంలో నాకానందం కలిగేట్లు చెయ్యి. ప్రకృతిలోని సౌందర్యాన్ని ఆస్వాదించనియ్యి. నీ సృష్టిలోని అందాలను అవలోకించనీ, జీవితంలోని స్వచ్ఛమైన ఆనందాలని అనుభవించనీ, వ్యతిరేక భావాలని, అందరూ ఆనందిస్తూ ఉంటే ఆ ఆనందాల మీద, చల్లనీళ్ళు కొట్టి ఏడిపించే తత్వాన్ని నాలో కలగకుండ నన్ను రక్షించు".

ఆధ్యాత్మిక జీవనం గడిపే సాధువు పసిపాపలాగ జీవితంలోని సామాన్యమైన ఆనందాలని ఎంతో గొప్పగ అనుభవిస్తాడు. చాలామంది

కిటువంటి ఆనందాలని అనుభవించే అనురక్తి ఉండదు. బయటి విషయాలమీద ఉన్నంత ఆసక్తి వారికిందులో ఉండదు. లోపలంతా లొట్ట. తాగుడు వంటి వాటికి అలవాటుపడతారు. విలువలు లేక పోవడమే అన్ని దౌర్భాగ్యాలకు మూలకారణం. ప్రస్తుత సమాజంలో ఉన్నదంతా చీడ; అనారోగ్యం. 'నేను ప్రశాంతతను పొందేదెట్లాగ' అనడుగుతుంటారు. 'దీనికి వేరే మార్గంలేదు. దేవుడిని వేడుకోడం తప్ప'. ధ్యానం, నేటి ఒత్తిళ్ళనుండి, అలజడి నుండి కాపాడి మానసిక సమతుల్యతని ఏర్పరుస్తుంది.

అధ్యాయము 5

# జీవితంలోని మార్గాలు

జీవితం అనంతం. అందులోని పుటలన్నీ (అధ్యాయాలన్నీ) క్షుణ్ణంగ అర్థం చేసుకొంటే తప్ప మొత్తం అర్థం కాదు. మనం ఈ భూమ్మీద జీవించేది కొద్దికాలం మాత్రమే. ఆ కొద్ది అనుభవంతో జీవితాన్నర్థం చేసుకోడం కష్టం. అదొక వ్యర్థ ప్రయాస. అప్పుడు బలహీనులపై దృష్టి పెట్టడానికి సమయం చాలదు అలాగ కాకుండ ఈ ప్రపంచం ఒక పాఠశాల అని, అటువంటి బడులనేకమున్నాయని, వాటిగుండా ప్రయాణం చేస్తే తప్ప మనమన్నీ తెలుసుకోలేమని అవన్నీ కూడ శాశ్వతమైన ప్రకృతి ధర్మాలననుసరించి నిలకడ కలుగుతుంది. మనచుట్టూ ఉన్న మనుషులను పరికించే సమయము, వారికి సాయం చేసే అవకాశము కలుగుతాయి.

వివేకానంద ఇలా అంటారు: " ఈ భౌతిక ప్రపంచం, ఇంద్రియాల మీద ఆధారపడ్డ ప్రపంచం, అనంతమైన విశ్వంలో ఒక భాగం మాత్రమే. దీనికి పైనున్న అనంతంలో చెడులేదు (ఉండదు)".

ఇంద్రియాలు మనలను భ్రాంతిలో ఉంచుతాయి. చనిపోయిన తరువాత కూడ ఇంద్రియాలుండాలని కోరుకొంటారు మనుషులు. కొందరయితే పైలోకాలలో వారికి మరిన్ని అవయవాలుంటాయని, దేవుడు మానవరూపంలో సింహాసనం మీద కూర్చొని ఉంటాడని, అక్కడ ఇంతకంటె ఆనందాలలో తేలిపోవచ్చని, ఈ భౌతిక ప్రపంచం అక్కడ కొనసాగుతుందని ఏదేదో ఊహించుకొంటారు. శరీరమే పరమావధిగ భావిస్తారు.

ఈ జీవితమొక వ్యాయామశాల. ఇది శాశ్వతం కాదు. పారమార్థిక మైన జీవితమే నిజమైన జీవితం. భౌతక జీవితాన్నధిగమిస్తేనే నిజమైన ఆనందం ప్రాప్తిస్తుంది.

అమూర్తమైన విషయాలనుండి సామాన్యమైన విషయాలపై దృష్టిపెడితే మన జీవితంలో ఎన్నో వైరుధ్యాలు మనకు కనపడతాయి. మనిషి కోరుకొంటే అన్నీ తెలుసుకోగలడనుకొంటాం. కాని కొన్ని అడుగులు ముందుకు వేయగానే ఏదో ఒకటి అడ్డుగోడలాగ నిలిచి అతడిని నిరోధిస్తుంది.

ఈ జీవితంలో ఆనందం, ఆవేదన కలిసే ఉంటాయి. జీవించడం, మరణించడం ఒకే అంశానికి చెందిన రెండుముఖాలు. అవి వేరు వేరు కాదు. మంచి, చెడు, సంతోషం, దుఃఖం అన్నీ జంటగానే ఉంటాయి.

జీవితమొక నిరంతర పోరాటం. ప్రతిక్షణము మన అంతర్గతానికి బయటి శక్తులకీ ఘర్షణ జరుగుతూనే ఉంటుంది. మనం జీవించి ఉండ డానికి తిండి, గాలి కావాలి. అవి దొరకకపోతే మరణం తథ్యం. మనం పోరాటంలో ఓడిపోతే మనకు మరణం ప్రాప్తిస్తుంది. జీవించి ఉన్నంత కాలము ఈ పోరాటం తప్పదు. ఈ జీవితం పరిసమాప్తమైతేనే మనకు ఈ వేదన పరిసమాప్తమవుతుంది. జీవితంలోని ఈ వేదనను మరచి పోవాలంటే ఒకటే మార్గముంది. అదేమంటే ఇతరుల వేదనను పంచుకోడం, వారిని బాధ నుండి తప్పించుకొనేందుకు సాయపడడం, ఎదుటివారి వేదనను పంచుకోడం వలన మన బాధలను మరచిపోతాము. మన మనసు నిర్మలమవుతుంది. మనలని మనం మరచిపోవడమనే గొప్ప పాఠాన్ని నేర్చుకొంటాము. మన జీవితంలో ఎన్నో దశలున్నాయి. జీవద్రవం నుండి శిశువు, ఆపైన బాల్యం, కౌమారం, యవ్వనం,

వృద్ధాప్యం దశలవారీగా పరిణామం చెంది జీవితం కొనసాగుతుంది. ప్రతి పరిణామమొక మెలిక. జీవద్రవం నుండి దైవాంశ సంభూతుడగు మానవుడు జన్మించడం ఈ జీవితలక్ష్యం.

ఈ దశలన్నిటికి ఆధారభూతమే జీవద్రవ్యం. ఈ దశలలోని పరిణామాలకు మూలం ఆ జీవ ద్రవ్యం. అదే దశలవారీగా, నెమ్మది, నెమ్మదిగా బయటకొస్తుంది. ఈ గొలుసుకట్టు జీవనానికి ముఖ్యమైన అంశం అణురూపంలో, సూక్ష్మరూపంలో ఆ జీవద్రవ్యంలో ఉంటుంది. అది సర్వాంతరంగ వ్యాప్తమై ఉన్న ప్రకృతి ధర్మంలోని భాగం.

మరణం లేని జీవితం లేదు. జీవితం లేని మరణం లేదు. అవి రూపాంతరాలు మాత్రమే. తేడాలేమీ లేవు. ఏకత్వమే జీవనసారాంశం. ఎదుగుదల జీవన లక్షణం. స్థగితం మరణ లక్షణం. ప్రేమించడం జీవన మార్గం, ప్రేమరాహిత్యం మరణం.

జీవితం బుద్బుద ప్రాయం. వ్యక్తి విజ్ఞానఖని కావచ్చు లేదా పశు ప్రాయుడు కావచ్చు అత్యంత పేదవాడు కావచ్చు, పెద్ద ధనవంతుడు కావచ్చు, రాష్ట్రానికో, దేశానికో అధికారి కావచ్చు. ఏమీలేని నిరుపేద కావచ్చు, క్రూరమైన వ్యక్తి కావచ్చు, దయాగుణం కలవాడు కావచ్చు. అందరి జీవితానికి ఒకే ఒక్క మోక్షమార్గముంది. అది దైవత్వము. మనిషి తనలోని దైవాంశను కనుగొన గలిగినప్పుడే అతడి జీవితం అమృత ప్రాయమవుతుంది లేదా భరించరానిదవుతుంది.

## వేదాంతపరమైన జీవితం

ప్రపంచంలోని వివిధమతాలు పరస్పర విరుద్ధం కావు. అవన్నీ ఒకే మతానికి చెందిన వేరు వేరు దశలు. శాశ్వతము, అజరామరము

అయిన ఆ విశ్వమతం వేరు వేరు జాతులకు, వేరు వేరు బుర్రలకు వేరు వేరుగ గోచరిస్తుంది. నీ మతం, నా మతం, మా దేశపు మతం, మీ దేశపు మతం అంటూ ఏవీ లేవు. స్వామి వివేకానంద ఇలా అంటారు. "ఎవరి అవసరాలకు తగినట్లు వివిధ పరిస్థితులకు, వివిధ ప్రాంతాలకు తగినట్లు ఆచరించగలిగిందే మతం" వేదాంతం సర్వమత సారాంశము: అది నవీనం కాదు. దైవమెంత ప్రాచీనమో వేదాంతమంత ప్రాచీనం. అది ఒక ప్రాంతానికి, ఒక సమయానికి కట్టుబడి ఉండదు. 'రెలిజియన్' అనగా బంధించి ఉంచేది అనర్థం. వేదాంతమనగా అదే అర్థం.

వేదాంతంలో మూడు ముఖ్యాంశాలున్నాయి. ఒకటి: దైవత్వం మానవుని అసలునైజం. రెండు: మనలోని దైవత్వాన్ని సందర్శించడం మన జీవిత కర్తవ్యం. మూడు: అన్నిమతాలు మొదటి రెండు అంశాలతో ఏకీభవించడం.

మనిషి నిజమైన ఉనికి అతడి దైవత్వమైనప్పుడు ఈ కనపడే భౌతిక ప్రపంచం, ఇంద్రియాలనుభవంలో నున్న ఈప్రపంచం మిధ్య. నిరంతరం మార్పుకు లోనయ్యే ఈ ప్రపంచం డొల్ల. కొండలు నీడలు మాత్రమే నంటాడు టెన్నిసన్ (Tennyson)

మార్పుకు లోనయ్యే ఈ భౌతిక ప్రపంచం లోతుల్లో మార్పు చెందని దైవత్వముంది. దానికి బ్రహ్మమంటారు. అదే ఉనికి. అదే చైతన్యము. అదే ఆనందము. ఆనందం ప్రశాంతత మాత్రమే కాదు, పరమ సుఖం కూడాను.

బ్రహ్మం అనిర్వచనీయం. ఇంద్రియాలకి కాని, విజ్ఞానానికి కాని అందనిది.

బ్రమ్మం సర్వవ్యాప్తం. అది అందరిలోనూ, అన్నింటిలోనూ నిక్షిప్తమై ఉంటుంది. ఆత్మవలె అనుభవ గ్రాహ్యం కానిది, సర్వవ్యాపకమైనది.

వేదాంత పరంగా మానవ జీవితధ్యేయం మనలోని ఆత్మని సాక్షాత్కరింప చేసుకోడం. ఆత్మే మన నిజమైన ఉనికి. దానిని అనుభవం లోకి తెచ్చుకోవాలంటే, "నేను ఇప్పుడు జీవిస్తున్న జీవితం నాకు అసంతృప్తిగా ఉంది, నా నైజం నాకు నచ్చడం లేదు అని అంగీకరించడం". మనం లోతుగ తరచి చూస్తే మన జీవితం కోరికల పుట్ట. అనుకంపనల సమూహం. మనచుట్టూ ఉన్న పరిసరాలకు, పరిస్థితులకు అనుగుణంగ ఉంటుంది మన ప్రవర్తన. పరిస్థితులు, పరిసరాలతో పాటు మారుతూ ఉంటుంది.

మన నిజమైన స్వభావం (దైవత్వం) మన అహంకారపు పొరలలో దాగి ఉంటుంది. అహంకారం మన నిజస్వరూపాన్ని కప్పివేస్తుంది. అహంకారం వల్లనే నేను, నాది, నా కోరిక, నా గొప్ప, నా స్వార్థమనే భావనలు కలుగుతున్నాయి. నిజానికి ఈ విశ్వంలోనిదేదీ వేరు వేరు కావు. ఒకే మూలం నుండి పుట్టిన భిన్నరూపాలు. విజ్ఞానశాస్త్రం కూడ ప్రతీ ప్రాణీ, ప్రతీ వస్తువు, ప్రకృతి సిద్ధంగా, మానసికంగా, భౌతికంగా రాజకీయంగా, ఆర్థికంగా ఒకదానితో మరొకటి పెనవేసుకొని ఉన్నాయి అంటుంది.

ఈ విశ్వంలోని అన్ని ప్రాణులు, అన్ని వస్తువులు ఒకటే, నేను కూడ అందులో అంతర్భాగాన్నే, నేను వేరు కాదు అనే అంశాన్ని అంగీకరించడమంత సులభమైన విషయం కాదు. నేను, నాది, నా విజయం, నా పరాజయం అనే భావనలు వీడడం అవసరం. బాధ్యతలు నిర్వర్తించాలి, ఫలితాన్ని గురించి ఆలోచించరాదు. ఈ శరీరం ఆత్మాను

సారం పనిచేసే ఒక పనిముట్టు మాత్రమే అని భావించాలి. ఈ విధమైన స్ఫూర్తితో చేసే ప్రతిపని పూజతో సమానం.

వేదాంతం ప్రత్యేకమైనది, విశ్వజనీనమైంది. అది హిందూ ఆధ్యాత్మిక పరంపర నుండి వడగట్టిన సారాంశం.

వేదాంతం ఎల్లలులేనిది, అనంతమైనది, ఆధ్యాత్మిక చైతన్యానికి దారిచూపే నిరంతర స్రవంతి. ఇదే మన జీవననౌకకి ఆధారం, మన వివేచనకి మూలం, మన నిత్యంజీవితంలో తీసుకొనే అనేకమైన నిర్ణయాలను స్ఫూర్తివంతం చేసేది.

వేదాంతపరమైన జీవితంలో మాటలకు, చేతలకు ఘర్షణ ఉండదు. చేతనత్వానికి, అనాలోచిత చర్యలకు మధ్య స్పర్థ ఉండదు, వ్యక్తిగత జీవితానికి, బహిరంగ జీవితానికి తేడా ఉండదు. అంతరంగంలోని నమ్మకాలకి, బాహ్యా జీవితంలోని చేతలకి పొంతన, అవగాహన ఉంటుంది. మనకు, మనచుట్టూ ఉన్న ప్రపంచానికి, అనుబంధం కలిగించేదిగ ఉంటుంది.

మన జీవిన విధానమే మనకు ప్రామాణికం, ఋజువు. మతం గురించి, ఆధ్యాత్మికం గురించి మనం మాట్లాడే మాటలకు వాటిని మన నిజ జీవితంలో పాటించలేనట్లయితే, అర్థమే ఉండదు. మన చేతల ఆధారంగ ప్రజలు మనల్ని విశ్వసిస్తారు. కేవలం మన మాటలని బట్టి కాదు. మాటలకి చేతలకి మధ్య పొంతన లేనట్లయితే మనం తగిన జాగ్రత్త తీసుకోవాలి. లోపాలను సరిదిద్దుకోవాలి.

కొందరు నీతిని గురించి, నిజాయితీని గురించి, దాతృత్వం గురించి, హక్కుల గురించి, మంచి విషయాలనుగురించి అద్భుతమైన ఉపన్యాసా

లను, అనర్గళంగా ఇస్తుంటారు. కాని వాటిని పాటించరు. చెప్పేదొకటి చేసేదొకటి. వేదాంతపరమైన జీవనం సాగించేవారు చిలుక పలుకులు పలకరు. తాము ఆచరించేదే చెప్తారు. చెప్పేదే చేస్తారు: సిద్ధాంతం వేరు ఆచరణ వేరు కాదు.

వేదాంతులు సత్యాన్ని ప్రేమిస్తారు. శ్రీ రామకృష్ణ పరమహంస సత్యాన్ని తప్ప అన్నింటినీ విసర్జించారు. సత్యమే ధ్యేయము, సత్యమే వారికి మార్గము.

తనలోని దైవత్వాన్ని సాక్షాత్కరింప చేసుకొన్న వ్యక్తి తనకులేని దాని గురించి గాని, ఉన్నదాని గురించి కాని ఆలోచించడు. జయాపజయాల గురించి మదనపడడు. తన జీవితం గురించి కాని మరణం గురించి కాని యోచన చేయడం, పూర్తిగ స్వతంత్రత కలిగి అన్నింటికి అతీతంగ ఉంటాడు. అన్నిటికి అతీతంగ ఉండడమంటే నిర్లిప్తంగా ఉండడం కాదు. నిస్వార్థమైన ప్రేమ కలిగి ఉండడం. తనలోని దైవత్వాన్ని దర్శించిన వ్యక్తి అన్నింటికి అతీతంగ ఉండగలుగుతాడు. నిజమైన స్వచ్ఛతని, ఆనందాన్ని, స్వేచ్ఛని, వివేచనని అనుభవిస్తాడు.

విరక్తి అనురక్తికి వ్యతిరేకం కాదు. అది ప్రశాంత చిత్తత. అలౌకికమైన ప్రశాంతత. ప్రేమతో నిండిన అనురక్తి. వైరాగ్యము, దేవుని యడల ప్రేమ పరస్పరాధార భూతము. క్షుద్రమైన కోరికలు మనలని మన జీవిత ధ్యేయం నుండి దూరంగ ఉంచుతాయి. శ్రీరామకృష్ణ పరమహంస ఇలా వివరిస్తారు. దారంలోని ఒక్క చిన్న పోగు బయటికి పొడుచుకొని ఉన్నా దారం సూది కంట్లో దూరలేదు, మన కోరికలే ఆ దారం పోగులు. మన ధ్యేయానికడ్డు పడే అవరోధాలు'.

చాలా మట్టుకి ఈ అవరోధాలు మనం కల్పించుకొన్నవే. అవరోధాలను తట్టుకొనే ఓర్పు చాలా అవసరము. ఏది ఏమైనా మన లక్ష్యాన్ని మనం మరవకూడదు. ఇతర ప్రలోభాలకి లొంగకూడదు. చిత్త చాంచల్యం మనలని నిర్వీర్యం చేస్తుంది. మన పతనానికి దారి తీస్తుంది. నిజమైన జ్ఞానమేదంటే అన్నింటా నేనున్నాను, నాలో సమస్తము దాగి ఉంది అని తెలుసుకోడమే. ఇదే వేదాంతం యొక్క అంతిమ లక్ష్యం.

(Mr. Merton) మెర్టన్ అనే ఒక భిక్షువు కొక అద్భుతమైన అనుభవం ఒక వీధిమూలలో కలిగింది. ఒక స్వచ్ఛమైన వజ్రం అన్ని కోణాలలో తన మెరుపుని ఏ విధంగ ప్రసరింప చేస్తుందో అదే విధంగ దైవదత్తమైన వెలుగుని నేను అందరి హృదయాలలో జ్వలించడం చూశాను. అన్ని దిశలలో ప్రసారమవుతున్న ఆ వెలుగు రేఖలన్నీ, కిరణాలన్నీ ఒకే చోట కేంద్రీకరింపబడితే మొత్తం చీకటిని, క్రూరత్వాన్ని పూర్తిగ పారదోలుతుంది. అటువంటి ప్రకాశాన్ని నేను దర్శించాను. అది నాకు దక్కిన అపూర్వమైన అనుభవం' అన్నాడాయన.

భగవద్గీతలో శ్రీకృష్ణుడు ఇలా అంటాడు, 'అన్నింటా నేనున్నాను అన్నింటా నన్ను దర్శించగలగడమే నిజమైనదని, అన్నింటా, అందరి లోనూ దైవాన్ని చూడగలిగినవాడు, మానవాళి సేవకర్పితమవుతాడు. పేదవారిలో, బలహీనులలో శివుణ్ణి దర్శించగలిగిన వాడే ధన్యుడు. శివుని విగ్రహంలో మాత్రమే దర్శించేవాడు నిర్భాగ్యుడు' అంటారు వివేకానందుడు.

వేదాంతమంటే మూలాల్ని వెతుక్కోవడం, మనలోని దైవత్వాన్ని దర్శించుకోడం, మానవులుగ పుట్టినందుకు మన బ్రతుకు సార్ధకం చేసుకోడం అదే అంతిమ లక్ష్యం.

మనం లక్ష్యాన్ని త్వరగా చేరుకొనేది, నిదానంగ చేరుకొనేది మన ప్రయత్నాల మీద ఆధారపడుతుంది. మనమీ ప్రయాణం మొదలు పెట్టగానే తెలిసిపోతుంది. దీనిని ఆపడం కష్టమని ప్రతి చిన్నవిషయం నుండి పెద్ద విషయం దాక ఆనందమయమైపోతుంది. వేదాంత పరమైన ఈ జీవితమే ఆనందదాయకమని తెలుస్తుంది. మన జీవితం మనకొక వరమని, ఇతరులకు కూడ వరప్రదాయిని అవుతుందని అర్థమవుతుంది.

## హిందూధర్మం

తమ ప్రవర్తనా నియమావళితో, శాస్త్రసంబంధ నియమ నిబంధనలతో, నిషేధాలతో చాలా మతాలు, తమ మతాన్నాచరించే వారి జీవితాలను నియంత్రించాలని చూస్తాయి. వేదాంత ధర్మానికి, హిందూ ధర్మానికున్న తేడా ఏమిటంటే వేదాంతం శాశ్వత సిద్ధాంతాలకు, హిందూ ధర్మం క్రతువులు, ఆచారాలకు లోబడి ఉంటుంది. దీనిని 'మీమాంస' పద్ధతి అని కూడ అంటారు. హిందువు జీవితం మొత్తం హిందూ ధర్మాదేశ ప్రకారం నడుస్తుంది.

పుట్టినది మొదలు మరణం వరకు మతగ్రంథాల ఆదేశానుసారము నడుస్తుందని 'అగ్నివేష గృహ్యాసూత్రం' చెప్తుంది. హిందువు ఏ ఏ నియమాలను, ఏ ఏ సందర్భాలలో ఏ విధంగ ఆచరించాలో హిందూ మత గ్రంథాలలో ఉన్నాయి. 'మను ధర్మ శాస్త్ర ప్రకారం, శృతి (వేదం) స్మృతి (ఆచారవ్యవహారాలు) హిందువుల జీవితాన్ని శాసిస్తాయి. వీటి ఆదేశాలనుల్లంఘించడం సహించడంజరగదు. మనువు ఇలా అంటాడు, "ఆధ్యాత్మిక జీవన సరళిని ఎన్నుకొన్నవాడు, ఆ రెండు (శృతి, స్మృతి) శాస్త్రాల నియమాలను పాటించని వారిని నాస్తికులుగ పరిగణించాలి" అని.

హిందువు జీవితంలోని ప్రతిదశ హిందు ధర్మశాస్త్ర ఆదేశాల కనుగుణంగ జరగాలి. ఈ క్రతువులని ఆచరించడాన్ని 'సంస్కార' మంటారు. వివాహానికి సంబంధించి ఐదు సంస్కారాలున్నాయి. అగ్నిపూజకు సంబంధించిన 'కుషాండిక', దాంపత్య సిద్ధికి సంబంధించిన 'గర్భదానం, పుత్రునికోసం చేసే పూజ 'పుంగసవన', గర్భిణీ శ్రేయస్సు కోసం చేసే 'శీమంతోత్సవం', శిశుజన్మకు సంబంధించిన జాతకర్మ, పేరు పెట్టడానికి 'నామకరణ', శిశువుకు మొదటి ముద్ద ఆహారం తినిపించడాన్ని 'అన్న ప్రాసన', మొదటి కేశఖండనానికి 'చూడకర్మ', చెవులు కుట్టించడానికి 'కర్ణవేద', చదువు ఆరంభంలో 'విద్యారంభం', జంధ్యం వేసేటప్పుడు 'ఉపనయనం' వంటివున్నాయి.

హిందువు మరణించినపుడు, మరణించిన వారిని సంస్మరణ చేసేందుకు, కొత్త గృహనిర్మాణానికి ముందు, గృహప్రవేశానికి, అమ్మాయి పెద్దమనిషి అయినప్పుడు ఆచరించేందుకు ప్రత్యేక క్రతువులున్నాయి. హిందూధర్మములో కామ, అర్థ, ధర్మ మోక్షమనే నాలుగు ధ్యేయాలున్నాయి. ఇంద్రియ సుఖాలు మనుషులకు, జంతువులకు కూడ సహజమైనవి. అవి అన్నిటి కంటె అథమస్థితిని తెలియచేస్తాయి. అర్థ మనగా ధన సంపాదన, ఆస్థి కూడబెట్టడం. వస్తుసేకరణ ఇవి మనుషులకు మాత్రమే పరిమితము. ధర్మాన్ని ఆచరించడమంటే మత సంబంధమైన బాధ్యతలు నిర్వర్తించడం, స్వలాభాన్ని విసర్జించుట. కామము, అర్థము పూర్తిగ స్వార్థముతో కూడినవి. ధర్మం అలాకాదు. మోక్షము భగవంతుని సాక్షాత్కారంతో లభిస్తుంది.

దేవుడు సర్వవ్యాప్తి కలిగి ఉన్నాడని, ప్రతిమనిషిలోనూ నిక్షిప్తమై ఉన్నాడని హిందూ ధర్మం నమ్ముతుంది. ఆధ్యాత్మిక జీవన ధ్యేయము ఆ దైవాంశను దర్శించగలగడం, ఆ దైవాంశ తెలుసుకోవడమే మోక్షము.

ఆ దైవత్వమే మనిషి అసలు సిసలు నిజ స్వరూపము. తక్కిన వన్నీ ముఖ్యంగా బాహ్యమైనవన్నీ వ్యర్థం. త్యజించవలసినవి ముందో, వెనకో మనిషి మోక్షం సాధించడం తథ్యం. దానికోసం ఆధ్యాత్మిక సాధన అవసరం. చిత్తశుద్ధితో సాధన చేసేవారికి అది త్వరగా లభిస్తుంది.

మోక్షసాధనే మానవ జీవితానికి ముఖ్యమైన ఆశయం. క్రతువులు, సంస్కారాలన్నీ దేవుని పేరుతో, దేవుని సంస్మరణతో ముడిపడి ఉన్నాయి కనుక అది మోక్షసాధన కుపయుక్తాలు.

హిందూ ధర్మానుసారం మనిషి జీవితంలో నాలుగు దశలున్నాయి. అవి, బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సన్యాసము. మనిషి ఇంద్రియ చాపల్యముతో కూడిన ఆనందాలననుభవించే దశనుండి తన సర్వ స్వార్థాన్ని విడనాడి సన్యసించే దశకు చేరుకోవాలని ఋషులు ఈ విధమైన ఏర్పాటుచేశారు. సన్యాసమంటేనే నిస్వార్థ స్థితి చేరుకోడం.

విద్యాభ్యాసము ముగిసిన తరుణంలో గురువు శిష్యులకు బోధించేవి: నిజాయితీ, త్యాగనిరతి, ధాతృత్వము తల్లిదండ్రుల యెడ గౌరవము, గురువులందు, సంస్కారవంతుల యెడ మన్నన.

హిందూ ధర్మంలో వివాహము ఒక సుదీర్ఘమైన క్రతువు. ఉపవాసము, ప్రార్థన, పూజలతో కూడినది. అసలు వివాహమనేది ధర్మాన్ని నిలబెట్టేందుకు చేసే ఉత్సవం. పెండ్లికుమార్తె ఒక పురుషుడి భార్య అయినపుడు ఆమెను 'సహధర్మ చారిణి' అంటారు. అంటే ధర్మం ఆచరించడంలో తోడు ఇచ్చేది అనర్థము. భర్త, భార్యాలిద్దరు ఒకరి కోసం ఒకరు త్యాగం చేయడానికి సిద్ధపడాలి. ఇది తల్లిదండ్రులకు, కూతురికి, కొడుక్కి, స్నేహితుల కందరికి వర్తిస్తుంది.

గృహస్థు విధులన్నిటిని మహా నిర్వాణం తంత్రం నిర్వచించింది. దైవ సాయుజ్యం సాధించడానికి శాస్త్రాలు ఉపదేశించే అన్ని విధులని గృహస్థు నిర్వర్తించాలి. తాను చేసే పనుల ఫలితాలని భగవంతుని కర్పించాలి. తన జీవితం భగవదర్పితం కనుక తను చేసే పనులన్నింటిని సత్యసంధతతో చేయాలి. పేదలను, నిస్సహాయులను ఆదుకోవాలి. తమ తల్లిదండ్రులను దైవ ప్రతినిధులుగ చూడాలి.

తన కుటుంబాన్ని, సమాజాన్ని సంరక్షించుకొనేందుకు గృహస్థు ఏ విధంగ ప్రవర్తించాలో – శాస్త్రాలు చెప్తాయి. గృహస్థు విదేశాలలో ఉండటం జరిగితే ఖచ్చితంగ ఈ విధులు పాటించనవసరం లేదని కూడ శాస్త్రాలు చెప్తాయి.

ఆపస్తంభ స్మృతి, మనుస్మృతి, నారద పురాణం వరకట్నాన్ని, కన్యాశుల్కాన్ని పూర్తిగ ఖండిస్తాయి. అది తల్లిదండ్రులు తమ పిల్లలని అమ్ముకొన్నట్లేనని చెప్తాయి. ఆధ్యాత్మిక చింతన ఈ సాంఘిక దురాచారాలని పారదోలుతుందని ఆశిద్దాం.

**యోగి జీవన విధానం**

యోగాను నాలుగు విధాలుగ స్వామి వివేకానంద విభజించారు, ప్రతి ఆత్మ దివ్యత్వం కలిగి ఉంటుంది. మన అంతర్గతాన్ని, బాహ్యాన్ని నియంత్రించి దివ్యత్వాన్ని సాక్షాత్కరింప చేసుకోడమే మన ధ్యేయం: పని ద్వారాగాని పూజ ద్వారాగాని, (జీవతత్వాన్ని) మనసును నియంత్రించడం ద్వారాగాని, వేదాంతం ద్వారా గాని, వీటిలో అన్నింటిని ఉపయోగించి గాని, కొన్నింటిని అవలంబించి గాని ధ్యేయాన్ని సాధించవచ్చు.

పై మార్గాలననుసరించడం ద్వారా మనము స్వచ్ఛమైన, నిర్మలమైన, సచ్చిదానంద స్థితికి చేరుకొంటాము. ఈ ప్రయాణంలో అంతర్గతాన్ని, బాహ్యాన్ని పూర్తిగ మార్చివేసుకోగలగాలి. ఇది యోగి జీవన విధానంలో సాధ్యపడుతుంది. ప్రశాంతత, నిశ్చలత్వం, ఆరోగ్యము, ఆనందము శక్తి, ప్రావీణ్యము ఉంటాయి. ఇంద్రియ నిగ్రహం, నిర్విచారత, అలసత్వం లేకుండట వీటికి తోడ్పడతాయి. యోగి జీవనం గడపడమంటే మనలోని స్వేచ్ఛను భౌతికంగా, ప్రాణిక్‌గా(?) మానసికంగా భావోద్రేకపరంగా, మేధాపరంగ కలగచేసుకోడమే. స్వేచ్ఛ ఒక ఎన్నిక. మేధస్సు ఈ స్వేచ్ఛను తెలియచేస్తుంది. ఈ స్వేచ్ఛ నుండి సృజనాత్మకత జనిస్తుంది. ఈ స్వేచ్ఛ నుపయోగించి మనం ఔన్నత్యం పొందగలం. దానినే యోగమంటారు. దానికి విరుద్ధంగా ఉపయోగించితే రోగమవుతుంది. భౌతికంగ, మానసికంగ, భావోద్వేగ పరంగా, అంతరంగ పరంగా స్వేచ్ఛను పెంపొందించగలిగితే అది దివ్యత్వాన్ని సంతరించుకొంటుంది. స్వేచ్ఛ మరింత ఇనుమడిస్తుంది. ఈ స్వేచ్ఛను మనం మొదటినుండి పాటించాలి. జ్ఞానయోగం ఏది నిత్యమో; ఏది అనిత్యమో తెలియచేస్తుంది. మనం తరచి చూచి నిత్యమై ఉన్నదానిని ఎన్నుకోవాలి. కఠోపనిషత్తు ఈ విషయాన్ని చక్కగా విశదీకరిస్తుంది. "తెలివైన వ్యక్తి/ జ్ఞాని ఏది ఎన్నికకు అర్హమో, ఏది అనర్హమో బేరీజు వేసి చూస్తాడు. అందము, మనోహరం, ఆనందదాయకము కంటె భగవదనుగ్రహం ఇప్పించగలిగిన దాన్నే ఎంచుకొంటాడు".

కర్మయోగం అనుసరించినట్లయితే మనం తమస్సును, రజస్సును విసర్జించి, సాత్వికతని, నీతిని, నిజాయితీని ఎన్నుకొంటాము. శాస్త్రాలను చదివించిన తరువాత గురువు తన శిష్యులకు నీతివంతమైన జీవితాన్ని అనుసరించమని బోధిస్తాడు. తైత్తరీయ ఉపనిషత్తు ఇలా బోధిస్తుంది.

సత్యాన్నే పలుకు, మంచినే అవలంబించు గురువుకి ధన్యవాదాలు, బహుమతులు ఇచ్చిన పిదప కూడ గురు ఆదేశాల్ని పాటిస్తాడు. నిన్ను నీవు కాపాడుకో. చదవడం, చదివించడం–పట్ల అజాగ్రత్తగ ఉండకు".

రాజయోగం, ఏవి చేయకూడదో ఏ నియమాన్ని పాటించాలో చెప్తుంది, అహింస, సత్యసంధత దొంగతనం చేయకుండుట, తృప్తి కలిగి ఉండుట, దైవానికి సమస్తం సమర్పించుట ఇత్యాది నియమాలను అనుసరించటమంటుంది. జీవితంలో తారసిల్లే కష్టాలను అధిగమించడం కోసం మనసును స్థిరీకరింపచేసుకోవాలి. మనస్సును స్వచ్ఛంగ ఉంచుకోడానికి, చిత్తచాంచల్యం లేకుండ స్థిరంగా ఉంచుకోడానికి ధ్యానము, బాధితుల పట్ల కరుణ కలిగి ఉండుట, మంచివారిపట్ల గౌరవం కలిగి ఉండుట, పాపచింతనకు దూరంగా ఉండుట అవసరం.

యోగ వాశిష్టంలో ఇలా ఉంది, 'స్వచ్ఛమైన ఆహారము, పరిసరాలు, శాస్త్రాలను సరిగ్గా అర్థం చేసుకోడం, ఆర్భాటాలని, అల్పమైన ఆనందాలని కోపాన్ని విసర్జించుట, సత్యసంధులకు సేవ చేయుట, ప్రాణాయామాన్ని నిలపకుండ ఆచరించుట ఇటువంటి కార్యక్రమాలని నిత్యం పాటించుట చేత మనలోని అంతశ్శక్తులు, ఏ విధంగ యజమానికి నౌకర్లు విధేయంగ ఉంటారో ఆ విధంగ విధేయంగ ఉంటాయి."

భక్తి విశ్వాసాలు మనలను కామం నుండి దూరం చేసి ప్రేమకు దగ్గర చేస్తుంది. ప్రేమ ప్రతిఫలం ఆశించదు. నారద భక్తి సూత్రాలు, స్వార్థపూరితమైన కామం ఇంద్రియచాపల్యాన్ని మాత్రమే తృప్తి పరుస్తుంది. అందులో స్వచ్ఛమైన, ఆనందం ఉండదు.

కర్మయోగం ప్రశాంత చిత్తాన్ని పొందమంటుంది. ఎటువంటి ఘర్షణ, ఒత్తిడి లేకుండ పనిచేసుకోమంటుంది. రాజయోగం

బిందువుమీద చిత్తాన్ని నిలుపమంటుంది. భక్తియోగం ఉన్నదంతా భగవదర్పితం చేయమంటుంది. జ్ఞానయోగం జీవితంలో అన్నీ దైవాజ్ఞ ప్రకారం నడుస్తాయని తెలుపుతుంది.

యోగి జీవితం ఆధ్యాత్మిక ధ్యేయాన్నేర్పరుచుకొంటుంది. దానిమీదే ధ్యాస పెడుతుంది. అభ్యాసము, వైరాగ్యము అనే మార్గాలని సూచిస్తుంది. నిరంతరాయమైన, అనునిత్యమైన చింతన అభ్యాసము. వైరాగ్యం పూర్తిగ త్యాగాన్ని సూచిస్తుంది. దానర్థం ఈ ప్రంచాన్నే త్యజించడమని అర్థం కాదు భౌతికమైన విషయాలమీద ఆసక్తి, అనురక్తి లేకుండడం.

## ఇస్లాం జీవన సరళి

ఖురాను ఇస్లాం మతస్థుల దివ్యగ్రంథము. అదే వారి జీవనానికి, శక్తికి ఆధారభూతము. ఈ జీవితములో జీవితానంతరము ఏ విధంగ నడుచుకోవాలో నేర్పించేది, జీవిత సాఫల్యానిచ్చేది ఖురాను.

మంచి చెడు నుండి వేరుచేసి చూపించేది, సత్ప్రవర్తన కొరకు పటించవలసిన సూత్రాలను తెలియచేసేది, మనిషికి ముక్తిమార్గం బోధించేది ఈ పవిత్రగ్రంథమే. ఇస్లాం అయిదు నిర్ణయాల ఆధారంగ నడుస్తుంది, అవి: సమాజ, రోజా, జకాట్, తౌహీబ్, హౌజ్, నమాజు' అనగా ప్రార్థన. ప్రతిదినం, నిర్ణయించిన వేళల్లో ప్రార్థన చేయడం ప్రతి ముస్లిం కర్తవ్యము. ఇది శరీరాన్ని, మనసునీ కూడ క్షాళనం చేస్తుంది. రోజా అనగా ఉపవాసము. రమదాన్ నెల దీనికి కేటాయించబడింది. అల్లా! భగవంతుడు ఈ పవిత్రమైన మాసంలో అందర్నీ క్షమిస్తాడని ముస్లింల నమ్మకం. ఉన్నవారు, పేదవారికి తమ సంపదలో కొంత పంచిపెట్టాలన్నది జకాత్- అనగా దానం. హజ్ అనగా తీర్థయాత్ర. ప్రపంచంలోని అన్ని దిశలలో నివసించే ముస్లింలు పవిత్రమైన 'కాబా'ను

దర్శించడం, వారి అందరిలో సమిష్టి బాధ్యతను, సాంఘికంగా ఐకమత్య మేర్పడడానికి దోహదం చేస్తుందీ యాత్ర.

మిగిలిన ప్రాణికోటి కంటె మనిషికి మానవత్వాన్ని తెలివిని ప్రసాదించి, అల్లా మనిషిని ఉన్నత స్థాయిలో నిలబెట్టాడు. వీటివల్ల మంచి, చెడుల మధ్య తేడా తెలుస్తుంది. ఇస్లాం హింసను, ఉగ్రవాదాన్ని బోధించదు. అమాయకులను రక్షించమంటుంది. యుద్ధాలు మనిషి మనసులో చేయాలి. భూమ్మీద కాదు. మంచిచెడుల సంఘర్షణే యుద్ధం.

ప్రేమ, సంఘీభావం, విశ్వాసం, దాతృత్వము, సహనము ఇవే ఇస్లాం మత సారాంశము. నిజమైన ముస్లిం ఈ సూత్రాలను పాటిస్తూ, సత్యమార్గంలో పయనిస్తూ అల్లాను చేరుకొనే ప్రయత్నం చేస్తాడు. అల్లా సర్వవ్యాప్తి చెందియున్న అత్యంత శక్తివంతుడు.

**క్రైస్తవ జీవన విధానము**

పాత నిబంధన, కొత్త నిబంధనలు కలిసిన బైబిలు క్రైస్తవుల మతగ్రంథము. మానవునికి దైవాన్ని సాక్షాత్కరించేందుకు చేసిన దైవ వాక్యమని క్రైస్తవుల గ్రాఢ నమ్మకం.

క్రైస్తవుల విశ్వాసం ప్రకారం దైవం శాశ్వతము, అనంతము, నిర్దిష్టము, స్వతంత్రము, స్వయం సంభూతము. జెనిసిస్ 1:27లో ఇలా చెప్పబడింది. 'దేవుడు మనిషిని తన రూపములోనే సృష్టించాడు. స్త్రీ పురుషులిరువురు దేవుని ప్రతిరూపాలే. మనిషి తన క్రియల ద్వారా కాకుండా జీసస్ క్రైస్టు/ఏసు ప్రభువు మీద ఉంచిన విశ్వాసం ద్వారా మాత్రమే దేవునితో సాయుజ్యం చెందగలడని క్రైస్తవుల నమ్మకం. ఈ అంశంలో తక్కిన మతాలకు భిన్నంగా ఉండినప్పటికి క్రైస్తవం మనిషిని క్రీస్తులాగ, పరమోత్తమునిగ తీర్చిదిద్దాలని కోరుకొంటుంది.

క్రైస్తవ జీవితం ముఖ్యంగా నీతివంతంగా, న్యాయ వంతంగా ఉండాలని, వ్యక్తుల మధ్య సామరస్యముండాలని, వ్యక్తుల ఆంతరంగిక జీవితం, మానవ జీవిత ధ్యేయంతో సామరస్యం కలిగి ఉండాలని కోరుకొంటుంది.

క్రైస్తవుల నీతి యుక్తాయుక్త విచక్షణ జ్ఞానం మీద, స్థైర్యం మీద, ఆత్మ నిగ్రహం మీద, న్యాయం మీద ఆధారపడి ఉంటుంది.

విచక్షణ మనుషులను (ఆర్భాటంలేని) సామాన్య/సాదా జీవితం గడిపేందుకు, ఏకాగ్రత కలిగి ఉండేట్లు, ప్రేమగా ఉండేలా చేస్తుంది. తెలివిని ఇనుమడింపచేస్తుంది. ఆత్మనిగ్రహం ఆనందాల్ని అనుభవించ డంలో సంయమనం పాటించేట్లు చేస్తుంది. న్యాయస్ఫూర్తి మనిషిని సత్యసంధుడిగ, ఇచ్చి పుచ్చుకొనుటలో న్యాయంగ వ్యవహరించేట్లు చేస్తుంది. స్థైర్యం రెండు రకాల ధైర్యాన్ని ప్రోత్సహిస్తుంది. ప్రమాదాన్ని ఎదుర్కొనే శక్తి, వేదనలో కూడ ధైర్యంగా ఉండగలిగిన శక్తి. క్రైస్తవమతం తన అనుయాయులను ఈ ఉత్తమ గుణాలను పాటించాలని ప్రోత్సహిస్తుంది.

క్రైస్తవ సిద్ధాంతం అహంకారాన్ని వదలి వేయాలని అణకువను అవలంబించాలని చెప్తుంది. అహంకారం అన్ని వ్యసనాలకు, అనర్థాలకు మూలం, దైవతత్వానికి అది పూర్తిగ వ్యతిరేకం.

ప్రతివ్యక్తి ఏదో ఒక మంచిని పెంచే పనిని చేపట్టాలి, తన పనిద్వారా సంపాదించినదాన్ని లేమితో బాధపడేవారి కోసం ఇచ్చేందుకు సిద్ధపడాలి. దాతృత్వం అనగా లేనివారితో తమ సంపదను పంచుకోవడమనేది క్రైస్తవ మతానికున్న ముఖ్యమైన ధ్యేయం.

మనుషులు ఒకరినొకరు బాహ్యరూపాల్ని బట్టి పనులను బట్టి బేరీజు వేస్తారని, దైవం వారి నీతినిజాయితీలను బట్టి నిర్ణయిస్తుందని నమ్ముతుంది క్రైస్తవం.

క్రైస్తవంలో అతి ముఖ్యమైన ఆదేశం ఏమిటంటే 'నిన్ను నీవెలాగ ప్రేమిస్తావో, అదే విధంగా నీ పొరుగువారిని కూడ ప్రేమించు. అది 'నీ పొరుగువాడు నీ శత్రువైనా సరే' అనర్థం. ఇది వారు చేసే ప్రార్థనకు పొడిగింపే 'మేము మా యెడల తప్పులు చేసినవారిని ఏ విధంగా క్షమించెదమో, అదే విధంగా నీవు మేము చేసే తప్పులను క్షమింప'మని దేవుని వేడుకోడం. మనం మనయందు తప్పు చేసినవారిని క్షమించ గలిగితేనే దేవుడు మనం చేసే తప్పులను క్షమిస్తాడు. మనం మనలోని మంచి గుణాలను చూసి మనల్ని ప్రేమిస్తాడు అనుకొంటాము. నిజానికి దైవప్రేమ కర్తవ్యమైనదేదీ మనలో లేదు. అసూయ, ద్వేషము వంటి వాటిని విడనాడగలిగితేనే దైవ ప్రేమకర్తృత లభిస్తుంది.

**సిక్కుల జీవన విధానము**

'సిక్కు' అనే పదం సంస్కృతంలోని 'శిష్య' అనే పదం నుండి వచ్చింది. శిక్కులందరు శిక్కుమత స్థాపకుడు గురునానక్ శిష్యులు. అతడి సూక్తులు, ప్రవచనాలని పాటించడం సిక్కుల ధర్మం. నీతి, నిజాయితీలను, ఆధ్యాత్మికతను తమ కర్తవ్యంగా భావించమని గురువుల ఆదేశం. ఆయన ఇలా ప్రవచించారు. "సత్యము సమున్నతమైనది. దానిని పాటించడం ఇంకా ఉన్నతమైనది". బురదలోని తామర ఆ బురద అంటుకోకుండ ఉన్నట్లు నీటిలో తేలియాడే బాతుకు నీరు అంటనట్లు, మన మీ జీవన సాగరాన్ని ఈదాలి. దేవుణ్ణి మదిలో స్థాపించుకొని, ఆశావాదంతో కొనసాగాలి.

గురునానక్ ప్రవచనాలలో మూడు ముఖ్యమైనవి. ఒకటి దేవుణ్ణి మరవకుండటం, రెండు బ్రతుకు తెరువును నిజాయితీతో గడపడం, మనం సంపాదించినదాన్ని ఇతరులతో పంచుకొనడం. అందరూ సమానులే అనే సిద్ధాంతాన్ని అందరూ అమలు చేసేందుకోసమని,

'సంగత్', 'పంగత్' ఏర్పాటు చేసుకొన్నారు. 'సంగత్' అనగా సత్సంగము, పంగత్ అనగా సమపంక్తి భోజనం, ఎక్కువ తక్కువల ప్రసక్తి ఉండటానికే వీల్లేదు.

సిక్కు సంప్రదాయం 'అకాల్' అనగా కాలాతీతమైన భగవంతుని పూజించడం. సిక్కుల దేవాలయం 'గురుద్వారా' కేవలం దేవాలయమే కాదు, దీనులకు ఆశ్రయమిచ్చే ఆశ్రమం. కులమతాలకతీతంగ అందరికి ఉచిత భోజనం పెట్టి, ఉండేందుకు వసతి కూడ యిచ్చే పవిత్ర ప్రదేశం.

సిక్కు సంప్రదాయం ప్రకారం సిక్కులు ఉదయాన్నే లేచి, స్నానం తరువాత దైవ ధ్యానం చేయాలి. మనసును, శరీరాన్ని పవిత్రంగ ఉంచుకోవాలి. రాత్రి పడుకొనే ముందు కూడా దైవస్మరణ చేయాలి. దైవనామ సంకీర్తనం, సత్కార్యాలు చేయడం సిక్కుల విధి విధానం. "ఓ నానక్! నీ పవిత్ర నామం, నీ ఉజ్వలత్వం' అజరామరం కానీ, మాకు శాంతిని, సంపదనీ పంచిపెట్టునీ' అనేది సిక్కుల ప్రార్థన.

## బౌద్ధమత జీవన సరళి

బౌద్ధానికి మూలాధారాలు బుద్ధుడు నిర్వచించిన నాలుగు ముఖ్య సూత్రాలు. దుఃఖము, దుఃఖ సముదాయము, దుఃఖ నిరోధము, దుఃఖ నిరోధ మార్గము. ఈ జీవితంలో దుఃఖముంది. దానికి మూలకారణం దురాశ. ఈ దుఃఖాన్ని పారదోలుట, దుఃఖాన్ని పారతోలేందుకు అనుసరించాల్సిన మార్గము. ఇవే బౌద్ధంలోని ప్రధాన అంశాలు.

ఈ జీవితంలో పుట్టుక దుఃఖమయం, రోగం దుఃఖకారణం, మరణం దుఃఖదాయకం వేదన, నొప్పి, ఏడుపు, బాధ మనకిష్టంలేనివి జరగడం ప్రేమించినవారి నుండి దూరం కావడం కోరికలు తీరక పోవడం– ఇవన్నీ దుఃఖహేతువులు. ఈ ప్రపంచంలో దుఃఖమే

లేకున్నట్లయితే, అంతా సవ్యంగా ఉన్నట్లయితే, ఏ మతాన్నీ పాటించ నవసరము లేదు.

దైనందిన జీవితంలో దుఃఖకారకాలు ఏవి? పాలిభాషలో 'తన్హ', సంస్కృతంలో 'తృష్ణ', తెలుగులో దురాశ. ఇదే మన కష్టాలన్నిటికి, వెతలన్నిటికీ మూలం. ఇదే మనలో కలిగే, ఈర్ష్య, ద్వేషం, కోపము, శతృత్వము, అజ్ఞానం, గర్వం, ఆశపోతుతనం, మోసం, వంచన వంటి అన్ని దుర్గుణాలకు ఆధారభూతం. ఇది మన మనస్సులో నిక్షిప్తమై ఉంది. అదే విధంగ దీనిని పారదోల గల శక్తికూడ మనలోనే ఉంది. ఆనందాన్ని పొందగల శక్తి కూడ మనలోనే ఉంది.

మనవేదనకు, బాధకు ఏమిటి కారణమని మనం మన మనసులోకి తొంగిచూడగలిగితే 'నాకది కావాలి, నాకిది కావాలని' కాంక్షించడమే అని తెలుస్తుంది. ఆ కాంక్ష మనసులో ఉన్నంతకాలం, ఎంత ప్రార్థించినా లాభముండదు. అది తొలగిపోదు. ఏ బాహ్యశక్తి దానిని తీసివేయలేదు. అది మన ప్రయత్నంతోనే సాధ్యమవుతుంది. దాన్ని తొలగించుకోవాలనే దీక్షతో సాధనచేయాలి. ఏ ఇతరమార్గమూ పనిచేయదు. మన మనసులోని కాంక్షను తొలగించి, ఆత్మక్షాలనం చేసుకోడానికి బుద్ధుడు అష్టాంగ మార్గాలనుపదేశించాడు. 1.సవ్యమైన ఆలోచనలు 2.న్యాయమైన కోరికలు 3.మేలైన మాట 4.సరియైన పని 5.నీతివంతమై బ్రతుకు తెరువు 6.మంచి ప్రయత్నము 7.పవిత్రమైన మనసు 8.ఆరోగ్యవంత మైన ఏకాగ్రత. స్వయం ప్రక్షాళన కష్టమని/అసాధ్యమనిపిస్తుంది. కాని అది సాధ్యమే.

మనుషులందరిలోనూ తమ్ము తాము శుభ్రపరచుకొని, స్వచ్ఛత సాధించే శక్తి ఉంది. కాకపోతే వారు ఒక క్రమపద్ధతిలో తమకు తాము తర్ఫీదిచ్చుకొని, దీక్షతో ఆ కార్యక్రమాన్ని కొనసాగించాలి. ఆశకు అంతు

లేదు, స్వార్థానికంతులేదు, ఫలితం బాధలకంతులేదు. మరణానంతరం కాకుండ, ఈ జీవితంలోనే ఉత్కృష్టమైన/మేలైన జీవితం కొనసాగించ వచ్చు. వేదన, బాధ, దురాశ లేని జీవితాన్ని సాధించవచ్చు. అది పూర్తిగా మనమీద ఆధారపడి ఉంటుంది.

సవ్యమైన ఆలోచనలనగా సరియైన అవగాహన, దృఢ చిత్తంతో కూడిన ఆలోచన. 2. ఇతరులకు హాని తలపెట్టని మంచి ధ్యేయాలు, 3. మేలైన మాట సత్యసంధతతో కూడినది, అసత్యానికి విరుద్ధమైనది. 4. సరియైన పని అంటే మనసా, వాచా, కర్మలందు ఇతరులకి న్యాయ తలపెట్టనిది. 5. నిజాయితీతో కూడిన బ్రతుకుతెరువు 6. చెడు తలంపులు రాకుండ స్వచ్ఛమైన ఆలోచనలు కలిగి ఉండడం. 7. సరియైన, న్యాయవంతమైన అవగాహన కలిగి ఉండడం, 8. మనసులో నిద్రావస్థలో నున్న చేతనను జాగృతం చేసి ఆధ్యాత్మిక శక్తిని ఇనుమడింప చేసుకోడం ఈ అష్టవిధాల మార్గాలను అనుసరించినట్లయితే, మనలోని కామ, క్రోధ, మద, మాత్సర్యాలు, దురాశ వంటివి మాయమై మనసులో ప్రశాంతత, తృప్తి, ఆనందం కలుగుతాయి.

ఏది మంచి, ఏది చెడు అని నిర్ణయించేదెలాగ? బౌద్ధ ధర్మానుసారం జీవితంలోని దుఃఖాన్ని పారదోలడమే ముఖ్యం. ఏ పనులు, ఏ ఆలోచనలు దుఃఖాన్ని పెంచి పోషిస్తాయో అవి చెడుకి, ఏ ఆలోచనలు, ఏ పనులు దుఃఖాన్ని పారదోలడానికి దోహదం చేస్తాయో అవి మంచికి నిదర్శనాలు.

ఏది సత్యమో, ఏది అసత్యమో బౌద్ధం నిర్ణయించదు. ఎవరంతట వారు నిర్ణయించుకోవలసిందే. బుద్ధుడు ఇలా వివరిస్తాడు". ఎక్కడో విన్నది, వారు వీరు చెప్పింది నమ్మొద్దు. తరతరాలుగ వస్తున్నదని, ప్రాచీనమైనదని దేన్నీ నమ్మొద్దు. పుకార్లు నమ్మొద్దు. ఎక్కువమంది దాన్ని

గురించి మాట్లాడుతున్నారు గదా అని దేన్నీ నమ్మొద్దు. ఎవరో గతకాలానికి చెందిన సాధువు చెప్పిన మాటగదా అని దాన్ని నమ్మొద్దు. సంప్రదపాయ బద్ధం కదా అని దేన్నీ నమ్మొద్దు. మీ గురువులు మతపెద్దలు చెప్పారు గదా అని దేన్నీ నమ్మొద్దు. నీవు అనుభవించి, తీవ్రమైన పరీక్షకు గురిచేసి, తర్కానికి లోనుచేసి శోధించి కాచి వడబోసినది ఏదైనా నీకు, నీ చుట్టూ ఉన్నవారికి కూడ ఉపయోగయుక్తమని భావించినదాన్నే సత్యమని నమ్ము. దాని ఆదేశానుసారమే నడుచుకో".

ఎటువంటి సిద్ధాంతమైనా సరే పరీక్షించనిదే, అనుభవించనిదే దానిని అంగీకరించవద్దు. సత్యము, ప్రజోపయోగమైన దానిని అంగీకరించే స్వేచ్ఛ, స్వతంత్రత, పనికిమాలిన శుష్క వేదాంతాన్ని తిరస్కరించే శక్తి మానవుని హక్కు అని చెప్పడం బుద్ధుడు మానవాళికిచ్చిన గొప్ప వరం . ఇంతకంటె మేలైన ఎంపిక ఏ మతపరంపరలోనూ లేదు.

అశోక చక్రవర్తి, చరిత్రలో చిరస్థాయిగా నిలచిపోవడానికి కారణం, అతడు యుద్ధంలో సాధించిన విజయాలు, అతడి రాజ్య విస్తీర్ణత, సంపద కావు. యుద్ధం మానివేసి దానికి బదులుగ ఇతర దేశాలకు శాంతి దూతలను పంపాడు. కారుణ్యం, సత్యము, ధర్మము, అహింస, ప్రేమ వంటి ఉన్నతమైన గుణాలను బోధించమని వారికి చెప్పాడు. తన సామ్రాజ్యంలో బుద్ధుని బోధనలు ఆచరింపచేయడమే కాకుండ ఇతర దేశాలలో వ్యాపింప చేసేందుకు కంకణం కట్టుకొన్నాడు.

మనం మనసాటి మానవులతో మోసపూరితంగాను, కఠినంగాను, వక్రదృష్టితోనూ, అహంకారంతోనూ, దయా రాహిత్యంగానూ ప్రవర్తించి నట్లయితే మనమెన్ని పూజలు, ప్రార్థనలు చేసినా వ్యర్థం. జపతపాలు వ్యర్థం. చిన్న చిన్న విషయాలలో మనం ఇతరుల పట్ల చూపే అనురాగం మన ఆధ్యాత్మిక స్థాయిని తెలుపుతాయి. చిన్న విషయాల నుండి

పరమోత్కృష్టమైన స్థాయి వరకు మనం ప్రదర్శించే కరుణ పూర్తిగ మన నిస్వార్థానికి, ప్రతీకగ నిలచి వివేకాన్ని, జ్ఞానాన్ని కలిగిస్తుంది.

బుద్ధుని ప్రవచనాలు ఆధ్యాత్మిక పరునికి సరియైన మార్గ నిర్దేశకాలు. 'నీకు నీవే వెలుగు కావాలి, నీకు నీవే శరణ్యం కావాలి. ఇతర (బాహ్యమైన) శరణ్యం లేదు. నిన్ను నీవే కాపాడుకో. నీ మోక్షాన్ని నీవే సాధించు" అన్న బుద్ధుని ఆదేశం అమృతప్రాయం.

## జైన మత విధానము

జైనులు తమ అనుయాయులు పాటించేందుకు ముప్పై అయిదు సుగుణాలతో కూడిన 'మార్గానుసారి'ని ఏర్పాటు చేశారు. ఆధ్యాత్మిక మార్గం నుండి తప్పుకోకుండ ఉండేందుకు సరియైన జీవన దృక్పథం అలవరచుకొనేందుకు ఇది దోహదం చేస్తుంది. ఇందులో జాగ్రత్తగ పాటించవలసినవి, దూరంగ ఉంచాల్సిన గుణగణాలున్నాయి.

ప్రతి గృహస్థు ఏదైనా వ్యాపారంగాని, ఉద్యోగం గాని చేయాల్సి ఉంటుంది. అవి హీనము, నీచము అయి ఉండరాదు. అతడు తనపని న్యాయవంతంగా, నిజాయితితో, తన పెట్టుబడికనుసారంగా పనిచేయాలి. అతడు ఇతరుల కింద పనిచేస్తున్నట్లయితే తన శక్త్యానుసారము పనిచేయాలి. మనుషులకే కాదు, పక్షులకు, పశువులకు, క్రిమికీటకాలకు సైతం హాని తలపరాదు. కసాయిపని, మత్తుమందుల తయారి, యుద్ధ సామగ్రి/ఆయుధాల తయారి వంటి హానికర వ్యాపారాలను చేయరాదు. నిజాయితీగా సంపాదించిన సొమ్ముతో అతడు హాయిగ జీవించవచ్చు.

తన గోత్రం లోని వ్యక్తిని కాకుండ ఇతర గోత్రాల వ్యక్తిని పరిణయ మాడాలి. మంచి శీలము కలిగి ఉన్న అమ్మాయిని/అబ్బాయిని ఎన్ను కొనాలి. అప్పుడే సరియైన అవగాహన కలిగి బేదాభిప్రాయాలు లేకుండ

సామరస్యంగ జీవించగలుగుతారు. పెద్దలను గౌరవించాలి. సాధువులని, అతిథులని మర్యాదగ చూడాలి. నిస్సహాయుల నాదుకోవాలి. తనమీద ఆధారపడిన వారితో చక్కగ పనిచేయించి కుటుంబానికంతటికి ప్రయోజనం కలిగేట్లు చూడాలి.

దొంగలకు, దోపిడీదారులకు చౌరవశక్యంకాని ఇంట్లో నివసించాలి. తన ఆదాయానికనుసారంగ ఖర్చుపెట్టాలి. సరియైన వేళల్లో భోజన, పానీయాలను సేవించాలి. ఇంటిలోనే భుజించాలి. అవసరమైనపుడు ఉపవాసం చేయాలి. వదిలించుకోవలసిన గుణాలు; నమ్మక ద్రోహము, మోసగించుట, కోపము, అహంకారము, దురాశ వంటివి. యుద్ధ భూములకు, కరువు ప్రాంతాలకు దూరముండాలి. మద్యమాంసాలను ముట్టగూడదు. ఇంటి బాధ్యతలను మతపరమైన పనులను నిర్లక్ష్యం చేయరాదు. మంచి చెడుల మధ్య తేడాను గమనించి, పాపకార్యాలకు దూరముండాలి. తన కుటుంబ శ్రేయస్సు కొరకు చక్కని ప్రణాళిక వేసుకోవాలి. ఏ పనినైనా ప్రారంభించకముందు తన బలమెక్కడుందో, బలహీనత ఎక్కడుందో తెలుసుకోవాలి. తన మానసికస్థితిని గొంతుని, ఆకారాన్ని ప్రశాంతంగ ఉంచుకోవాలి. గొప్ప గుణగణాలు కలవారితో కలసిమెలసి తిరగాలి. అందరిపై కరుణ కలిగి అందరికి నిస్వార్థంగ సాయపడాలి. తనకు సాయం చేసిన వారి యెడల కృతజ్ఞత కలిగి ఉండాలి. అణకువగ ఉండాలి.

పవిత్ర గ్రంథాలను చదవాలి, ప్రవచనాలు వినాలి, తత్వాలను, ధర్మశాస్త్రాలను అర్థం చేసుకొని సరియైన ప్రవర్తనను అవలంబించాలి. జైన సంప్రదాయం తన అనుయాయులు ఆర్థికంగ పరిపుష్టి కలిగి ఉండాలని, ఆధ్యాత్మికతను పాటించాలని కోరుకొంటుంది. దీనిని బట్టి జైనమతాచార్యులు దైనందిన జీవితం పట్ల లోతుగ ఆలోచించారని తెలుస్తుంది.

గృహస్థు ఆధ్యాత్మిక జీవనాన్ని పాటించేందుకు ఐదు అనువు తాల నాచరించాలి. అవి అహింస, సత్యవ్రతము, దొంగతనము చేయకుండుట, పవిత్రత, ఆస్తి కూడబెట్టకుండుట. గృహస్థు దానం చేయాలి, సత్ప్రవర్తన కలిగి ఉండాలి, స్వచ్ఛమైన ఆలోచనలు కలిగి ఉండాలి. అహింస కరుణ అన్ని జీవాలపట్ల సమానంగ పాటించాలి. జంతువులు, పక్షులు, చెట్టు చేమలు, క్రిమికీటకాలన్నీ కూరగాయలు అన్నింటి యెడల ఒకేరకమైన కారుణ్యం చూపించాలి. మనసా, వాచా, కర్మణా ఆచరించాలి. మహావీరుడు ఇలా అంటాడు. ప్రతి ప్రాణికి జీవితేచ్ఛ గాఢంగ ఉంటుంది. నొప్పి, వేదనను వద్దనుకొంటాయి కనుక మనం ఏ ప్రాణికి హాని తలపెట్టరాదు. అన్ని జీవాల యెడల స్నేహభావాన్ని కలిగి ఉండాలి.

జైనమతంలోని అన్ని ప్రతిపాదనలూ ఈ అహింస నుండే జనించాయి. సమాజంలో సామరస్యం సాధించాలంటే సత్యసంధత అవసరం. ఇతరుల సొమ్మును దొంగిలించడం, మనకు చెందని వస్తువులని మన దగ్గరుంచుకోడం పరిగ్రహించడం కింద వస్తుంది. స్వచ్ఛత కూడా ప్రధానమైన గుణం.

ఆధ్యాతిక మార్గంలో జైనులు ఆరు సూత్రాలను పాటించాలి. అవి: సమాయిక (సమైక్య), చతుర్విన్‌స్థవ, వందన, ప్రతి క్రమణ, కీయోటుసర్గ, ప్రత్యాఖ్యానా.

సమాయిక అంటే దేనికీ వశంకాకుండ ఉండడం. చావు బ్రతుకులు, లాభనష్టాలు, అదృష్ట దురదృష్టాలు, సుఖదుఃఖాలు, స్నేహితులు, శత్రువులు – వేటినీ పట్టించుకోకుండ ఉండడం. సమన్వయం పాటించడం. రోజులో కనీసం 48 నిమిషాలు ఈ స్థితిలో ఉండేందుకు సాధన చేయాలి. ఈ సమయంలో జైనుడు తన వ్యాపార సంబంధ, కుటుంబ సంబంధ విషయాలకు దూరంగా ఉండి ధ్యానంలో, ఆధ్యాత్మిక దీక్షలో గడపాలి.

చతర్వింస్తతిస్థవమంటే తీర్థంకరుల భజనలను, స్తోత్రాలను పారాయణం చేయడం. తీర్థంకరులు పవిత్రమైన జీవనం గడిపినవారు. ఈ ప్రపంచం మీద అనురక్తిగాని, విద్వేషము కాని లేకుండ విరాగులుగ గడిపినవారు. సాధువులను, సాధ్వీమణులను గౌరవించడం, వారిలోని సద్గుణాలను నేర్చుకోవడం వందన.

ప్రతిక్రమణ అంటే ఉదయం, సాయంత్రము ధ్యానంలో గడిపి, ఈ దినం నావల్ల ఏదైనా తప్పిదం జరిగిందా అని, జరిగినట్లయితే పశ్చాత్తాపపడడం, భవిష్యత్తులలో అటువంటివి జరగకుండ ప్రతిన పూనడం, ఆచరించడం.

కాయోత్సర్గ అంటే శరీరాన్ని ఒక ముద్రలో నిలిపి ఉండటం. దానివలన మనసులో ఏకాగ్రత సాధించవచ్చు. ప్రత్యాఖ్యాన అనగా అన్వేషి తన జీవితంలో స్వచ్ఛత సాధించడం కోసం ప్రయత్నించడం. శరీరాన్ని వదలి వేసిన తరువాత కూడ ఆత్మ జీవించి ఉంటుంది. ఆత్మ సంతృప్తి సాధించడం కోసం సాధన చేయాలి. జైన సంప్రదాయం ప్రవర్తనలో ఔన్నత్యానికి సాధారణత్వానికి పెద్ద పీట వేస్తుంది. మోక్ష సాధనకోసం పరితపించే జైనుడు మూడు సూత్రాలను పాటించాలి. భగవాన్ మహావీరుని మాటలలో ఇవి, “జ్ఞానమంటే పదార్థాల స్వభావాన్ని కనుక్కోడం, విశ్వాసమంటే వాటిని నమ్మడం, కర్మ ఆపడం, క్రమశిక్షణ ద్వారా స్వచ్ఛతను సంపాదించడం. జైనుల సూత్రాలు విశ్వజనీనం. ఎవరైనా ఎప్పుడైనా పాటించవచ్చు.

## యూదు మత విధానము

యూదుమతం పవిత్రతకు పెద్ద పీట వేస్తుంది. ‘ది బుక్ ఆఫ్ లెవిటికస్’ (The Book of Leviticus), “నేనెట్లాగయితే అన్ని నియమాలకు

అతీతంగ ఉంటానో, పవిత్రంగ ఉంటానో నీవూ అలాగే ఉండు" మని యూదులకు ఉపదేశిస్తుంది. ఏ సద్గుణాలను అలవరచుకోవలెనో, ఎటువంటి ప్రవర్తనతో నడుచుకోవలెనో తెలుసుకోడం పవిత్రత. మోసెస్ దైవ స్వరూపాన్ని సందర్శించాడు. దేవుని ఆజ్ఞను విన్నాడు. దేవుని గుణగణాలు తెలుసుకొన్నాడు. అవి: (yod) యాడ్, (Hay) హే, (Vav) వావ్, హే (Hay) కారుణ్యము, సహనము, క్షమాగుణము, మృదుత్వము, ప్రేమ, స్వేచ్ఛ వంటివి. మొదటి నాలుగు పదాలను ఇతర భాషలలోకి తర్జుమా చేయలేము. మిగిలిన గుణాలను ఆచరించవచ్చు.

సద్గుణసాపేతమైన మనసుతో పాటు భౌతిక జీవనం గురించి కూడ యూదుమతం దృష్టిపెడుతుంది. న్యాయవంతంగా, కరుణాత్మకంగా జీవిస్తే దేవునితో సాయుజ్యం పొందినట్లే. పవిత్రజీవనం గడపడం ద్వారా మనం దేవుని భాగస్తులవుతాము. ఈ భూమ్మీద దేవుని తరపున పనిచేసే వారమవుతాము.

దేవుని భాగస్థులకు మూడు విధాల నడవడికను యూదుమతం బోధిస్తుంది. మొదటిది న్యాయవంతంగా ఉండడం, నీతివంతంగా ఉండడం, మనకోసమే కాకుండ పశుపక్ష్యాదులకొరకు, ఇతరుల కొరకు జీవించడం మన సంపదను నీతివంతంగా ఖర్చుపెట్టడం, ఇతరులకు పంచిపెట్టడం, ఇది దానం కాదు. న్యాయవంతమైన జీవన విధానం. ఈ ప్రపంచాన్ని పవిత్రంగా మార్చగలగడం. ఇతరుల పట్ల ప్రేమను, కరుణను కలిగి ఉండడం. ఇతరులు మనలోని భాగమేనని, అందరు కలసి భగవంతునిలో భాగమని అర్థం చేసుకోడం. ద్వేషపూరితమైన మాటలను వాడకపోవడం. మాట చాల శక్తివంతమైనది. ఇతరులకు సాంత్వన కలిగించడానికి తప్ప, మాటలు బాధను కలిగించడానికి వాడరాదు. అపరిచయస్థులను కూడ స్వంతవారిగా ప్రేమించగలగడం, కుటుంబ బాధ్యతలను సంతోషంగా నిర్వర్తించడం, అహింసను ప్రేమించి, హింసకు దూరంగ ఉండడం,

శాంతిని పంచిపెట్టడం యూదుల కర్తవ్యాలు. అణకువ కలిగి ఉండడం. ఆధ్యాత్మిక జీవనాన్ని గడపడం. వారానికొక రోజు విశ్రాంతి తీసుకొని ఆత్మావలోకనం చేసుకోడం, మనకు లభించిన దానికి కృతజ్ఞత కలిగి ఉండడం. పవిత్ర గ్రంథాలను చదవడం, ప్రతినిత్యం ధ్యానం చేయడం, ప్రతిరాత్రి తనవల్ల ఏదైనా తప్పిదం జరిగిందా అని అవలోకనం చేసుకోడం, సాయం చేసినవారిని స్మరించడం, ఇంతవరకు చేసిన మంచి పనులకంటే ఇంకా ఏమైనా చేయగలమా అని ఆలోచించి ఆచరించడం, దైవానికి సామీప్యం పొందడం – ఇవీ యూదుమత విశిష్ట లక్షణాలు.

## శాస్త్రీయ విధి విధానం

శాస్త్రజ్ఞుల జీవితం అస్పష్టమైన భావాల చుట్టు, ప్రయోగాల చుట్టు, పరిశీలన చుట్టు తిరుగుతుంటుంది. కంటికి కనపడే విషయాల సంబంధ బాంధవ్యాల గురించి లోతుగా ఆలోచించడం, పరిశోధించడం శాస్త్రవేత్త జీవన విధానం. ఒక సిద్ధాంతం ఎంతవరకు సబబో తేల్చుకోడమతని విధి. సిద్ధాంతము, ప్రయోగము పరస్పరాధార భూతాలు. ఒకటి లేకుంటే రెండవది లేదు.

ప్రయోగానికి నిర్దిష్టమైన ఫలితముండదు. ఎన్నో అనుకోని అద్భుతాలు ఆవిష్కరింపబడతాయి. అవి జీర్ణించుకొనేందుకు కొంత సమయం పడుతుంది. ప్రస్థుతమందుబాటులో నున్న శాస్త్రపరిజ్ఞానంతో కొత్తవాటిని పరీక్షించాల్సి ఉంటుంది. శాస్త్ర పరిజ్ఞానం అంతిమము, నిర్దిష్టము కావు. నిన్నటి శాస్త్రం ఈ దినం కుదేలవవచ్చు. కొత్త ? విషయాలకు దారి తీయొచ్చు. శాస్త్రపరిజ్ఞానానికి ఎల్లలు లేవు. అది నిరంతరం వ్యాప్తి చెందుతూ ఉంటుంది. ఒక శాస్త్రవేత్త నిరంతరంగా తన ప్రయోగాన్ని దీక్షతో కొనసాగిస్తాడు. అతడి శాస్త్ర పరిజ్ఞానమే అతడి ప్రయోగంలో ప్రతిఫలిస్తుంది.

శాస్త్రవేత్త ఒక విధంగా గొప్ప అన్వేషకుడు. సాహసికుడు. శాస్త్రం/ విజ్ఞానం ఏ ఒక్కరి సొత్తూ కాదు. అది సామూహికమైనది. ఒక శాస్త్రవేత్త తనకంటే ముందున్న శాస్త్రవేత్తల నుండి నేర్చుకొని తన తరువాత రాబోయే వారికి కొత్త ఆలోచనలివ్వగలుగుతాడు. శాస్త్రం సమిష్టి కృషి. ప్రతి శాస్త్రవేత్త కొత్త విషయాలు నేర్చుకొనే విద్యార్థి. అదే సమయంలో తనకు తెలిసినవి ఇతరులకు నేర్పించే గురువు కూడాను. తాను కొత్తగా తెలుసుకొన్న విషయాలు శాస్త్రపరిధిని పెంచడం శాస్త్రవేత్తకు ఆనంద దాయకం.

విశ్వవ్యాప్తమైన శాస్త్రవేత్తలందరు, అన్ని కాలాలలోను ఎడతెగకుండ పరిశ్రమిస్తుంటారు. తమ తమ వ్యక్తిగత అనుభవాలను శాస్త్రానికి జోడిస్తుంటారు. తమ జీవితాన్నంతా ధారపోసి కొత్త విషయాలను ఆవిష్కరింపచేసే శాస్త్రవేత్తలు అమరులు. వారు గతించినా వారి ఆలోచనలు కొనసాగుతాయి. వారి శిష్యులు వాటిమీద పరిశ్రమిస్తారు.

దీక్షతో, పట్టుదలతో, ఏకాగ్రతతో తమ తమ ప్రయోగశాలలకే పరిమితమైపోయే శాస్త్రవేత్తల జీవితం ఒత్తిడితో కూడుకొని ఉంటుంది. కాని అందులోనే అతడికానందం లభిస్తుంది. తానూ విజ్ఞానానికి తనవంతు కృషిని అందచేయడం తృప్తి కలిగిస్తుంది.

తానుగ ఒక సరికొత్త ఆవిష్కరణ చేసే శాస్త్రవేత్త ఆనందానికి అవధులుండవు. అతడొక యోగితో సమానం. అతడు తన ప్రయోగంలో నిమగ్నమై బాహ్య ప్రపంచాన్నే మరచిపోతాడు. దాదాపు అందరు శాస్త్రవేత్తల జీవితాలూ ఇదే తెల్పుతాయి. శాస్త్రము, మతము పరస్పర విరుద్ధాలు కావు. శాస్త్రవేత్త, యోగి ఇంచుమించు ఒకే రకమైన తాత్వికులు. తమ ప్రయోగాల ఫలితాలు తాత్కాలికం కావచ్చు. అదే విధంగ ఒక తాపసి కనుగొన్న ఆధ్యాత్మిక అంశాలు కూడ తాత్కాలికం కావచ్చు.

కేవలం ఊహాజనితాలు కావచ్చు. అవి ప్రయోగంలో ఫలితాలిచ్చేవరకు నిర్దిష్ట రూపం లేకపోవచ్చు. కాని ప్రతికొత్త ఆలోచన, కొత్త ఊహ ఆహ్వానించదగినదే. శాస్త్రవేత్త, ఆధ్యాత్మిక వేత్త ఇద్దరూ అన్వేషకులే. శాస్త్రవేత్త ఏ విధంగ తన ఆలోచనలని ప్రయోగంలో పరీక్షిస్తాడో, అదే విధంగ ఒక యోగి తన వ్యక్తిగత అనుభవాన్ని పరీక్షకు లోను చేస్తాడు. శాస్త్రవేత్తల ప్రయోగాలు ఒకటే ఫలితాన్నిస్తాయి. ఆధ్యాత్మికతలో అది సాధ్యం కాదు. వారి వారి వ్యక్తిగత అనుభవాలను బట్టి వేరు ఫలితాలు కనపడొచ్చు.

శాస్త్రవేత్త అయినంత మాత్రాన ఆధ్యాత్మికతకు దూరం కాకూడదు. శాస్త్రవేత్త ప్రయోగశాలలో తన ఆలోచనలను పరీక్షించే విధంగా ఆధ్యాత్మిక వేత్త కూడ తన భావాలకు పరీక్ష పెట్టాలి.

అధ్యాయము 6

# ఆధ్యాత్మిక అనుభవం

మనిషి తార్కిక జీవి. హేతువాదంతో ఆలోచించడం అతడి ప్రవృత్తి. జంతుజాలానికి ఆ తార్కిక స్పర్శలేదు. అవి కేవలం తమకు సహజ సిద్ధమైన కౌశలం మీద ఆధారపడి జీవిస్తాయి. వాటికి భూతకాలం, భవిష్యత్తుండవు. వర్తమానంలో మాత్రమే జీవిస్తాయి. మనిషి భూత కాలాన్ని నెమరువేస్తు, వర్తమానంలో భయపడుతు, భవిష్యత్తు మీద ఆశతో జీవిస్తుంటాడు. పశువులకున్న సహజ సిద్ధమైన కౌశలం మనిషికి లేదు. తన తెలివి ఆధారంగ మాత్రమే పనిచేయగలడు. తనలో అనునిత్యం తన తీవ్రోద్రేకానికి, యుక్తాయుక్త విచక్షణకి సంఘర్షణ జరుగుతుంటుంది. తన అహంకారానికి, ఆధ్యాత్మిక చింతనకి యుద్ధం జరుగుతుంటుంది.

ఈ సంఘర్షణ మనిషి ఆధ్యాత్మిక వివేచన కవసరమైన మానసికస్థితి. తను వర్తమానంలో జీవిస్తూ, (అమృతత్వ) శాశ్వతత్వానికి అర్రులుచాచాలి. తన అహంకారాన్నధిగమించి తన ప్రత్యేక వ్యక్తిగతాన్ని దాటిపోవాలి. తనలోని అధమగుణాలతో పోరాడి, వాటిని జయించి తనలోని ఉత్తమత్వం వేపు పయనించాలి. తన తెలివితేటల కంటె ఉన్నతమైన మేధోపరమైన దృష్టితో సత్యాన్ని దర్శించి, దైవత్వం పరిధి చేరుకోవాలి.

తర్కం, తెలివి దైవసన్నిధికి చేర్చలేవు. తెలివి బాహ్యంగానూ, ఆంతరంగికంగాను అనువైన పరిస్థితులు కల్పించి మనిషిని ఆధ్యాత్మికం వైపు నడిపించే శక్తి తెలివి కేవలం చర్చవంటిది. అడిగి తెలుసుకోవడం వంటిది. మేధస్సు సత్యాన్ని ఛేదించగల శక్తి. మనిషికి శరీరం, మనసు, ఆత్మ కూడ ఉన్నాయి. మనిషి అతి సాధారణమైన జీవితాన్ని జీవించవచ్చు.

కావాలంటే దైవభక్తితో సాయుజ్యం చెంది ఉన్నతమైన జీవితాన్ని కూడ జీవించవచ్చు. శరీరం కాల ప్రవాహంలో జీవిస్తుంది. ఆత్మ చిరంజీవి. మనిషి 'ఆత్మ' 'బ్రహ్మానికి మరోరూపం. మనిషి చిత్తం సదా ఆత్మతో కలసి ఉండడం సాధ్యం కాదు. మనిషి చిత్తం కాలంతో కొంత సమయం, ఆత్మతో కొంతసమయం మాత్రమే కలసి ఉండగలదు. కాలంలో కొట్టుకొనిపోతూ శాశ్వతత్వానికి చేరుకొంటుంటుంది. శరీరం కాలం కలసి పయనిస్తాయి. ఆత్మ కాలాతీతమైనది. సుగుణవంతులు తమ శరీరాలను, మనసులను ఆధ్యాత్మికతో నింపుతారు. దుర్మార్గులు అలా కాదు.

పూర్తిగా ఆధ్యాత్మిక తత్వం నిండిన మనిషి శరీరము-మనసు అతడి మరణం తరువాత ఎక్కడికీ పోవు. అటువంటి వారందరు ఎక్కడుంటారో తమకు తెలియకపోయినా, అక్కడికే వెళ్తారు. సాధారణ వ్యక్తి ఈ జీవితంలో అన్ని స్థితిగతుల గుండా ప్రయాణించి, మరణం తరువాత, ఏ స్థితిలోకి వెళ్తాడో ఊహకందదు. బౌద్ధము, వేదాంతము ప్రకారము, మరణం తరువాత నిలచి ఉండేది వ్యక్తిగతం కాదు. అది మార్పుచెందని చేతన మరియు మార్పుచెందిన మానసిక సాధన నుండి ఉద్భవించినది కావచ్చు. ఈ ఊహ సరియైనదైనట్లయితే మనిషి మరణానంతరం కూడ జీవించి ఉండడానికి అవకాశముందనిపిస్తుంది. గత జన్మలోనూ, భవిష్యత్తు జన్మలలోనూ వ్యక్తి జీవితానికి మూలాధారంగా ఉండిన, వ్యక్తిగతం కాని 'ఆత్మ' ముందుకి నడిచి, ఏదో ఒక ఆకారం తీసుకొంటుందని, అదే సమయంలో మార్పు చెందిన మనస్సు కొత్త జీవితంలోని వ్యక్తిపుట్టుకకు ఆధారభూతమై, కొత్త వ్యక్తిత్వాన్ని ఆవిష్కరింప చేస్తుంది. దేవుని ఉనికి ఎరిగి ఉన్న స్వచ్ఛమైన మనసు అనుభవానికి, దేవుని గురించిన భావోద్వేగమైన అనుభవానికి పొత్తు కుదరదు.

ఆత్మనింద బాధాకరం అయినప్పటికీ ఆత్మ చెక్కు చెదరకుండ ఉంది అని చెప్పడానికదొక నిదర్శనం. మన మనసును అపరాధియైన అహంకారం మీద కేంద్రీకరించి ఉన్నంత వరకు దేవుని మీద లగ్నం కాదు. అహంకారం మీద మన ఆసక్తి చూపించినంత కాలం అది బ్రతికి ఉంటుంది. మన దృష్టి దానిమీద నుండి తీసివేసినప్పుడే అది మాయమవుతుంది. దానికి దైవత్వానికి పొత్తు కుదరదు.

పశ్చాత్తాపం చెంది, పరివర్తన వస్తే తప్ప ఆధ్యాత్మిక జీవనం సాధ్యపడదు. సాధారణంగా పశ్చాత్తాపం ఎంతో వేదనతో ఆత్మనిందతో కూడుకొని ఉంటుంది. కాని వాటినే పట్టుకొని వేళ్ళాడ్డం సమంజసం కాదు. మనం చేసిన తప్పులను సరిదిద్దుకోవాలేగాని అవి మనలను కించపరుచుకోడానికి అవకాశమివ్వరాదు. ఆశాభంగమేమీ చేయదు.

మనం చేసిన తప్పులను ధైర్యంగా ఎదుర్కోవాలేగాని కించపడ కూడదు. దేవుని మీద భారం వేసి ఆశతో జీవించాలి. బాధ, వేదన ఆధ్యాత్మిక జీవనానికి మూలాధారం కావాలి కాని వాటిల్లోనే మునిగిపోరాదు.

ఆధ్యాత్మిక జీవనం అవలంబించడానికి నాలుగు మార్గాలున్నాయి. ఒకటి, ధ్యానం, తెలివిహీనులు/అధములు దీనిని ఆచరిస్తారు. రెండు దైవాంశలోని అర్థాన్ని (?) పరిశీలించడం. మూడు: గుణ రహితమైన దేవదేవుని మీద ధ్యాసపెట్టడం. నాలుగు: గుణరహితమైన సర్వాంత ర్యామితో సాయుజ్యం చెందడం.

1. ఈ శరీరం బుద్బుదప్రాయమని, అపవిత్రమని, బాధాతప్తమని తెలిసిన స్థితినుండి క్రమంగా ఆలోచనా రహితస్థితిని చేరడం ధ్యానం ప్రధాన లక్షణం.

2. అహంకారాన్ని జయించినవారు, వ్యక్తి(త్వాన్ని) గతాన్ని అధిగమించిన వారు గుణరహితమైన ఆదిదేవుని వివిధమైన అంశాలకు అర్థాన్ని వెతకడం/పరిశీలించడం రెండవమార్గం.

3. మనిషి అహంకారాన్ని విడనాడి, సర్వాంతర్యామి మీద ధ్యాస పెట్టడం.

4. సర్వాంతర్యామిలో విలీనం కావడం. ఆత్మ జ్ఞానాన్ని పొందడం పరమోత్కృష్టమైన ఆనందాన్ని, ప్రశాంతతని పొందడం. ఈ కనపడే చరాచరజగత్తు యావత్తూ ఆ సర్వాంతర్యామికి మరోరూపమని గ్రహించడం.

మతము ఉద్వేగ పూరితమైనట్లయితే, రెచ్చగొట్టే స్వభావం కలిగి ఉన్న దయితే అది ప్రమాదాలకు దారితీస్తుంది. మతోన్మాదం ప్రోత్సహించే సమావేశాలు, మనిషిని ఉద్రేకపరిచే ప్రలోభాలు, మానవుణ్ణి దైవ స్థానంలో నిలిపి అతడిని లేదా ఆమెని రక్షకుడు లేదా రక్షకురాలిగ చూపే ప్రయత్నం ఏవేవో క్రతువులు (మతం పేరిట) చేసి మనిషిలో ఆశ్చర్యాన్ని, అద్భుతత్వాన్ని కలగచేయడం, నిగూఢమైన ఆచారాలకు పాలుపడడం – ఇవన్నీ మానసికమైన వ్యక్తి పూజకు దారితీస్తాయి.

ఈ పద్ధతులలో, మనిషి తన అహంతో దేవుడంటే ఒకరకమైన వ్యామోహము, పిచ్చి ప్రేమను పెంచుకోవడం జరుగుతుంది. ఇక్కడ దైవం కంటే భావోద్రేకమే ప్రధానమవుతుంది. మత్తు పదార్థాల సేవనానికి అలవడిన వ్యక్తి ఏ విధంగా ఆ వ్యసనానికి బానిస అవుతాడో అదే విధంగా మనిషి మతమనే మత్తుకి బానిసవుతాడు. మనిషి భావోద్రేకాన్ని రేకెత్తించే అంశాలు లేని మతాలను పాటించే వారే ఎక్కువగా ఉంటారు. అటువంటివారు ఆధ్యాత్మికతకు ఆమడ

దూరముంటారు. ఉద్రేక రాహిత్యమైన మతాన్ని పాటించేవారు చాల తక్కువగా ఉంటారు. ఏ కొద్దిమందో ఈ కోవలోకి వస్తారు. తక్కినవారు మరల మరల జన్మించి మరల అవకాశం పొందుతారు. ఈ జన్మ చక్రం (జన్మ తరువాత జన్మ పొందడం) తిరుగుతూ ఉంటుంది.

అధ్యాయము 7

# ఆధ్యాత్మిక సాధనాలు

భోగపరాయణత్వానికి విముఖుడైన వ్యక్తి ఆధ్యాత్మి జీవనం కోరుతూ కొన్ని సాధనాలుపయోగిస్తాడు. ఈ సాధనాలు ముఖ్యంగా మేధస్సుని, భావోద్రేకాలని ఒక ఉన్నతస్థాయికి తీసుకొని వెళ్ళి మనస్సుని దైవానికి చేరువగా తీసుకొని వెళ్తుంది. మనిషి తన గురించి తనకు తెలియ చేస్తుంది. అన్సారీ అనే సూఫీ సాధువు ఇలా వివరిస్తాడు, "నీమీద నాకు ఆసక్తి తగ్గినకొద్దీ నీవు పరమాత్మకు దగ్గరవుతావు. ఇంత కంటె రహస్య మంటూ ఏమీలేదు".

ఈ ఆధ్యాత్మిక సాధనాల ఉద్దేశం మనిషిని తనకోరికల నుండి దూరం చేసి తన వ్యక్తిగత ఉనికి గురించి, తన స్వతంత్రత గురించి తెలియచేసి, తన ఉనికి, తన మనసు, ఇవి విశ్వమంతా వ్యాపించి ఉన్న పరమాత్మ ఉనికిలో, సర్వంతర్యామి మనసులో ఒక భాగమేనని తెలియ చేయడం ఈ సాధనాల వలన ప్రశాంతత చేకూరుతుంది. విజ్ఞత కలుగుతుంది.

అల్లకల్లోలంగా ఉండే ఆలోచనలని, వేదన కలిగించే భావనలని ఉపశమింపచేసి, మనస్సులో ప్రశాంత చిత్తం కలుగచేయడమొక విధానం. తద్వారా ఏకాగ్రత సాధించేందుకు మార్గం ఏర్పడుతుంది. ఏకాగ్రత ఉంటేనే ధ్యానం చేయడానికి వీలవుతుంది. ప్రశాంతత ఏకాగ్రతకు దారితీస్తుంది.

ప్రశాంత చిత్తము ద్వారా నిశితదృష్టి ఏర్పడుతుంది. తానేది చేస్తున్నా దానిమీదే ధ్యాస పెట్టాలి. అలాగ చేయడం వలన తనలో ఇదివరకున్న

అలసత్వం పోయి, దాని స్థానంలో విశ్వాసం, తృప్తి, ఇంగిత జ్ఞానము, శాంతి కలుగుతాయి. ఆత్మజ్ఞానం కలిగిన తరువాత తాను విశ్వంలో ఒక భాగమని అర్థమవుతుంది.

ఆధ్యాత్మిక సాధన చేసే వ్యక్తి, ఓర్మి కలిగి ఉండాలి. తన చేతకాని తనానికి, తనలోని లోపాలకు అసహనం చెందరాదు ఎప్పటికప్పుడు నూతనోత్సాహంతో మరల మొదలుపెట్టాలి. ఎన్నడూ తాను పరిపూర్ణత్వం చెందినట్లు భావించరాదు. మనమీద మనకే సహనం లేనట్లయితే, ఇతరుల పట్ల సహనం ఎలా సాధించగలము? తన లోపాల పట్ల తనే రగిలిపోతూ ఉంటే వాటిని సరిదిద్దుకోవడమెలాగ సాధ్యము. ప్రశాంతంగ ఉంటేనే దిద్దుబాటు వీలవుతుంది. "ఆధ్యాత్మిక సాధనను మధ్యలోనే మానివేసే వ్యక్తి, తన చేతిలో ఉన్న పక్షిని తప్పించుకోనిచ్చిన వాడిలాంటి వాడు. తప్పించుకొన్న పక్షిని మళ్ళీ పట్టుకోడం సాధ్యమా".

"నాకంతా తెలుసు, నేనన్నీ నేర్చేసుకొన్నాను, పరిపూర్ణత్వం సాధించాను అని ఎవరైనా అనుకొంటే అంతా పోగొట్టుకొన్నట్లే. మనలోని అసమగ్రతను తెలియచేయడమే సమగ్రత యొక్క విధి".

దైనందిన జీవితంలో పనిలో నిమగ్నమై ఉన్నపుడు, విశ్రాంతిగా ఉన్నపుడు దైవాన్ని మరవకుండ ఉండేదెలాగ? కొన్ని పనులు; కొన్ని విశ్రాంతి వేళలు కూడ దైవనామస్మరణకు అనుకూలంగా ఉంటాయి.

కొన్ని పనులలో నిమగ్నమై ఉన్నపుడు దైవత్వాన్ని స్మరిస్తు ఉండడం కష్టం. ఆ పనిమీద ధ్యాస పక్కకి మళ్ళితే తప్పులు చేసే అవకాశముంది. కాకపోతే ఏ పని అయినా ఒక వ్యక్తి తదేక ధ్యానంతో చాలాసేపు చేయడమసాధ్యం. మధ్య మధ్యలో మనసు విశ్రాంతి కోరుకొంటుంది. ఆ మధ్యంతరాల్ని మనం సద్వినియోగం చేయొచ్చు. వాటిని పగటి

కలలు కనడానికి గాని, దైవత్వాన్ని స్మరించడానికి గాని వాడుకోవచ్చు. అంతా మన చేతిలో ఉంది.

**జపము**

ఆధ్యాత్మిక సాధనాలలో అన్నిటికంటె, సులభతరమైనది ఎక్కువగా ప్రాచుర్యం చెందినది జపము– దైవనామాన్ని, పదే పదే ఉచ్ఛరించడం. హిందువులలో, బౌద్ధులలో ఇది విశేషంగా కనపడుతుంది. వేదాంత సారాన్నంతా తనలో ఇముడ్చుకొన్న "ఓం" ను ఎక్కువగా జపిస్తుంటారు.

దైవనామాలు, లేదా ఇతర దైవ స్మరణలకు ప్రత్యేకమైన మంత్రశక్తి ఉందని హిందువులు నమ్ముతారు. జపమొక పవిత్రకార్యమని వారు భావిస్తారు. కొన్ని సందర్భాలలో దైవనామాన్ని జపించడం వలన కొంత మంచి ఫలితమే దక్కొచ్చు. పదే పదే ఉచ్ఛరించడం వలన ఆ'పదం' దానిని ముక్కలు, ముక్కలుగ విడదీసి పరిశీలించినప్పటికంటె అత్యంత అంతర్దృష్టి కలిగించే అవకాశముంది.

సూఫీలిలా వివరిస్తారు. "పదే పదే ఉచ్ఛరించే ఆ పదంలోని అక్షరాల తలుపులు తెరుచుకొంటాయి", ఆ తలుపుల గుండా ఆత్మ సత్యాన్వేషణ చేయగలుగుతుంది. ఈ విధంగా జరగొచ్చు, జరగకుండాపోవచ్చు. ఆధ్యాత్మిక అన్వేషణ అందరిలో, అన్నివేళలా ఒకే విధమైన ఫలిత మిస్తుందని చెప్పలేము. తన వ్యక్తిగత ఉనికిని మరచి దైవంలో లీనం కావచ్చును. అయితే కేవలం యాంత్రికంగా జపం చేయడం చెడు ఫలితాలకి కూడ దారితీయొచ్చు. సత్యాన్వేషి మనసుపూర్తిగ, సర్వదా, ఆపకుండా జపం చేయడం వలన, అతడి మనసు ఇంద్రియాలు చంచలత్వం పోగొట్టుకొని ఏకకృతం కావచ్చు, నిశ్చలత్వం పొందొచ్చు. దైవాంశకు చేరువ కావచ్చు. పరమానంద స్థితి చేరుకోవచ్చు. ఆ స్థితిలో

అన్వేషి, అన్నీ ఆనందంలో పుడ్తాయి, ఆనందంతోనే జీవిస్తాయి. మరణానంతరం ఆనందంలోకే పయనిస్తాయి' అని తెలుసుకొంటాడు.

ఒక బొమ్మ (విగ్రహం) మీదకాని, ఒక ఆలోచన మీద కాని మనసు లగ్నం చేయడం కొన్నిసార్లు, కొంతమందిలో సత్ఫలితాలు ఇవ్వొచ్చు. మానసిక స్థిరత్వం, మేధోపరమైన నిశ్శబ్ధం, నిగ్రహము, భావోద్రేకాల శాంతి నొందడం జరిగినపుడు, ఆత్మ దైవస్మరణ చేయగలుగుతుంది.

కాకపోతే ఆ బొమ్మ (విగ్రహం) మీద ఏర్పడిన ఏకాగ్రత సత్యమనే భ్రాంతి కలిగించొచ్చు. అది విగ్రహారాధనకు దారితీయొచ్చు. విపరీతమైన ఏకాగ్రత మానసికంగా, భౌతికంగా మనిషిలో కొన్ని అనవసరమైన భావనలు కలిగించొచ్చు. దైవం తనతో సంభాషిస్తున్నట్లు తనకు కనిపించి నట్లు, తనకు ముందే అన్నీ తెలుస్తున్నట్లు టెలిపతి వంటి కొన్ని మానసిక శక్తులు తనకు చేకూరినట్లు అతిశయపడడం కూడ కద్దు.

ఒక విపరీతమేమంటే దేహంలో విపరీతమైన వేడి పుట్టడం, కొంతమంది సాధువులు ఆ వేడిని తగు జాగ్రత్తలు తీసుకొని తమ కనుగుణంగ మార్చుకోవడం, అతి శీతల ప్రదేశాలలో తమలో వేడి పుట్టించడానికి వాడుకోడం కూడ కలదు. హిమాలయాలలో తపస్సు చేసే తాపసికులీవిధంగ చేస్తుంటారు.

ఈ ఏకాగ్రత (ఒక విగ్రహం మీద వగైరా) చాలామట్టుకి తమ మనస్సులలో నుండి పుట్టినదే అయి ఉంటుంది. ఇటువంటి స్థితిలో నిజమైన ధ్యానం సాధ్యం కాకపోవచ్చు. 'The Tibetan Book of the Dead' అనే పుస్తకంలో ఇటువంటి ఏకాగ్రత గురించి ఇలాగ రాశారు. ఏదో ఒక దైవం ఆకారం ముందు నిశ్చలంగా నిలబడి తదేకంగా చూడు అక్కడొక మూర్తి ఉన్నప్పటికి, అది నిజం కాదని, అదొక మంత్రగాడు

ప్రదర్శించే ఆటవంటిదని నీకు నీవే చెప్పుకో. చూస్తూ ఉంటే ఆ మూర్తి మాయమై దాని స్థానంలో ఒక కాంతిపుంజం కనపడొచ్చు, దానిమీద మనసు లగ్నం చెయ్యి. మరల విగ్రహాన్ని మరల కాంతిపుంజాన్ని మార్చి మార్చి చూడు. నెమ్మది నెమ్మదిగ నీ మేదసు కరిగిపోనీయి."

ఈ జపము వంటివి మనిషిని స్వార్థరహితుడిని చేస్తే మంచిదే. అట్లాకానట్లయితే వీటిని ఆచరించడం మానవేయడమే మేలు. మానసిక మైన ప్రార్థనకు అడ్డంకులు అసలు విషయాలు తెలియకపోవడమే. వారికి మధ్యమధ్యలో వేర్వేరు భావాలు కలగవచ్చు. అంతరాయాలు కలగొచ్చు. స్వార్థపూరితులకు అంతరాయాలు అధికంగా కలుగుతాయి. కాని కొందరు ఆ అంతరాయాలను తమ అభివృద్ధికి అనువుగ వాడుకోవడం కూడ జరుగుతుంది.

ఆధ్యాత్మిక గురువులు ఇటువంటి అంతరాయాలని బలవంతంగా అణచిపెట్టరాదని చెప్తారు. అణచిపెట్టిన కొద్దీ పెరుగుతాయని తమ వ్యక్తిగతం మీద ధ్యాస పెరగడం జరిగి భగవధ్యానం నుండి దృష్టి మళ్ళిపోతుంది.

ఆ అంతరాయాలమీద అంతగాఢంగా మనసు లగ్నం చేయకుండా, వాటిని అలవోకగ తీసుకొన్నట్లయితే, తమ మనసును వాస్తవమైన (భగవంతుని) దాని మీద లగ్నం చేసుకొన్నట్లయితే ఆ అంతరాయాలు వాటంతటవే మాయమౌతాయి.

ఈ అంతరాయాలను అధిగమించేందుకింకొక మార్గం కూడ ఉంది. ఆ అంతరాయాలు ఏ ఆలోచనలనుండి, ఏ భావాలనుండి వస్తున్నాయో గ్రహించగలిగితే తమ వ్యక్తిగతం భగవంతుని నుండి ఏ

విధంగా వేరు పడుతున్నదో అర్థమవుతుంది. స్వార్థచింతనే మూల కారణమని తెలుస్తుంది. వాటిని ఏరివేయగలిగితే తనలోని భగవత్ స్వరూపాన్ని గ్రహించగలుగుతారు. దైవాన్ని అన్వేషించే ప్రతి ఒక్కరు దైవం గురించి తెలుసుకోవాలి. నీతిని నిజాయితీని వదిలి యాంత్రికంగా ప్రార్థన చేసినట్లయితే అది శుద్ధ అబద్ధమవుతుంది. దైవం గురించిన తప్పుడు అభిప్రాయాలు కలవారే విగ్రహారాధన పట్ల ఆసక్తి చూపుతారు. తనను తాను తెలుసుకోవడం, అణకువగా, విధేయంగా ఉండగలిగినవారే దైవ సామీప్యం చేరుకోగలరు. అంతరాయాలను ఆధ్యాత్మిక సాధనకు ఉపయోగించుకొంటే స్వయం మీద అవగాహన పెరుగుతుంది. ఇందులో ఒక చిక్కుంది. తనమీద తనకు కలిగిన అవగాహనలో దైవాంశాన్ని మరచిపోయే ప్రమాదముంది.

**ధ్యానము**

ప్రార్థనలన్నింటిపైకి ధ్యానము పరమోత్కృష్టమైనది. మోక్షసాధనకు కృషి చేసే వారందరూ ధ్యానం చేయకతప్పదు. పరమాత్మ నందు కొనేందుకు కావలసిన పరిజ్ఞానాన్నిచ్చేది ధ్యానం. మార్మికమైనది ధ్యానం. అంతరాత్మ అంతరంగాన్ని, ఆత్మ పరమాత్మల సంబంధ బాంధవ్యాలని పెంపొందింప చేసేది మార్మికమైన ధ్యానం. నిగూఢమైన ధ్యానము. అంతరంగ జీవితాన్ని సిద్ధింప చేస్తుంది. అజరామరమైన, శాశ్వతమైన జీవితానికి దారి తీస్తుంది.

Al-Ghazzali అంతరాత్మ గురించి, దాని శక్తి యుక్తుల గురించి, దాని లోపాల గురించి తెలియచేసేది ఈ మార్మికశక్తి ఉప్పులాగ మానవ సమాజాలను కాపాడి ఉంచే శక్తి. దైవమా శక్తులను నశింపచేయకుండ ఉంచుతాడు. అటువంటి ప్రపంచాన్ని నిలిపి ఉంచేవి అవే. అభేద్యమైన

దైవాన్ని / దైవ లీలలని / దైవానుగ్రహాన్ని పొందే సాధనాలు. (చాలా తక్కువమంది) నిజమైన అణకువ కలవారు/నిజమైన సాధకులు ఉండరు. తమను తాము పూర్తిగ ఆత్మార్పణ చేసుకొనేవారు తక్కువ. అందరూ ధ్యానం చేయాలల్సినవారే. మోక్షసాధనకు మూడు మార్గాలున్నాయి:- (తమ చేతుల ద్వారా; తమ భక్తి ద్వారా, తమ జ్ఞానం ద్వారా) చేతలు, భక్తి జ్ఞానము. భక్తి, చేతలు జ్ఞానమోర్గానికి దారితీస్తాయి. దైవానికి అనుసంధానం చేసేది 2. జ్ఞానం మాత్రమే తమ ప్రవృత్తి చేత కొందరు స్వభావ సిద్ధంగా మోక్షసాధన వైపు దృష్టి మళ్ళించవచ్చు. కొందరు స్వాభావికంగా ధ్యాన చిత్తం కలవారు కావచ్చు. భక్తులు అయిఉండొచ్చు. పనిమీద ధ్యాస కలిగినవారయి ఉండొచ్చు. తమకు స్వాభావికమైన మార్గమే కాకుండా ఇతర మార్గాలు కూడ అవలంబించొచ్చు. ధ్యాన ప్రవృత్తి కలవారు చేతలద్వారాను, భక్తి ద్వారా కూడ మోక్షసాధన చేయొచ్చు. భక్తి ప్రవృత్తి కలవారు, చేతలను మాత్రమే నమ్మినవారు కూడ ధ్యానం వైపు ధ్యాస మళ్ళించుకోవచ్చు.

దైవము మీద ధ్యానమే కాకుండ ఇంకా అనేక ఇతరములైన వస్తువులమీద / సిద్ధాంతాల మీద, శాస్త్రీయ పద్ధతుల మీద, సౌందర్యాది విషయాలమీద కూడ ధ్యానం చేయాలనుకొనే వారుండవచ్చు. అత్యున్నత మైన ధ్యానము భగవదాంశమీది ధ్యానము. అదికాకుండ ఇతర విషయాల మీద ధ్యానము, ఏకాగ్రత వేలం వెట్టిగ పరిణమించవచ్చు. అది మెదడు లోని ఒక భాగాన్ని తప్ప తక్కిన భాగాలను కుంచింపచేయవచ్చు. దైవం మీద మాత్రమే ధ్యానం చేస్తున్న పక్షిలో మెదడులోని ఇతర భాగాలు కృశించవచ్చు. దైవం విశ్వతత్వాన్ని, వ్యక్తి అంతరాళంలోని దైవశక్తిని - రెండింటిని సాక్షాత్కరింప చేసుకోడానికని ధ్యానం చేసినట్లయితే ఈ కృశింపచేయడం అనేది ఉండదు. దేవునిపైన పూర్తిగ మనసు లగ్నం చేయడమనేది తప్పని ఏ తత్వవేత్తా చెప్పలేదు.

మోక్షమంటే:- తప్పుల నుండి, చెడునుండి, వేదన నుండి విముక్తి పొందడం. ఆనాందాన్ని, మంచిని, జ్ఞానాన్ని పొందడం. నీతివంతము, మేధోవంతము, ఆధ్యాత్మిక పరము అనేవి మోక్షసాధనాలు. మోక్ష సాధనకు బుద్ధుడు, అష్టాంగమార్గాన్ని బోధించాడు. అందులో అన్నింటి కన్నా ముఖ్యమైనది, చివరిదైన సరియైన ధ్యానము. వ్యక్తి చేసే సాధనాన్ని బట్టి అది సాధ్యమవుతుంది. శారీరక-మానసికమైన ఆనందాలకి, ఆధ్యాత్మికత వలన కలిగే ఆనందానికి తేడా ఉంది. శారీరక-మానసికమైన ఆనందాలు పొందేముందు వాటిలో కోరిక జనిస్తుంది. ఆ కోరిక తీరిన తరువాత జుగుప్స, అసంతృప్తి మిగులుతాయి. ఆధ్యాత్మిక ఆనందమెలాగుంటుందో అది పొందేవరకు తెలియదు కనుక కోరిక జనించడమనేదుండదు. అది పొందిన తరువాతే వాటి అనుభూతి కలుగుతుంది.

శారీరక-మానసిక ఆనందాలు స్వార్థ చింతనతో కూడినవి. ఆధ్యాత్మిక ఆనందం నిస్వార్థం, అది అనంతం. మోక్షమందుకున్న ఆత్మ అనంతం, విశ్వవ్యాప్తము అయిన బ్రహ్మలో భాగమవుతుంది. ఆత్మ సంబంధమైన జ్ఞానంలో వేరు వేరు స్థాయీ భేదాలున్నట్లే మోక్ష సాధనలో వేరు వేరు సిద్ధాంతాలున్నాయి. వ్యక్తి ఎంతవరకు మోక్షం సాధించ గలడంటే ఎంతవరకు తన అజ్ఞానాన్ని పోగొట్టుకోదలిచాడో అంతవరకు. చందోగ్య ఉపనిషత్తు ఇలా చెప్తుంది. శరీరం మరణ వలయంలో చిక్కుకొని ఉంటుంది. ఆ శరీరంలో అశీరరంగ ఉండేది ఆత్మ. అది శరీరంతో పాటు, ఆనందాన్ని, దుఃఖాన్ని భరిస్తుంది. శరీరంతో లంకె తెగిన తరువాత, దానికి ఆనందం, దుఃఖం ఏదీ ఉండదు. ఆత్మ సాక్షాత్కారం పొందిన పిమ్మట అలౌకికమైన ఆనందం కలుగుతుంది.

మైత్రాయన ఉపనిషత్తు ఇలా వివరిస్తుంది. ఆత్మ సాక్షాత్కారం పొందిన వ్యక్తి పూర్తిగ నిస్వార్థుడై స్వేచ్ఛననుభవిస్తాడు. ఇది పరమోత్త

మమైన స్థితి. మనిషి తన ఇంద్రియాలకు, అనుగుణంగాను, తార్కిక శక్తిని అనుసరించీ పని చేసినంతకాలము ఎంత మంచి తనమున్నా అలౌకికమైన ఆనందం లభించదు. ఆత్మ సాక్షాత్కారమే పరమావధి.

శంకరాచార్య ఇలా అంటారు ఎన్ని వేదాంత చర్యలు చెయ్యి, ఎంతమంది దేవుళ్ళనయినా కొలువు, అన్ని వ్రతాలు, క్రతువులు చెయ్యి, ఎన్ని సంకీర్తనాలైనా పాడు, మోక్షమెప్పటికీ కలుగదు. వందల, వేల ఏళ్ళు గడచినా సరే. అహంకారాన్ని జయించి, ఆత్మ సాక్షాత్కారం పొందితే కలుగుతుంది. బౌద్ధం కూడ ఇదే మాట చెప్తుంది. జననమరణాలు లేనిది నిర్వాణం. అది అభేద్యము, ఊహకందనిది. అది తథాగతుని అంతరంగ చైతన్యము.

దైవం శాశ్వతత్వం, మనిషి పుట్టు కాలంలో ఒక భాగం. కాలం నుండి పూర్తి విముక్తి చెందడం శాశ్వతత్వం. మంచితనం మనిషికి శాశ్వతత్వం మీద అనురక్తి పెంచుతుంది.

## నిశ్శబ్దం

మన అంతరంగంలోని దైవం మనలో ప్రేరేపించేదే ఆధ్యాత్మిక జీవనం. దానికి తగు అవకాశం కల్పించాలి– నిశ్శబ్దం ద్వారా. మనం మాటలలో మునిగితే, ఆ శబ్దం దేవుని గొంతును వినపడనీయదు. ఆ దేవుని గొంతునే మనం మనస్సాక్షి అంటాము.

అంతులేని వాచాలత్వం చెడ్డది మాత్రమే కాదు, ప్రమాదకరం కూడాను. మన మాటలను మూడు భాగాలుగా విభజించవచ్చు. 1. ఇరుగుపొరుగు వారిమీద అసహనంతో, అసహ్యంతో మాట్లాడేవి 2. దురాశ, ఇంద్రియ చాపల్యం, స్వార్థపూరితమైనది. 3. అర్థం పర్థంలేని

వాగుడు. తర్కము, దాతృత్వము, అవసరమై మాట్లాడే మాటలకంటె పైన నుడివిన మాటల సంఖ్యే ఎక్కువ. ఈ అర్థం పర్థం లేని మాటలు మనం దైవాన్ని చేరుకొనే ప్రయత్నంలో అడ్డంకులవుతాయి. నాలుకను మన అదుపులో పెట్టుకోడమంటే మనసును అదుపులో పెట్టుకోడమే. ఆధ్యాత్మిక జీవనానికిది తప్పనిసరి.

నిశ్శబ్దం మూడు రకాలు. ఒకటి నోటికి సంబంధించినది, రెండు మనసుకు సంబంధించినది, మూడు ఆత్మకు సంబంధించినది. నోరు మూసుకొని ఉండటం కష్టం. దానికంటె కష్టం మన మనసుని, ఊహలని సంభాళించడం, దాని కంటె కష్టం దురాశ వంటి వాటిని అణచిపెట్టి ఉంచడం. శబ్దం (మాటలు) మన ఏకాగ్రతని చెడగొడుతుంది. నిశ్శబ్దం ఆలోచనలను సంఘటిత పరచి, ఆత్మను బలపరుస్తుంది.

నిశ్శబ్దం నాలుగు రకాలు: 1. మాటల నిశ్శబ్దం, 2. ఇంద్రియాల నిశ్శబ్దం, 3. విపరీతంగా అణచిపెట్టుట 4. గాఢనిద్రలోని నిశ్శబ్దం. ఇందులో నాలగవది విమోచనకు అనుకూలమైనది. ఇందులో అణచివేత లేదు. ఇంద్రియాల నిగ్రహం లేదు. మనసు అటు సజీవంగా కాకుండ, నిర్జీవంగా కాకుండ స్థబ్దంగ ఉంటుంది. ఎటువంటి సందేహాలు కలగని నిశ్శబ్దస్థితి ఎంతో ప్రశాంతత; శాంతితో కూడిన స్థితి.

మౌనం వహించేవాడు ముని. ఎంతో కష్టపడి, ఇంద్రియాలని, నోటిని అణచిపెట్టి మౌనం వహించేవాడొక రకం ఇతడు ఒక ఉన్మాద స్థితిలో ఉండటం జరుగుతుంది. అలాకాకుండ మానసిక విమోచనం కలిగిన వ్యక్తికి సత్యసందర్శనమై ఉండటంతో అందరు మామూలు వ్యక్తులవలె ప్రవర్తించడం జరుగుతుంది.

గత వందేళ్ళ చరిత్ర గమనిస్తే అది పూర్తిగా శబ్ద సహితమని అర్థమవుతుంది. భౌతికమైన శబ్దం, మానసిక శబ్దం, కోరికలహొరుతో

నిండి ఉంది. ఇవన్నీ కలసి నిశ్శబ్దం మీద దాడి చేస్తున్నాయి. రేడియో, టెలివిజన్ మన ఇళ్ళను, ఉద్యోగ ప్రదేశాలను, వాహనాలని అన్నింటిని శబ్దంతో నింపివేస్తున్నాయి. ఆ శబ్దాలు మన కర్ణభేరిని దాటి మెదడును తాకుతాయి. మనసుని విచలితం చేస్తాయి. లేనిపోని కోరికలని కలగచేసి, అహంకారాన్ని ప్రజ్వలితం చేస్తాయి. వ్యాపార ప్రకటనలన్నీ చేసేదొకటే– నిశ్శబ్దాన్ని ఛేదించడం, ప్రశాంతతను భంగం చేయడం, కోరికలని రేకెత్తించడం, కోరికల ఉధృతరూపం దాల్చితే మనిషిలోని చెడువైపు ప్రోత్సహిస్తుంది. వేదన కలిగిస్తుంది. మనిషి అంతరంగానికి, దైవ సాన్నిధ్యానికి మధ్యన అడ్డుతెరలాగ నిలుస్తుంది.

## ప్రార్థన

ఆధ్యాత్మిక సాధనాలన్నింటిలోను ముఖ్యమైనది ప్రార్థన. ఇందులో నాలుగు విధానాలున్నాయి. 1. విన్నపము 2. మధ్యవర్తిత్వము 3. పూజించడం 4. ధ్యానము. నాకిదికావాలి ప్రసాదించమనేది విన్నపము. ఇతరులకిది ప్రాప్తింపచేయమనేది మధ్యవర్తిత్వము. మేధస్సును, భావనలని, ఊహని, అంతరంగాన్ని ఉపయోగించి భగవంతుడిని పూజించడం 4. ధ్యానము ఆదిమధ్యాంత రహితమైన దైవత్వాన్ని ధ్యానించడం.

విన్నపం చేయడానికి మనిషి దైవాన్ని ప్రేమించనవసరంలేదు. మనిషికున్న గాఢమైన కోరికచాలు. తన వాంఛను తీర్చేశక్తి ఒకటున్నదన్న నమ్మకం చాలు. తన ప్రార్థనతో విన్నపాలతో ఆ శక్తిని తన కోరి తీర్చేట్లు చేయవచ్చునే విశ్వాసం చాలు.

యుగయుగాలుగ మనిషికొక నమ్మకముంది. భక్తి విశ్వాసాలతో కొలిస్తే తానుకోరింది దైవమిస్తుందన్నది మనిషి ఆలోచన. తన విన్నపాన్ని

విని దేవుడు ప్రసాదించేది మంచిదా, చెడ్డదా కాలమే నిర్ణయిస్తుంది. భౌతికమైన కోరికలు కోరినప్పుడు అవి దారుణమైన ఫలితాలకి దారితీస్తాయి. మన శ్రేయస్సుని, ఇతరుల శ్రేయస్సునీ కోరడం మంచిది. కాని తప్పుడు కోరికలను, వేరే సంబంధమైన కోరికలను కోరడం అవాంఛనీయం.

ఇతరుల మేలుకోరి మధ్యవర్తిత్వం నెరిపితే మంచి ఫలితాలకి దారితీస్తుంది. పూజ (మంచిమనస్సుతో చేస్తే) అదీ సత్ఫలితాలిస్తుంది.

మధ్యవర్తిత్వం – అనగా ఇతరుల శ్రేయస్సుకోసం ప్రార్థించడం వలన తగాదాలుండవు, పేచీకోరు తనముండదు. స్నేహం పరిఢ విల్లుతుంది. కోపము, ద్వేషము మాయమవుతాయి. మన ప్రవర్తనే మారిపోతుంది. ఇతరుల మేలుకోరి ప్రార్థించే వ్యక్తిని ఎవరూ ద్వేషించ లేరు. మనిషి దైవాన్ని పూజించినపుడు తానువేరు, దైవం వేరనే భావన ఉంటుంది. ధ్యానంలో తాను దైవసాయుజ్యం పొందగలుగుతాడు.

నిస్వార్థంగ, ప్రశాంతచిత్తంతో చేసే ప్రార్థన అన్నిటికన్నా అత్యున్నత మైనది. తన వ్యక్తిగత జీవితం గురించి, తన ఇంద్రియాల గురించి కాకుండా, ఇతరులకొరకు ప్రార్థించినపుడు ఆత్మ దైవస్థాయికి చేరుకొంటుంది.

నిజమైన నమ్రత, అణకువ లేకుండా అహంకార పూరితంగా ఉండి, ప్రతి నిత్యము ప్రార్థన చేసినంత మాత్రాన చాలదు. తనను తాను పూర్తిగ భగవంతునికి సమర్పించుకోగలగాలి.

ఆధ్యాత్మికంగా ప్రార్థన ఒక గొప్ప సాధనం. మనస్సునది ఉన్నత స్థాయికి చేరుస్తుంది. మనిషి కందుబాటులో నున్నది. అత్యున్నత

సాధనం. విధిగా అందరు ఆచరించవలసిన ప్రక్రియ. విధివిధానం. దైవ సాయుజ్యాని కవసరమైన సాధనం.

**నిరాడంబరత**

నిజమైన నిరాడంబరత ఎంతో ఉన్నతమైన గుణం. నీతి, నిజాయితీ కంటె గొప్ప గుణం. అందరూ నిరాడంబరతను ఇష్టపడ్తారు. నీతిగ ఉండడం వేరు నిరాడంబరంగ ఉండడం వేరు. నీతిగ ఉండేవారు నిరంతరం తమ గురించి తాము ఆలోచిస్తుంటారు. ఇతరులతో వారు, వారితో ఇతరులు కలివిడిగ ఉండలేరు. వారిలో స్వేచ్ఛ, సహజత్వము ఉండవు.

ప్రాపంచిక విషయాలతోనే ముడిపడి ఉండడం విపరీతమైతే, తన గురించి తప్ప ఇతర విషయాలు పట్టించుకోకుండా ఉండడం ఇంకొక విపరీతం. రెండూ విపరీతాలే. ఒకటి బాహ్యానికి సంబంధించినది, మరొకటి దానికి వ్యతిరేకం. రెండూ నిరాడంబరతకి దూరమే. (Fenelon) ఫెనిలాన్ నిరాడంబరత గురించి ఇలా అంటారు. "మన గురించి మనకున్న ఆత్మావలోకన శక్తి, ఉచితానుచిత జ్ఞానం మనల్ని నిరంతరం శుద్ధి చేసుకొనే అవసరం గురించి తెలియచేస్తుంది. అది బాహ్యామైన విషయాలపై ఆధారపడి ఉండదు. నిరాడంబరత ఆలోచనా రాహిత్యానికి, నటనకి దూరంగ"ఉంటుంది.

ఆత్మ బాహ్య ప్రపంచంలోని విషయాలు తనపై అమితంగా ప్రభావం చూపనీకుండ చూసుకొంటుంది. అట్లాగని తనని తాను మెరుగు పరుచుకొనే అవకాశాల్ని వదులుకోదు. తనంతట తాను సిగ్గుపడే అవకాశాన్ని రానీయదు.

అణచివేసుకోగలగడమే నిరాడంబరత. అదొక గొప్ప నిధి. దానిని సాధించేందుకు మూడు మార్గాలవలంబించాలి. బాహ్యామైన వాటి నన్నిటినీ వదలివెయ్యడం, అంతరంగంలోకి తొంగి చూడడం, తనకు నిజమైన ఇష్టమేదో తెలుసుకోడం, రెండవది భగవంతునిపై ధ్యానం.

ఆత్మ నిరంతరం తనమీద తాను ద్యాస పెట్టడం వలన నిజమైన స్వేచ్ఛ, శాంతి లభించదు. అప్పుడు దైవధ్యానం మొదలవుతుంది. అది అంచెలంచెలుగ తనను తానే మరచిపోయి తనలో పూర్తిగా భగవంతుడినే నిలుపుకొనే దశ వస్తుంది. తన తప్పులను తాను తెలుసుకొనే స్థితికి చేరుకొంటుంది. అప్పుడది నిశ్చలత్వం సాధిస్తుంది.

వ్యక్తులు తమకు మూలాధారమైన దైవాంశను మరిచిపోయి, విడి విడి వ్యక్తులుగా, ఎవరికి తోచినట్లు వారు జీవించడం చేత అపరాధాలు, సామాజికమైన ఒడిదుడుకులు ఉత్పన్నమవుతాయి. తనను తాను పూర్తిగ సమర్పించుకొనడంలోనే నిరాడంబరత ఉంది. నిరాడంబరత పాటించడం చాలా కఠినతరం. నిరాడంబరత శాంతిని ఒనగూర్చుతుంది. అంతరంగం లోనూ, బాహ్య జీవితంలోనూ భౌతికంగాను, ఆధ్యాత్మికంగానూ, సామరస్యం చేకూరుతుంది.

కొందరు నిరాడంబర జీవితం నిస్సారమైనదిగాను, సంతోషం లేనిదిగాను భావిస్తారు. అది నిజంకాదు. అవసరమైన వస్తువులతో నిండిన జీవితం కంటె కేవలం అవసరమైనవి మాత్రమే ఉన్న జీవితం ఎంతో హాయిగా, శాంతియుతంగా ఉంటుంది.

నిరాడంబర జీవితం గడపగోరు వ్యక్తి తనకు తానిలా వాగ్దానం చేయాలి "ఇతరులకు వారికి కావలసినవి కూడ లభించనప్పుడు, నేను నాకవసరం అయిన దానికంటె ఎక్కువ అంగీకరించను" ఇతరులకిచ్చే ఉద్దేశమున్నపుడు కోరింది లభిస్తుంది.

అవసరమైనవాటిని మాత్రమే పొంది ఉండడం, అధికం ఆశించక పోవడం నిరాడంబరత. సుఖాలకు బానిస కాకపోతే మనిషి స్వేచ్ఛగా బ్రతకొచ్చు. చాలామందికి స్వేచ్ఛ రుచించదు. ఏదో ఒక ఉచ్చులో తమను తాము బిగించుకొంటుంటారు. ఆయా ఉచ్చుల్లో నుండి బయట పడడ మెంత కష్టమోనని వాపోతూ ఉంటారు. నిజానికి వారు ఆ విషవలయంలో నుండి బయట పడాలని కోరుకోరు.

ఆధ్యాత్మిక జీవనానికి మూలం నిరాడంబరత. ఆడంబరంగా ఉండడం, మహత్తులు ప్రదర్శించడం గొప్పకాదు. నిజానికి జీవితంలోని గొప్పవన్నీ నిరాడంబరమైనవే. సాహిత్యంలో అనవసరమైన పోకడలు, అలంకారాలు చేరుకోగానే దాని అసలు ధ్యేయం మరుగున పడుతుంది. గలగలపారే ఏరు మేట వేసినట్లవుతుంది.

మన భౌతికమైన అవసరాలు మనం నివసిస్తున్న భౌగోళిక, వాతావరణ పరిస్థితులను బట్టి ఆరోగ్యాన్ని బట్టి ఉంటాయి. కూడు, గుడ్డ, నీడ మన నిత్యావసరాలు. కొందరు సంగీతము, సాహిత్యము వంటి లలితకళలు లేని జీవితం నిస్సారమని భావిస్తారు. ఎవరి అభీష్టాలను బట్టి వారు, అభిరుచులను బట్టి వారు తమ అవసరాలేవో నిర్ణయించుకొంటారు. మనకవసరమైనంత మనకు లభించనిచో బ్రతుకు దుర్భరమవుతుంది. కావలసిన దానికంటె ఎక్కువుంటే మరీ దుర్భర మౌతుంది. జీవితం వాటిని సోపానం చేసుకోడంలోనే గడచిపోతుంది. జీవితంలో విలువైన వాటిని పోగొట్టుకొంటాము.

చెట్లు మనకు ఫలాలనిస్తాయి. అటువంటి చెట్లు పెంచడం మనవృత్తి అయినట్లయితే, మనం ఇతరుల జీవనానికి ఆసరా అయినట్లు. అదే మన వల్ల సమాజానికి కలిగే సేవ.

నిరాడంబర జీవితం ప్రశాంతం
చీకాకులు లేని మధురమైన జీవితం
ఇది వరకెన్నడెరుగని సత్ఫలితాలిస్తుంది జీవితం
ఎంతో అందంగా, ఆనందంగ ఉంటుంది జీవితం.

**విశ్వాసం**

'విశ్వాసం' అనే మాటకు అనేక అర్థాలున్నాయి. అందులో ఒకటి 'నమ్మకం'. ఏదైనా ఒక విషయం మీద అధ్యయనం చేసి, పరిశోధించి నిర్ణయానికొచ్చిన వారి మాటమీద నమ్మకం. కొన్ని విషయాలు మనం స్వయంగా శోధించకపోయినప్పటికీ, మనకు తెలుసు అవి సత్యమైనవని నమ్మకం. కొన్ని మనం శోధించడానికి వీలుకాకపోయినా నిజమని నమ్ముతాము.

మనమొక సమాజంలో నివసిస్తున్నప్పుడు మనం మర్యాదస్థులం కనుక ఇతరులు కూడ మర్యాదస్థులే అని నమ్మడం దైనందిన జీవితంలో ఒక భాగం. మేధోపరంగా చూసినట్లయితే క్రమపద్ధతిలో, శిష్టపద్ధతిలో ఆలోచనలకు మూలం ఈ విశ్వాసం. ఈ విశ్వం మనం జీవించడానికి అనువైనది అనే నమ్మకమే లేకుంటే శాస్త్రీయ విజ్ఞానం, టెక్నాలజీకి మనుగడే ఉండేదికాదు.

మతానికి సంబంధించిన విశ్వాసం శాస్త్రపరీక్షలలో తేలేది కాదు. తత్వవిచారమే అన్ని మతాలకు గుండెకాయ వంటిది.

విశ్వాసం సాటిమనుషుల పట్లగల సహజమైన స్నేహభావం. ప్రపంచం యొక్క నైతిక, ఆధ్యాత్మిక శక్తిమీద నమ్మకముండాలి. నిస్వార్థంగా పనిచేసే వారియెడల విశ్వాసముండాలి. తత్వవేత్తలు చేసే

ప్రవచనాల మీద విశ్వాసముండాలి. వారు చెప్పేవి నిత్యసత్యాలని, తాను కూడా ఆ స్థాయికి చేరుకోగలిగితే తనపట్ల కూడ అవి రుజువవుతాయని నమ్మాలి. సాధారణమైన తత్త్వవిచారాన్ని సూక్ష్మంగా నమ్మినట్లయితే, రుజువు చేయలేని ప్రతిపాదనలని బలవంతంగా నమ్మనవసరంలేదు. గాఢమైన నమ్మకం మనసుమీద పనిచేసి, ఆ ప్రతిపాదనలని నమ్మేందు కవసరమైన వాతావరణాన్ని కల్పిస్తుంది. నిస్వార్థంగ ఉండే మనిషికిది సాధ్యమౌతుంది.

ఈ ప్రపంచాన్ని నడిపే ఏదో దివ్యశక్తి ఉందని నమ్మడం నిజానికి అత్యున్నతమైన ఆధ్యాత్మిక వాస్తవంకాదు. ఆ శక్తిని పూజించడం కూడ, తన ఉనికి శూన్యమని, తానులేనని అనుకొనేంత గొప్పదికాదు. అయినప్పటికీ మన శీలము ఎంతో కొంత మెరుగుపడ్తుంది. ఆ మెరుగుదల ఈ ప్రాపంచిక పరిణతికి లోనయి ఉంటుంది. కాలాతీతమైన శక్తితో సాయుజ్యము కానేరదు. అది శాశ్వతము. దైవత్వం మీద నమ్మకానికి సంబంధించినది.

అత్యున్నతమైన దైవత్వంతో సాయుజ్యం చెందడం, శాశ్వతత్వాన్ని పొందడం కాకుండ, దానికంటె క్రిందిస్థాయిలో మంచిపనులు చేసి అజరామరత్వాన్ని పొందినా అది కలకాలం నిలచి ఉండదు. ఎందుకంటే 'కర్మ' విమోచనకు దారితీయదు. దైవం ఉంది, దైవత్వం ఉంది, నేను ఉన్నాను (ఎందుకంటే నేను ఆ దైవత్వంలోని భాగమే కనుక), అన్నప్పుడే నిజమైన అసలైన మోక్షం కలుగుతుంది అంటారు శంకరులవారు.

కాల ప్రవాహంలో జరిగేది ఏదీ కాలం నుండి బయటపడవెయ్యదు. శాశ్వతమైనది లౌకిక/ఐహిక విషయాలలో జోక్యం చేసుకొంటే తప్ప అలాగ జరగదు. వ్యక్తి తాను సున్న అనీ, శూన్యమని భావిస్తే తప్ప

శాశ్వతత్వం ఆ శూన్యంలోకి ప్రవహించలేదు. గాలిని తీసివేయని (గాలితో నిండి ఉన్న) ప్రదేశంలోకి నీరు ఎలాగ ప్రవహించదో, కాలంలో (ఈ ఐహిక లోకంలో) జరిగేది ఏదీ విమోచనకు దారితీయదు.

## ఔచిత్యం అందము ఆకర్షణ

మనిషి ప్రవృత్తి అతడి చేతలలో ప్రతిఫలిస్తుంది. అతడి వాంఛ లేమిటి? ఆలోచనలేమిటి? అతడి నమ్మకాలేమిటి? అతడి అనుభూతు లేమిటి– అన్నిటికి అతడి చేతలు సంకేతాలు. మనిషి భగవదాంశపై మనసు లగ్నం చేసినవాడైతే అతడి చేతలు మంచిగానూ, అందంగానూ తన స్వార్థం మీద మనసు లగ్నం చేసినవాడయితే చెడుగానూ, వికారం గానూ ఉంటాయి.

మనిషి ఒక శక్తి సముదాయం. మంచివాడు మంచిని కోరేవాడి గాను, చెడును కోరేవాడిని చెడ్డవాడిగానూ వర్ణించకూడదు. తనలో దాగి ఉన్న దైవత్వానికి అనుగుణంగా ప్రవర్తించే వాడిని మంచివాడిగానూ, వ్యతిరేకించేవాడిని చెడ్డవాడిగానూ పరిగణించవచ్చు.

దురాశ, అసూయ, అహంకారము, క్రోధము అన్నీ స్వార్థంలోని అంశాలే. ఇవి నిజానికి వేరు వేరు గుణాలు కావు. ఒకదానికొకటి అనుబంధంగా వ్యవహరించేవే. చెట్టపట్టాలేసుకొని తిరిగేవే.

ఈ నాలుగు గుణాలికి వేరే కారణాలుండనవసరం లేదు. తమను తాము మార్చుకొనే శక్తి కూడ లేదు వీటికి. బాధ, చెడు రెండూ జంటగానే ఉంటాయి. దైవత్వము మీద మనసు కేంద్రీకరించకుండ స్వార్థ చింతన మీద కేంద్రీకృతమైతే అతడిలో చెడు ప్రకోపిస్తుంది. వేదన కూడ హెచ్చుతుంది. అతని ప్రవర్తన వికటిస్తుంది. వేదాంతపరంగ చూస్తే

మనిషి తనకొక వేరే ఉనికి లేదని, తాను గుణరహితుడైన దైవంలో ఒక భాగమేనని తనకు ఉనికినిచ్చేది ఆ దైవత్వమేనని అని భావించడంలో మంచి ఉంది, అందముంది. ఆ గుణాతీతమైన శక్తి ఉనికిని కాదనడం/ లేదనడం తనకు స్వతంత్ర ప్రతిపత్తి గల ఉనికి ఉందనుకోడం చెడు వైపరీత్యం నేర ప్రవృత్తికలవారి మనస్తత్వం, వారి పోకడలు దైవత్వానికి వ్యతిరేకంగా ఉంటాయి.

మనుషులు ఔచిత్యాన్ని (Grace) పాటించగలందుకు వారికి సంకల్ప బలమివ్వబడింది. ఆ సంకల్పబలంతో ఔచిత్యాన్ని పాటిస్తారని నమ్మద మైనది. మనం దైవత్వంలోని భాగస్థులమనే వాస్తవాన్ని దృష్టిలో ఉంచు కొని, మనచేతలన్నిటిని సహనం వైపు మళ్ళించాలి.

మన శ్శాస్త్ర ప్రకారం ఈ ఔచిత్యమనేది మన చైతన్యవంత వ్యక్తిగతం కంటే వేరయినది. మనకు ఈ విషయంగా మూడురకాల అనుభవం లభిస్తుంది. ప్రకృతి ధర్మాన్ననుసరించి, తమ జీవనసరళి ననుసరించి బ్రతికే పశుపక్షాదులు తమ శారీరక ధర్మానుసారం బ్రతుకుతుంటాయి. వాటి జీవనసరళిలో ఎక్కువ తక్కువలుండవు. భౌతికంగాను, శరీరధర్మ ప్రకారంగాను అంతా సహజంగా, సవ్యంగా ఉంటుంది. బ్రతుకే ఒక వరంగా ఉంటుంది. ఇది నూటికి నూరుశాతం పశుపక్ష్యాదులకు వర్తిస్తుంది. మనిషికొక చైతన్యముంటుంది. కనుక ఆవిధంగా జీవనం కొనసాగించలేడు. మంచి, చెడు అనే ఇంగిత జ్ఞానముంటుంది కనుక మనిషి కొన్ని సందర్భాలలో మట్టుకే ఇటువంటి సహజత్వాన్ని అనుభవించగలదు.

మనజీవితానికొక అందము, ఆకర్షణ ఇతరులనుండి కాని సమాజం నుండి కాని, మన ఆలోచనలనుండి కాని, భావనల నుండి కాని

లభిస్తాయి. జీవితంలో మనమనేక రకాల ఆనందాలను, ఆశీస్సులను అందుకొంటుంటాము. పసితనంలో అమ్మనాన్న, ఇతర కుటుంబసభ్యుల నుండి మనం పొందే ఆదరణ, ఆ తరువాత స్నేహితులు, శ్రేయోభిలాషుల నుండి లభించే స్నేహభావం, గురువుల ఆశీస్సులు, అభినందనలు ఈ కోవలోకి వస్తాయి.

ఆధ్యాత్మికమైన ఆనందం: ఎవరైతే నేను లేను, నాలో దైవత్వమే ఉంది అనే స్థాయికి చేరిన వ్యక్తులకు మాత్రమే ఆధ్యాత్మికానందం లభిస్తుంది. కాల ప్రవాహంలో కొట్టుకొని పోకుండా, తనను వ్యక్తిగత జీవితం నుండి తప్పించి, దైవత్వంలో లీనమయ్యేవారికి మాత్రమే ఇది లభ్యం.

సృజనాత్మకమైన, కళాత్మకమైన ప్రేరేపణ మానవ సంబంధమైనది కావచ్చు. దైవానికి సంబంధించింది కావచ్చు, లేదా రెండూ మిళితమై ఉండొచ్చు. కళారంగము ఏదైనా దానికి అవసరమైన నమ్రత, అణకువ, మనిషిలో మేధోపరంగా, భావనా పరంగా, భౌతికంగానూ ఉండాలి. కళాజీవితానికి అంకితమైన వారు, అంతా దైవేచ్ఛ అని, తమ గొప్పదన మేమీ లేదని వినయంగా చెప్తుంటారు. గొప్ప కళాకారులు, తత్వవేత్తలు, శాస్త్రవేత్తలు భగవత్ప్రేరణతోనే అన్నీ సాధ్యమని చెప్తుంటారు.

ప్రేరణ యాంత్రికతకి పూర్తి విరుద్ధం. యాంత్రికతలో పొరపాట్లు ఉండవు. యధాతథమైన, ఒకేరకమైన ఫలితముంటుంది. కనుక అందులో అందంగాని, ఆకర్షణగాని ఉండవు. యాంత్రిక జీవనం గడిపే వ్యక్తిలో ఎటువంటి స్పందన, ప్రేరణ ఉండదు.

**ప్రేమ – దాతృత్వము**

ప్రేమ ఎటువంటి లోటుపాట్లు లేనిది. తప్పిదాలు లేనిది. ప్రేమ రాహిత్యంలోనే అన్ని ఒడిదుడుకులు; తప్పులు ఉంటాయి. ప్రేమ

ఒకరకమైన జ్ఞానము. ప్రేమరాహిత్యము అజ్ఞానము. ఏదీ ఆశించని ప్రేమ దివ్యమైనది. ఏదో ఒక స్వార్థచింతనతో ప్రేమించడం జరిగితే అది పక్షపాతమైన ప్రేమ. అటువంటి ప్రేమ సంపూర్ణమైన జ్ఞానాన్ని కలిగించదు. మనగురించి, ప్రపంచం గురించి, అన్నింటి గురించి కొంత మేరకే మనం తెలుసుకోగలుగుతాం.

దాతృత్వం నిస్వార్థమైనది. ఇప్పటి పరిభాషలో దాతృత్వమంటే దాన మివ్వడమని అర్థం వస్తున్నది. కాని ఆ అర్థం సరికాదు. దాతృత్వం తన బదులుగా దేన్నీ ఆశించదు. ఏ కీడునూ కలగనీయదు. దాతృత్వానికి హద్దులు లేదు. అది విశ్వవ్యాప్తమైనది. ప్రేమ ప్రేమ కోసమే, దాతృత్వం దాతృత్వం కోసమే. దివ్యప్రేమ గుణరహితము, నిర్గుణము, స్వచ్ఛము (నిరంజనము) (సనాతన నికేతనము) అత్యున్నత నివాసస్థలము (నిత్యము) సదా సత్యమైనది, (సుద్ధము) పవిత్రమైనది, (బుద్ధము) స్వయం ప్రకాశవంతము, నిర్మల స్వరూపముగలది. ప్రేమించడానికొక కారణము, ఉద్దేశము ఉండవు. దానికదే కారణము, ప్రతిఫలమూ కూడాను. దాతృత్వం కూడ ప్రతిఫలాపేక్షలేనిది.

అన్ని ప్రేమలలోకి ఉత్కృష్టమైనది దైవప్రేమ. అన్వేషకుని అన్వేషించే దానిని అన్వేషణ ఫలితమైన జ్ఞానాన్ని ఒకటి చేస్తుంది. ఈ అత్యున్నతమైన ప్రేమ, జ్ఞానము వ్యక్తిని స్వార్థాన్ని విడనాడే దిశగా పయనింపచేస్తుంది. ఆలోచనలలో, భావనలలో, చేతలలో అన్నింటిలో వాంఛారహితుని చేసి, వైరాగ్యభావాలను పెంపొందింపచేస్తుంది. తనకేమి జరుగుతుందో అనే పట్టింపులేని స్థితిని, బాధను, వేదనను దైన్యంతో కాకుండ హాయిగ అంగీకరింపచేసే స్థితిని, చెడుకు చెడు (కంటికి కన్నులాగా) చేయాలనే దుస్సంకల్పాలకు అతీతమైన స్థితికి చేరుస్తుంది. మనసును పట్టి పీడించే వేదనలనుండి, అవరోధాలనుండి బయటపడవేసి శాంతిని కలిగించేది

దాతృత్వము. దైవసన్నిధికి చేర్చే ఉత్తమమార్గం. అణకువ/నమ్రత కూడ అటువంటిదే. నమ్రత ప్రేమకు మరోపేరు. 'నా' నేను అనే భావనల నుండి పూర్తిగా విముక్తి కలిగించేది. అన్సారి అనే సూఫీ సాధువు ఇలా అంటాడు. "ప్రేమ మార్గంలో పయనించే బాటసారి వవుతావా అందుకు మొదటి అర్హత అణకువ నిన్ను నీవు ధూళికంటె/బూడిదకంటె హీన మనుకోవాలి.

భావనలు దాతృత్వానికి దారితీయొచ్చు. కాని దాతృత్వానికి మూలం సంకల్పం. ప్రశాంతత కోసం, నమత్ర కోసం, ఓర్మి కోసం కారుణ్యం కోసం సంకల్పబలం కావాలి. ఏదీ ఆశించని నిస్వార్ధ ప్రేమకు దారి తీయాలి. 'ఏదీ కోరదు, దేన్నీ కాదనదు' స్థితి చేరుకొనేందుకు దీక్ష, పట్టుదల కావాలి.

సహనం, తనను తాను పూర్తిగ దైవసమర్పణ చేసుకోడం, అన్నింటిని ఎదుర్కొనే ధైర్యం, న్యాయం, వివేచన, విజ్ఞత ఇవన్నీ దైవాన్నందుకునేందుకు అవసరమైన ఆలంబనలు.

ఎక్కడైతే 'నాకిదికావాలి' అనే ధోరణి ఉండదో అక్కడే నిజమైన ప్రేమ ఉంటుంది. ఏమైనా పోగొట్టుకొంటానేమో అన్న భయముండదు. ఆత్మస్తుతి, పరనింద ఉండదు. దాతృత్వం పూర్తిగ ఆధ్యాత్మికమైనది.

దాతృత్వమే నీతికి తల్లివేరు వంటిది. దాతృత్వమున్న చోట ఘర్షణ ఉండదు. పూర్తి స్వేచ్ఛ ఉంటుంది. దాన్నదే పోషించుకుంటుంది. దాతృత్వమున్న చోట చెడు మనుగడ సాధించలేదు. దాతృత్వమే సంస్థలకు మూలసూత్రం కావాలి. ప్రతిసంస్థ ప్రార్థన చేయాల్సి ఉంది. దేవుడా మమ్మల్ని దాతృత్వం నుండి దూరం చేయకు అని మమ్మల్ని మూఢమైన మతవిశ్వాసం నుండి, మతపిచ్చి నుండి విగ్రహారాధన నుండి, మనుషుల నారాధించడం నుండి కాపాడు అని వేడుకోవాలి.

## మోక్షం కొరకు వేదనపడుట

మనిషి జన్మ అన్ని జన్మలలోకి ఉత్కృష్టమైంది అంటారు. మనిషికి ఆత్మ, మనసుతోపాటు శరీరం కూడ ఉంది. అది లేకపోయినట్లయితే మోక్షసాధన కష్టతరమౌతుంది. మనిషికి మరణం తప్పదు కనుక, దానికంటె ముందే మోక్షసాధనకు పాటుపడాలి.

దైవత్వం మానవులకసాధ్యం. దైవత్వమంటే పరిపూర్ణత్వం. సమగ్రత ఉన్నచోట వేదనకు చోటులేదు. అసమగ్రత, అపరిపక్వత ఉన్నచోటే బాధ ఉంటుంది. అసంతృప్తి ఉంటుంది. ఆ లోపాన్ని అధిగమించే ప్రయత్నం కూడ ఉంటుంది. తనలోని అసమగ్రతను పూడ్చుకొని సంపూర్ణత్వాన్ని అందుకోవాలనే తపన ఉంటుంది. సంపూర్ణత సాధించడ మంటే దైవత్వాన్ని అందుకోడమే.

బౌద్ధం దుఃఖం గురించి నాలుగుసూత్రాలు చెప్తుంది. 'పంచభూతాల కలయికే మనిషి. ఆ అంశాలే మనిషిలో దుఃఖాన్ని ఉద్భవింపచేస్తాయి. దుఃఖానికి మూలకారణం వ్యక్తిగత జీవనం కోరుకోవడం. ఎప్పుడైతే ఈ కోరిక నశిస్తుందో అప్పుడే దుఃఖం మాయమవుతుంది. మోక్ష సాధనకు అష్టాంగ విధానం పాటించాలి. మనిషి తనకొక స్వతంత్రమైన, వ్యక్తిగతమైన జీవితముండాలని అర్రులు చాస్తాడు. ఈ కోరిక పలు విధాలుగ బయటపడుతుంది. శరీరధర్మపరంగా, అంతర్బుద్ధి పరంగా, అకస్మాత్తుగ కలిగే ప్రేరణ పరంగా– వివిధరకాలుగ వ్యక్తమవుతుంది. కొన్నిసార్లు చేతన కలిగియుండి కూడా అటువంటి కోరిక వ్యక్తం కావచ్చు. ఇది ఏ విధంగా వ్యక్తమైనప్పటికీ వేదన, దుఃఖం వెన్నంటే ఉంటాయి. శరీరంలో ఒక భాగం రోగగ్రస్తమైతే తక్కిన భాగాలుకూడ అస్తవ్యస్త మవుతాయి. అదే విధంగ ఒకవ్యక్తి బాధతో సతమతమౌతూ ఉంటే

అతడి చుట్టు పక్కలున్నవాళ్ళు కూడా అతడి బాధలో పాలుపంచుకోడం జరుగుతుంది.

మనిషి తనకొక ప్రత్యేకత ఉందని భావించి ఆ ప్రత్యేకతని చాటుకొనేందుకు ప్రయత్నిస్తుంటాడు. ఆ ప్రయత్నం వలన అతడి శరీర భాగాలు రోగగ్రస్తం కావడం జరుగుతుంది. మనుషులు ప్రకృతి ధర్మానుసారంగా, ముఖ్యంగా నాగరీకుల మనుకొనేవారు ప్రకృతి ధర్మానికి, సహజత్వానికి దూరంగా ఉంటారు. ఆ కారణం చేత వారిలో వేదన, దుఃఖం కలుగుతాయి.

కొందరికి తిండి యావ ఉంటుంది. విపరీతంగ తినడం, తినకూడని పదార్థాలు అదేపనిగా తినడం వలన వారికి అనారోగ్యం కలుగుతుంది. కొందరికి డబ్బుపిచ్చి, మరికొందరికి అసహజమైన కోరికలుంటాయి. వాటికోసం వారు పడరాని పాట్లుపడి లేనిపోని చికాకులు తెచ్చిపెట్టుకొంటారు.

తమకు తాము అసహజమైన ఉద్రేకాలు కలిగించుకోడం కోసం వారు అసహజమైన అలవాట్లకు బానిసలై తమ గుండెకు, మూత్రాశయాలకు, పేగులకు అనర్థం వాటిల్లే విధంగా చేస్తారు. ఆ తరువాత రోగం ప్రకోపించి చుట్టుపక్కలున్న శరీరభాగాలకు వ్యాపిస్తుంది. తనకు, తన కుటుంబానికి, సమాజానికి కూడ భారమైపోతారు. తమ ప్రత్యేకతను ఈ విధంగా నిలబెట్టుకోడం జరుగుతుంది.

దుఃఖం యొక్క ఫలితాలు చెడుకావచ్చు, మధ్యస్థం కావచ్చు, మంచి కావచ్చు. తన ప్రత్యేకతను నిలబెట్టుకోవాలనే కోరిక మరింత ఉన్నతమైనప్పుడు, దాని వలన కలిగిన దుఃఖం చెడుకి దారితీస్తుంది. ఆ కోరిక తటస్థంగా ఉండినపుడు అది మధ్యస్థంగా ఉంటుంది. అది ఆత్మ

పరిత్యాగానికి దారితీస్తే అది మంచికి దారితీస్తుంది. తన ప్రత్యేకతను, పరిత్యజించడం ద్వారా ఆ వ్యక్తి దేవుని కృషికి, ప్రేమకి పాత్రడవుతాడు. ఆధ్యాత్మికమైన ప్రశాంతత కలుగుతుంది. ఆ వ్యక్తిలో భయాందోళనలు తగ్గి, మనోవ్యథ తగ్గి, బాధ కూడ ఉపశమిస్తుంది.

దుఃఖాన్ని ప్రేమించడంలో గల గొప్పదనాన్ని గుర్తించిన వ్యక్తి తన ఇంద్రియాలనే కాదు, తన బాధనుకూడ పోగొట్టుకోడం జరుగుతుంది. తన శరీరాన్ని, ఇంద్రియాల ప్రభావాన్ని, వేదనని కూడ అతడు విస్మరించే స్థితికి చేరుకొంటాడు. 'ప్రేమకోసం వేదన భరించేవాడని వేదన బాధించ దంటాడు Eekhart మహానుభావుడు. ఇటువంటి స్థితికి చేరుకొన్న వాళ్ళు పెద్ద పెద్ద ఆపరేషన్లను (అనస్తీషియా) మత్తుమందు లేకుండ చేయించు కోగలరు.

దుఃఖం చాలావరకు మన చెడు ప్రవర్తనవలన, నీతిమాలిన తనం వలన కలుగుతుంది. వీటివల్ల హాని తప్ప మేలు జరగదు. దుఃఖానికి మూలకారణమైన అవినీతిని నిర్మూలిస్తే తప్ప ఆ దుఃఖం ఉపశమించదు. ఒక చెడుపని చేసి, దాని వలన కలిగిన దుఃఖాన్ని పోగొట్టుకోడానికింకొక చెడు చేస్తూ విషవలయంలో కూరుకొని పోతుంటారు. నిస్వార్థపరులు, దైవాంశ సంభూతులు ఇతరులకోసం తాము దుఃఖాన్ని సహించేందుకు అంగీకరించినవారు, ఇతరుల బాధను పోగొట్ట గలుగుతారు. తనలోని మంచిని, దైవాంశను ఇతరులకి ప్రసరింపచేసి వారికి దుఃఖోపశమనం కలిగించగలుగుతారు. అందువల్లనే సాధువులంటే ప్రజలకు భక్తి, గౌరవము. వారి చేతలలో స్వార్థం లేదు. కేవలం దుఃఖంలో ఉన్నవారిని, ఆ దుఃఖంలో నుండి బయట పడవేయడమే వారి ఉద్దేశము. ఇందులో బలవంతమేమీలేదు. వారు భగవంతునికి దయను దుఃఖితులకు ప్రసరింపచేసే మాధ్యమాలవుతారు.

మనుషులందరు దైవానికి, ప్రకృతికి, తమతోటివారికి అనుబంధం కలిగి ఉంటారు. ఈ సంబంధబాంధవ్యాలు సమపాళ్ళలో ఉంటే దుఃఖం అంతగా ఉండదు. ఈ సంబంధబాంధవ్యాలు సరిగ్గా లేనప్పుడే దుఃఖం జనిస్తుంది. ఈ సంబంధబాంధవ్యాలు సరిగా లేనట్లయితే సామాజికంగా, దోపిడీ, అలజడి, యుద్ధాలు జరుగుతాయి. ప్రాకృతికంగా సహజ వనరుల నాశనానికి దారితీస్తాయి. శారీరకంగా రోగాలకు, నీతిపరంగా అధోగతి పాలుకి, ఆధ్యాత్మికపరంగా మనిషి జీవితంలోని ఉదాత్తాన్ని జీవిత పరమావధిని పూర్తిగా మరచిపోయేట్లు చేస్తుంది. తిండిపోతుతనం వలన మనిషి గుండె, మూత్రాశయాలు రెండింటికి హాని జరిగినట్లు, అటువంటి సమాజంలో ఉన్న అమాయకులు కూడ బాధపడతారు. సద్భావన, రుజువర్తనం కలిగిన వ్యక్తి తనలోని బలహీనతను అధిగమించ గలుగుతాడు. అదంత సులభంకాదు. అయినా ప్రయత్నం చేయకతప్పదు. విముక్తికి ఎన్నో మార్గాలున్నాయి. ఎన్నో విధానాలున్నాయి అవన్నీ తప్పనిసరి అని ఎవరూ చెప్పలేరు. విద్యారణ్యుల వంటి తత్వవేత్తలు వాటిని 'విధి'గా నిర్వర్తించాలని చెప్పరు. కాని 'నీతి' మాత్రం తప్పనిసరిగ పాటించవలసిందే.

విలువలు కొన్ని తప్పనిసరిగా పాటించాల్సినవి, కొన్ని పాటించడం వలన మేలు జరిగేవి. నీతిగా ఉన్నంత మాత్రాన మోక్షం కలుగుతుందని చెప్పలేము. మనిషి నీతిగ ఉండడం వలన తనకు, తోటి వారికి, సమాజానికి మేలు జరుగుతుంది. మోక్షమలాగ కాదు. అది వ్యక్తి జీవిత పరమావధి, అత్యున్నతమైన ఆశయం.

**బలవంతంగా కోరికలను అణచివేయుట**

కోరికలను బలవంతంగా అణచిపెట్టి దేహాన్ని కృశింపచేయడం ఒక గొప్ప ఆశయం కానేరదు. ఒక ఉన్నతమైన ఆశయం కొరకు చేసే

ప్రయత్నం మాత్రమే. కోరికలను, వాంఛలను అణచివేసి విజ్ఞత కోసం, వివేచనకోసం తపించడమది. ప్లాటో (Plato) ఇలాంటారు. విజ్ఞత/వివేకం అన్నింటికంటె ఉన్నతమైనది అందులో దైవాంశమున్నది

కఠోరమైన నియమాలు పాటించినంత మాత్రాన ఒకవ్యక్తి సుగుణ వంతుడైనట్లు లెక్కకాదు. అతడు పవిత్రత, ఓర్పు, సహనం వంటి గుణాలను పాటిస్తున్నప్పటికి సుగుణవంతుడు కాకపోవచ్చు. అతడిలో తానొక ప్రత్యేకమైన వ్యక్తి అనే అహంకారం పొగరు చోటు చేసుకొని ఇతరులను చిన్నచూపు చూడొచ్చు. కఠినమైన నియమాలను పాటించడ మతడిలో అహంభావం పెంచుతుంది. అహం అంటే నేను, నా అనే భావనలు పెచ్చరిల్లడం. ఇందులో తనను తాను పూర్తిగా దైవత్వం విలీనం చేయడంగాని, తానొక ప్రత్యేకమైన వ్యక్తిని కానని, పరబ్రహ్మస్వరూపంలో తానొక భాగమేనని భావించడముండదు. తనను తాను మెచ్చుకోడం ఉంటుంది.

కోరికలనణచి పెట్టుకొనే వ్యక్తిలో, వైరాగ్యం/విరక్తి లేదా లౌకిక విషయాలలో అనాశక్తి పెరగాలి. అప్పుడది సుగుణమౌతుంది. కఠిన నియమాలు పాటించినప్పటికి అహంకార పూరితంగ ఉండే వ్యక్తికి, ఏ నియమాలు పాటించని వ్యక్తి ఆనందమే జీవనపరమావధి అనుకొనే వ్యక్తికి తేడా ఏమిటంటే సుఖలాలసలో తేలేవ్యక్తి తనే నాశనమౌతాడు, అహంభావి ఇతరులకు హాని కలగచేయడానికి వెనుకాడడు.

భౌతికంగా కఠిన నియమాలు పాటించడమే ఒకగొప్ప ఆశయం కాదు. కొన్ని కొన్ని సందర్భాలలో కఠిననియమాలు పాటించే వ్యక్తి ఆధ్యాత్మికతకు చేరువకావచ్చు. కాని చాలా సందర్భాలలో అటువంటి వ్యక్తికి కొన్ని 'మానసిక' శక్తులు ఒనగూడవచ్చు, రోగాలను నయం

చేసే శక్తి, భవిష్యత్తులోకి తొంగి చూసేశక్తి, ఇతరుల మనసులోని భావాలను చదివేశక్తి లాంటివి చేకూరవచ్చు.

అటువంటి ‘సిద్ధులు’, విముక్తికి దారితీస్తాయని అనుకోవడం చాలా పొరపాటు. నిజానికవి అడ్డంకులు కావచ్చు. కొండొకచో అనారోగ్యాన్ని కలిగించవచ్చు. ఆరోగ్యం లేకపోతే ఆధ్యాత్మిక చింతన కష్టతరమౌతుంది. భౌతికమైన కఠిన నియమాలు పాటించే వ్యక్తి గర్వంతో, కిందికి దిగజారడం కద్దు. భౌతికంగా కఠిన నియమాలాచరించే వ్యక్తి స్వార్థ చింతన విడనాడగలిగితేనే ఫలితముంటుంది. ఆధ్యాత్మికత ఏమి చెప్తుందంటే మన దైనందిన జీవితంలో మనకందుబాటులోకి వచ్చిన ప్రతీదానిని దైవం మనకిచ్చిన బహుమతిగా భావించగలగాలి. దానికి దైవానికి కృతజ్ఞత అర్పించుకోగలగాలి. ఏవైనా నియమాలు పాటించ దలుచుకొంటే అవి అనారోగ్యానికి దారితీయకుండా చూసుకోవాలి. వ్యాధిగ్రస్తమైనా శ్రావ్యతను ఆనందించగలగాలి.

అతి వినయాన్ని ప్రదర్శించకుండడం, అతి వాచాలత్వాన్ని విడనాడడం, దయారహితమైన మాటలు, నొప్పించే మాటలు ఆడకుండా ఉండడం, అనవసరమైన వ్యర్థ ప్రసంగాలు చేయకుండడం, ఆతృతని, బాధని, అతి ఆనందాన్ని వెలిబుచ్చకుండా ఉండడం వాంఛనీయం.

అన్నిటికంటె కష్టమైనది ‘నా, నాది’ అనే భావనను విడనాడడం. కృష్ణుడు అర్జునుడికి బోధించే భగవద్గీత సారాంశమిదే. ‘నీవు నీ బాధ్యతను నెరవేర్చు. దాని ఫలితమేమవుతుందోననే విచారాన్ని విడిచిపెట్టు. నీ శాయశక్తుల శ్రమించు. నీవనుకొన్న దాంట్లో గెలిచినా, ఓడినా ఒకటే’.

దైవసాయుజ్యం కొరకు మనసుని ప్రేమతో నింపు. మిగతా విషయాలమీద ఆసక్తి, అనురక్తి అనవసరం. ఇతర వ్యాసంగాలమీద

దృష్టి, నీ చిత్తాన్ని దైవానికి దూరం చేస్తుంది. కబీరు మాటలలో చెప్పాలంటే, జ్ఞాని/అన్వేషకుడు తన అంతరంగంలో అవ్యాజమైన ప్రేమని, దానితో బాటు నిరాసక్తతను రెండింటినీ కలిపి ఉంచుకొంటాడు. గంగా, యమున నదులు నీళ్ళు కలిసినట్లు ఆ రెండూ అతడిలో కలసి ఉంటాయి'.

ఇతర విషయాలమీద వ్యామోహాలు, అనురక్తి ఉన్నంతకాలము దైవం మీద పూర్తిగా చిత్తము, ధ్యానముంచలేదు. అటువంటి వ్యాసంగాలన్నీ కట్టిపెట్టి మనసును ఖాళీచేస్తే, ఖాళీగా ఉంచగలిగితేనే, ఆ ఖాళీలోకి దైవప్రేమ ప్రవహిస్తుంది. ఏ వ్యామోహాలు లేని వ్యక్తిని ఎవరుమట్టుకి ఏం చెయ్యగలరు?

కఠిన నియమాలు పాటించడం కష్టతరము. బాధాకరము. కాని కొంతవరకది అవసరం. ముఖ్యంగా మేధోపరమైన, ఆహ్లాదకరమైన విషయాలను ఆనందించడానికిది తొలిమెట్టు.

కళాకారుడు, తత్వవేత్త, శాస్త్రవేత్త–వీరు తాముచేసే పనికి ఎటువంటి ప్రతిఫలం ఆశించరు. కళాకారుడు తక్కినవారివలె ఉపయోగం గురించి, లాభం గురించి మాట్లాడడు. తత్వవేత్త సాధారణత్వానికి అతీతంగా ఉంటాడు. శాస్త్రవేత్త ప్రకృతి రహస్యాలని ఛేదిస్తు దానిలో లీనమైపోతాడు. సోక్రటీసు, గెలీలియో అటువంటివారే. వారి అన్వేషణ వారి సౌందర్యారాధన, కొత్త విషయాలను ఆవిష్కరించడంలోని ఆనందమే వారికి ప్రతిఫలం. వీరికి స్వచ్ఛందమైన, సహజసుందరమైన ప్రేరణ/స్పందన కలగడం ద్వారా వీరికి వారి వారి రంగాలలో పరిపూర్ణమైన నైపుణ్యం సిద్ధిస్తుంది. ఓర్పుతో ఆ రంగానికి కావలసినదాన్ని పొందే ప్రయత్నం చేస్తాడు. తాను కృషిచేస్తున్న రంగంలో తాను కోరింది స్వేచ్ఛగ ఆవిష్కరించగలుగుతాడు. జీవించడం కూడ ఒక కళే. కళాకారుడు, తత్వవేత్త, శాస్త్రవేత్తల ధోరణిలోనే జీవించడం అవసరం.

మేధస్సు, భావన, ఊహ ఇవన్నీ మంచివే. ఆలోచనలలో, భావనలలో, ఊహలలో కఠిన నియమాలాచరించడం మాత్రమే సరిపోదు. అంతేకాదు ఇతరులను విమర్శించడం, వారి మీద మన అభిప్రాయాలను వ్యక్తపరచడం కూడ పూర్తిగ నిషిద్ధం. పవిత్రత సాధించాలంటే ఇతరుల మీద మన అభిప్రాయాలను వ్యక్తపరచకూడదు.

## క్రతువులు, మతాచారాలు, లాంఛనాలు, సాంప్రదాయాలు

క్రతువులు, మతసాంప్రదాయాలు, పూజావిధానాలు – వంటి వాటిల్లో పాల్గొనేవాళ్ళకు తామెందుకు వీటిలో పాల్గొంటున్నామో, దేనికోసం ఆచరిస్తున్నామో, వాటి మూలమైన దైవత్వాన్ని పొందే దానికనే విషయం గుర్తున్నంత వరకు వీటిని ఆచరించడం మంచిదే. దైవత్వానికని కేవలం సంకేతాలు మాత్రమే అని గుర్తుపెట్టుకొని ఉండాలి. కాకపోతే ఇందులో ఒక సమస్య ఉంది. ఒక సంకేతాల సమూహానికి అలవాటు పడిన వ్యక్తులు ఇంకొక సంకేతాల సమూహాన్ని దైవ స్వరూపంగా భావించడాన్ని వ్యతిరేకిస్తారు.

దేవుడు సర్వాంతర్యామి. అన్నిచోట్లా, అన్నివేళలా దైవాన్ని దర్శించుకోవచ్చు. కాకపోతే విగ్రహారాధకుడికి తాను పూజించే విగ్రహంలోనే గోచరిస్తాడు. ఆవుపాలు పొదుగునుండే పిండుకోవాలి. ఆ విధంగా చాలామంది తమ ఇహ జీవితంలో ఏవో కోరికలు తీర్చుకోవాలని భగవంతుని పూజిస్తారు. దానికొరకు ప్రత్యేకమైన పూజా విధానాలు ఏర్పరుస్తారు. వేరు వేరు దేవతలని పూజిస్తారు. పూర్తి భక్తి విశ్వాసాలతో కొలిచి, తమకోరికలు తీర్చుకొంటారు. కాకపోతే ఆ కోరికలు క్షణికానందమిచ్చేవయ్యుంటాయి. పదే పదే ఆ క్రతువులని, ఆ సాంప్రదాయాల్ని పాటించడం వలన మనసులో ఒక పదిలమైన ఆకారం ఏర్పాటవుతుంది.

దానంతటదే ఒక ప్రత్యేకమైన ఉనికిని ఏర్పరచు కొంటుంది. మరల మరల ఆ ఆచారాలను, సాంప్రదాయాలను భక్తి విశ్వాసాలతో పాటించే వారు తమ ఆలోచనలకు ఊహలకు అతీతమైన దానినేదో మనసులో అనుభవిస్తారు. ఆయా దేవతామూర్తులకు ప్రత్యేకమైన శక్తులు సమకూరి నట్లే అనిపిస్తుంది. మనస్సును, ఆధ్యాత్మికత, ఇతర భౌతికమైన విషయాలు ఆ దివ్యశక్తి అధారంగానే నడవడం జరుగుతుంది.

దేవుళ్ళు, దేవతలు మనుషులు పూజించినంతకాలము శక్తివంతంగా ఉంటారు. భక్తులలో భక్తి, విశ్వాసాలు సన్నగిల్లగానే ఆ దేవుళ్ళు దేవతలు మూలపడతారు. ప్రపంచంలో ఎన్నో గుళ్ళు, మసీదులు, చర్చీలున్నాయి. వాటిలో ప్రవేశించగానే మనకు ఏదో ఒక ప్రత్యేకభావం కలుగుతుంది. మనుషుల ఆలోచనలు, భక్తి భావాలందులో మోహరించి ఉంటాయి. అవి నిజమే అయినప్పటికీ ఆదిమధ్యాంతరహితమైన, గుణాతీతమైన దైవత్వం మట్టుకి అక్కడుందని చెప్పలేము.

క్రతువుకి, వాస్తవమైన ఉనికికి మధ్యనున్న తేడా ఆ భక్తుడికి వాటిపట్ల ఉన్న ప్రతిస్పందన బట్టి ఉంటుంది. భక్తుడి మనసులో తిష్టవేసుకొని ఉన్న మూర్తి భక్తుడి ఎదుటనున్న విగ్రహంలో కనపడడం జరుగుతుంది. ఇది పదే పదే చేసే పూజావిధానాన్నిబట్టి, ఆచరించే క్రతువుని బట్టి ఉంటుంది. ఇంకొక ముఖ్యవిషయమేమంటే ఆ భక్తుడికే కాక వేరే వ్యక్తులకు కూడ ఏదో అనీర్వచనీయభావం కలుగుతుంది. అత్యంత భక్తి శ్రద్ధలతో ఒక దేవతామూర్తిని పూజించే భక్తుడి మనస్సులో ఆ విగ్రహం ప్రతిష్ఠితమై ఉంటుంది. అత్తరు తయారుచేసే వ్యక్తి అత్తరు వాసన వేసినట్లు ఆ మూర్తి ఆ భక్తుడి మనసులో తిష్టవేసుకొంటుంది. కబీరు, మీరా, త్యాగయ్య దీనికి ఉదాహరణలు.

గాఢమైన భక్తి, విశ్వాసాలతో, దీక్షతో ఒకటేరకమైన పూజావిధానం ఆచరించే భక్తులు వాళ్ళ ఆలోచనలకు, భావనలకు మూర్తిమంతాన్ని కలగచేయడం. ఆ మూర్తిపట్ల భక్తి, భయం ప్రదర్శించడం, తాము పఠించే మంత్రాలకు ప్రత్యేకమైన శక్తి సామర్థ్యాలను ఆపాదించడం– ఇవన్నీ ఆ భక్తుల పట్ల నిజమైన అనుభవాలే. వాటిని తప్పుపట్టలేము. అదే భక్తి, శ్రద్ధలతో ఇతరులు ఆ మూర్తిని కొలిస్తే అదే విధమైన అనుభవం కలిగే అవకాశముంది.

ఇదంతా దైవానుగ్రహమనుకోరాదు. కొన్ని ప్రదేశాలు, కొన్ని పదాలు, కొన్ని క్రియలు కొన్ని అతీంద్రియ శక్తులకు, కొన్ని మార్మికమైన శక్తులకు ఆలవాలమై, భక్తుల మనసులలో గూడుకట్టుకొని ఉంటాయి. ఇదంతా ఆధ్యాత్మికం కాజాలదు. ఇది కేవలం నిగూఢశక్తుల సమాహారం. 'వైట్ మ్యాజిక్' అని కూడ అనొచ్చు.

ఇదే అసలు సిసలైన మతమని నమ్మడం అవివేకం. ఆ మూర్తి లేదా మూర్తులు కేవలం అసలు దైవానికి ప్రతిరూపాలుగా, తమ ఆలోచనలు, భావనలు కల్పించినవి తప్ప మూలమైన దైవత్వమిది కాదు. అవి గుర్తుంచుకొన్నంత కాలము ఏ హానీ లేదు. కాని మూర్తి పూజే/ విగ్రహారాధనే ముఖ్యమనే స్థాయికి చేరుకోరాదు. అట్లా అనుకోవడం వలన వారి నిజమైన, అసలైన ప్రయత్నం దేవుని సాయుజ్యం మరింత ఆలస్యమౌతుంది.

అన్ని మతాలకు సంబంధించిన ఆధ్యాత్మిక గురువులు క్రతువులను వ్యతిరేకిస్తారు. అయినప్పటికి అధిక సంఖ్యాకులు సాంప్రదాయ బద్ధమైన మతాన్నే కోరుకొంటారు. ఎందుకంటే దానివలన వారికి మానసికమైన తృప్తి కలుగుతుంది. ఆధ్యాత్మిక జీవనమంటే చాలామందికి ఈ

మంత్రోచ్చారణలు, ప్రార్థనలు, పూజలతో కూడినదే. దైవాన్ని చేరుకోడాని కవి ప్రవేశద్వారాలుగా భావిస్తారు. తమలో ఏదో శక్తి ప్రవహిస్తున్నట్లు అనుభూతి చెందుతారు. ఈ సాధనాలలో పడి తన అహాన్ని విడనాడక పోతే మట్టుకి ఆ వ్యక్తికి ముక్తి సాధించడం దుర్లభం.

అందరు ఆధ్యాత్మిక గురువులు ఒక విషయాన్ని ధృవీకరిస్తారు. నీ గురించి నీకు తెలియకపోతే దేవుడు గురించి తెలియడం కష్టం. మనిషి ఒక విగ్రహానికో, ఒక దేవాలయానికో, ఒక పూజావిధానానికో పూర్తిగా అంకితం కాకుండా, తన దైనందిన జీవితంలో ప్రతి నిముషము, ప్రతిచర్య భగవదాంశలో ఒక భాగమేనని భావించగలగాలి. తాను కలిసే ప్రతివ్యక్తి, పూజనీయుడిగా, ప్రతిపనీ పూజావిధానంగా భావించగలగాలి.

మనుషుల జీవితాలు, ఆలోచనలు, విషయాలు అన్నీ సంకేతాలే (Logos) అని వేదాంతం చెప్తుంది. కాని ప్రజలు తమను, తమచుట్టూ ఉన్నవారిని మాత్రమే వాస్తవమనుకొంటుంది. వాస్తవం కాని దానిని వాస్తవమనుకోడం వలన వారు మోక్షానికి దూరమౌతున్నారు. వస్తువులు, విషయాలు సంకేతాలని, చర్యలు క్రతువులని మనం గుర్తించాలి.

మన దినచర్యలోని మంచి పనులన్నీ క్రతువులుగానే భావించాలి. దూరముంచాలి.

ఈ పూజావిధానాలు, ఉత్సవాలు వ్యక్తులను సమూహాలుగ ఏర్పరుస్తాయి. ఒకరితో మరొకరికున్న బాంధవ్యాల్ని, దైవంతో మన సంబంధాన్ని తెలియచేస్తాయి. సామూహిక జీవనాన్ని పెంపొందిస్తాయి. ఒంటరిగా, వ్యక్తిగతంగా దైవ ప్రార్థన చేసే వ్యక్తి, నలుగురితో కలసి సామూహికంగ చేసేవి ఈ పూజలు, ఉత్సవాలు.

అధ్యాయము 8

# నైతిక పరిజ్ఞానం

నైతిక కార్యాచరణ పద్ధతికి, ఆధ్యాత్మిక జ్ఞానానికి అవినాభావ సంబంధముంది. నిస్వార్థమైన ప్రవర్తన మరింత జ్ఞానాన్ని పొందే అవకాశాన్ని కలిగిస్తుంది. ఆ జ్ఞానం ఇంకొన్ని/మరికొన్ని నిస్వార్థమైన పనులు చేసేందుకు ప్రోత్సహిస్తుంది. ఈ విధంగా ఇవి రెండూ ఒకదాని కింకొకటి అనుసంధానం చేసుకొంటూ, ఎడతెగకుండ ముందుకు సాగుతుంటాయి. మనం సంపాదించుకొనే జ్ఞానం మన సంకల్పబలం మీద, మన మానసిక భౌతిక స్థితిగతులమీద, వాతావరణం వంటివి మనపై చూపే ప్రభావం మీద ఆధారపడి ఉంటుంది. సాంకేతిక విజ్ఞానాన్నే తీసుకొందాం. 'నాకు ఇది కావాలి, నేనిది పొందాలి' అనే కోరికతోనే అది మొదలవుతుంది. ఆ కోరిక సత్వరంగానే తీరుతుంది.

నైతిక, ఆధ్యాత్మికరంగాలలో కూడ ఇది సాధ్యం. సాధువు లేమంటారంటే 'నీవేది కోరుకొంటే అదే సిద్ధిస్తుంది. నీవెంత నిజాన్ని/సత్యాన్ని కోరుకొంటే అంత నీకు లభిస్తుంది' అని. ఎటువంటి జ్ఞానాన్ని కోరితే అటువంటిదే నీ అనుభవంలోకి వస్తుంది. అంతా నీలో అనగా కోరే సాధకుడిలో ఉంటుంది. ఆధ్యాత్మికంగా నీవు పేదవాడివైనా నీకు స్వచ్ఛమైన మనసు ఉంటే నీకు ముక్తినొసగే దైవజ్ఞానం లభిస్తుంది. ఇటువంటి స్థితి చాలా కష్టతరమైనది. కాని నిరాడంబరతతో ప్రయత్నిస్తే తప్పక సాధ్యమౌతుంది.

మనకందుబాటులో ఉన్న రకరకాల ప్రేరేపణల/ప్రభావాల మధ్యగల వ్యత్యాసమేమిటో తెలుసుకోగలిగే నైతిక మేధస్సు మనకుండాలి. మన మాటను, మన మనసును నిగ్రహించుకొనే శక్తి ఆధ్యాత్మిక జీవనానికి ఎంత అవసరమో ఈ మేధోపరమైన నైతికత అంతే అవసరము.

ఒక వ్యక్తికి నిశితమైన నైతిక పరిజ్ఞానముంది అన్నామంటే అతడి నిర్ణయం/తీర్పు న్యాయవంతమైనది. అతడికి ఏది మంచో తెలుసునని అర్థం. అతడికి బలమైన నీతి శీలము ఉన్నాయని అన్నామంటే అతడు తన మానసిక పరిపక్వత ఆధారంగా పనిచేస్తాడని అర్థము.

ఈ సందర్భంగా మనిషి దృక్పథం గురించి చెప్పుకోవాలి. మనిషి తన దృక్పథానికి అనుగుణమైన ప్రపంచాన్ని ఏర్పరుచుకొంటాడు. అతడి జయాపజయాలకదే పునాది. నిలబెట్టడానికైనా, పడగొట్టడానికైనా అదే మూలం. ఇతర మనుషుల గురించి, పరిస్థితుల గురించి మన మనోభావాలను నిర్ధారించేది మన దృక్పథమే. సానుకూలమైన గుణ యుక్తమైన, సంతోషకరమైన దృక్పథమే మంచి ఫలితాలనిస్తుంది. వ్యతిరేక భావనలు వ్యతిరేక ఫలితాలనిస్తాయి.

మనలోన కలిగే భావనలు, మనచుట్టూ జరిగే విషయాలు, మనకు జరిగే సంఘటనలు, అన్నీ మనలో ఒక దృక్పథాన్ని ఏర్పరుస్తాయి. ఏమి జరిగినా, మనమా సంఘటనను ఏ దృష్టితో చూస్తున్నామనేది ముఖ్యం. మనచుట్టూ జరిగే సంఘటనలకు మన ప్రమేయమేమీలేదు. వాటిమీద మనకు ఆధిపత్యం లేదు. కాని వాటిపట్ల మనమెట్లా స్పందించాలి అనేది మనచేతిలో ఉంది.

యుక్తమైన దృక్పథంతో ప్రతినిత్యము మనమానందంతో ఉండ గలగడమే కాకుండా ఇతరులను కూడ సంతోష పెట్టగలుగుతాము. ఒత్తిడి, నిరాశ, నిస్పృహలు మనదరి చేరనీయకూడదు. జీవితం పెద్దది. చిన్న చిన్న చికాకులు ఏమీ చేయలేవు. మన దిగుళ్ళలో మనం మునిగి పోకుండా ఇతరుల చింతలను పారదోలే పనిలో నిమగ్నం కావాలి. ఇతరుల మీద ధ్యాసపెట్టడంతో మన ఆలోచనా విధానమే మారిపోతుంది.

మన స్నేహితులు, బంధువులే కాకుండా ఎవరికి అవసరమైతే వారికి సాయం చేయాలి. ఒకింత మనమితరులకు సాయం చేస్తే మనకు పదింతలు సాయం దొరుకుతుంది.

ఒక్కొక్కసారి మనం అననుకూల పరిస్థితులలో చిక్కుకొంటాం వ్యధా భరితమౌతుంది మనసు. దానికి పరిష్కారమొకటే. కొద్దిగా విరామం/ విశ్రాంతి తీసుకోడం. పరిస్థితులు మనసు వాటంతటవే చక్కబడుతాయి. జీవితం చిన్నది. వెనక్కి తిరిగి చూసుకొని బాధపడడం కంటే, మన దృక్పథాన్ని మార్చుకొనే ప్రయత్నం చేయాలి.

రోజులు, వారాలు, నెలలు, సంవత్సరాలు వేగంగా పరుగెడ్తాయి. వెనుకటి రోజులను తలచుకొని కృంగిపోయే బదులు, సంతోష ఘడియలని మాత్రమే నెమరువేసుకోవాలి. నేనున్నది అతి క్లిష్టమైన పరిస్థితి. అతి గడ్డు పరిస్థితిలో ఉండి ఉండొచ్చు. ఏదైనా కారణముండి ఉండొచ్చు. గుర్తు పెట్టుకోవలసింది ఒకటే ఇంతకంటే కష్టస్థితిలో ఉన్నవారు మనకంటె మెరుగైన పనులు చేశారని గుర్తుంచుకోడమే.

ఎన్నో అవరోధాలను, అడ్డంకులను, కష్టాలను ఎదుర్కొని ఆ సానుకూల ధోరణితో అన్నిటిని అధిగమించిన వారున్నారు. వారికి సాధ్యమైనపని మనకెందుకసాధ్యమౌతుంది. గుణయుక్తమైన దృక్పథం ఎల్లప్పుడూ మనకందుబాటులోనే ఉంటుంది. చేయిచాచి దాన్నందు కోవాలి. అదే మన లక్ష్యంకావాలి. వ్యతిరేక భావాలున్నవారు మన చుట్టూ ఉన్నాసరే, మనం మంచి దృక్పథంతో కొనసాగాలి. మనచుట్టూ ఉన్నవారి వ్యతిరేక ధోరణి మనమీద ప్రభావం చూపుతుంది. దానికి లోనుకాకుండా, జాగ్రత్తగా మసలుకొని, మనం వారిలో సరియైన ధోరణిని విత్తే ప్రయత్నం చేయాలి. వ్యతిరేక సంభాషణను అడ్డుకోవాలి. మంచివేపు మళ్ళించాలి. మనం వారి దృష్టిని/దృక్పథాన్ని మార్చలేము అనుకొంటే అక్కడినుండి

తప్పుకోవాలి. మన దృక్పథం సానుకూలమైనదైతే, సమస్యలు అవకాశాలుగా అవరోధాలు తొలగి, అసాధ్యాలు సుసాధ్యాలుగా మారుతాయి.

ఒక్కొక్కసారి ఇతరులు మాట్లాడే వ్యతిరేకమైన మాటలు మనలను కకావికలం చేయవచ్చు. ఇటువంటి పరిస్థితులలో అటువంటి వ్యక్తిని ఖాతరు చేయకుండా ఉండాలి, మంచిమాటలతో పరిస్థితులను చక్క దిద్దాలి. వారి వ్యతిరేక స్వభావానికి దూరంగా అయినా ఉండాలి.

ఇతరులు చికాకుగా ఉన్నప్పుడు, వారిని కొంతసేపు ఒంటరిగా వదిలేసి, వారి మస్తిష్కం చల్లబడ్డాక, మంచిమాటలు చెప్పి వారినుల్లాస పరచాలి. చికాకును దూరం చేయాలి.

మన మనసును సదా ఉత్సాహంగా ఉంచుకోవాలి. అప్పుడప్పుడు వ్యాకులపడడం సహజమే. ప్రయత్నించి ఉల్లాసం తెచ్చిపెట్టుకోవాలి. ప్రకృతి మనకెన్నో గొప్ప వరాలిచ్చింది. అవి పోగొట్టుకొనే దాక వాటి విలువ మనం తెలుసుకోము.

వ్యతిరేక భావాలెట్లా కలుగుతాయి?

వ్యతిరేకమైన ఆలోచనలు వ్యతిరేక ధోరణిని కలిగిస్తాయి. అదే ఒక అలవాటయి, అవి వ్యతిరేక భావాలని కూడ అర్థంకాని స్థితికి చేరుకొంటాము. వ్యతిరేక దృక్పథం చికాకు కలిగిస్తుంది. అయినా దానినే అతుక్కొని పోతాడు మనిషి. తనకు చెడుతప్ప మంచి జరగదని నిర్ధారించు కొంటాడు ఇదే చక్రంలో తిరుగుతూ ఉంటాడు.

సానుకూల దృక్పథాన్ని అలవరచుకోడమెలాగ?

దీనికి గట్టి ప్రయత్నమే చేయాలి. మనలోని అంతర్గత భావాలని సానుకూలంగా మార్చుకోవాలి. ప్రతి ఆలోచననీ విశ్లేషించి, మంచి

భావనలు కలిగేవరకు ప్రయత్నిస్తూనే ఉండాలి. పొగతాగడం మానేయా లంటే వ్యాయామం చేయాలి. మంచి ఆలోచనలు కోసం కూడా శ్రమించాల్సిందే. ఇది ఒక్కరాత్రిలోనో, ఒక్క రోజులోనో అయ్యేపని కాదు. కొందరనవచ్చు, ఏమని? ప్రతినిత్యమూ అనుకూల, వ్యతిరేక సంఘటనలు జరుగుతుంటాయికదా?' అప్పుడెలాగ అని. ఇది పూర్తిగా తప్పు. సంఘటనలు జరుగుతుంటాయి. కాని అవి అనుకూలమైనవో, ప్రతికూల మైనవో మన దృక్పథం నిర్ణయిస్తుంది. మన ఆలోచనలు, భావనలు ఏ విధంగా ఉండాలన్నది మన ఇష్టం. ఇతరులకెవ్వరికీ వాటిమీద ప్రమేయం లేదు. మన ధోరణిని మనం అదుపులో పెట్టుకోవాలి. మంచి ఫలితాలు దానంతటవే వస్తాయి. మన పరిస్థితిని బట్టే ఫలితాలుంటాయన్నారు పెద్దలు. మనది సానుకూల ధోరణి అయినట్లయితే, ప్రపంచంతోటి మన సంబంధబాంధవ్యాలు ప్రకాశమానంగ ఉంటాయి. అంతటా ఆహ్లాద వాతావరణం అలుముకొంటుంది. ఆరోగ్యం బాగుపడుతుంది. ప్రశాంతత చేకూరుతుంది.

మంచి దృక్పథాన్ని అలవరచుకోడమెలాగ?

దీనికి మూడు మార్గాలున్నాయి. 1. ఎఱుక 2. అంగీకారం 3. ధృవపరచడం.

1. మనం ప్రతినిమిషం మన ఆలోచనలని, ఆలోచనా విధానాలని అభిప్రాయాలని జాగ్రత్తగా పరిశీలుస్తుండాలి. దీనిని సాధించి, ఒక అలవాటుగా మార్చుకోవాలి. 'అంతర్ మౌనం', 'యోగనిద్ర' ప్రక్రియలు ఈ విషయంగా సహాయం చేస్తాయి. మనలను మనం శోధించు కొనేందుకు తోడ్పడతాయి.

2. 'అంతా మన మంచికే' అనే ధోరణిని, ఉన్నదాన్ని ఉన్నట్లు అంగీకరించే మనస్తత్వాన్ని పెంపొందించుకోవాలి. భగవంతుడు మనలని

యధావిధిగ ప్రేమిస్తాడు. ఉన్నదున్నట్లు అంగీకరించే ప్రేమ, అనుకరింప జనిస్తాయి. ఈ విధానం వ్యతిరేకతని తగ్గిస్తాయి.

3. ధృవీకరణ : అష్టావక్రుడిలా అంటాడు. 'నేను స్వేచ్ఛగా ఉన్నాను అనుకొంటే నీవు స్వేచ్ఛగా ఉంటావు. నేను బంధీనై ఉన్నాను అనుకుంటే నీవు బంధీగానే ఉంటావు'. అంతా మన భావనలోనే ఉంది. ఈ విధమైన ఆలోచనా ధోరణిని అలవరచుకోవాలంటే కొన్ని గొప్ప సూక్తులను పదే పదే మననం చేసుకొంటూ ఉండాలి. కొన్నాళ్ళ కవి మనలో అంతర్భాగా లవుతాయి.

మన మనసులోకి అవి పూర్తిగా దిగి, చొచ్చుకొనిపోయి ఇది ధ్యానం వలన సాధ్యమవుతుంది. అవధూత గీత ఇలా ఉపదేశిస్తుంది. వేదాంత సారమంటే', నాకొక ఆకృతిలేదు, నేను ఆ నిరాకార, నిర్గుణ దైవంలో ఒక భాగాన్ని' అనుకోవడం. ఒక సాధకుడికి ఇంతకు మించిన ధృవీకరణ ఇంకొకటిలేదు.

మన ఆలోచనలు ఎలాగున్నాయో తెలుసుకొంటే, ఒక వ్యక్తిగురించి, ఒక విషయాన్ని గురించి, సంఘటన గురించి ఏ విధంగా ఉండాలో నిర్ణయించుకోవచ్చు.

గుణయుక్తమైన దృక్పథం మన శరీరంలో సానుకూలమైన ప్రకంపనలు పుట్టిస్తుంది. అవి చుట్టూ ఉన్న వాతావరణాన్ని ప్రభావితం చేస్తాయి. సంఘటనలని ప్రభావితం చేస్తాయి. బాధను దూరం చేస్తాయి. శాంతిని ఒనగూరుస్తాయి. సామరస్యాన్ని ఇనుమడింప చేస్తాయి. మనలో దాగి ఉన్న శక్తికి మనకే ఆశ్చర్యం కలిగిస్తుంది. గొప్ప కార్యాలు చేయడానికి దారి తీస్తుంది. అదే విధంగ ప్రతికూల ధోరణి అనర్థాన్ని, చేటుని కలిగిస్తుంది.

అధ్యాయము 9

# నైతికత

ధర్మము మానవుడి స్వాభావికమైన ఋజువర్తనానికి, పవిత్రతకి, దాతృత్వానికి సంబంధించినది. అది మనిషి ఆత్మని ప్రకాశవంతం చేసి దైవంతో సాయుజ్యానికి దారితీస్తుంది. 'నైతికత' 'ధర్మము' లోని భాగమే. అది సమాజంలోని మనిషి ప్రవర్తనకు సంబంధించినది.

నైతికత ఒక ప్రజల సమూహము ఏర్పరుచుకొన్న ప్రవర్తనా నియమావళి. ఎప్పటికప్పుడు ఆ ప్రవర్తనా నియమావళిని బేరీజు వేయడం, తగిన మార్పులు చేర్పులు చేయడం కూడ ఇందులో భాగమే. చెలామణిలోనున్న నియమాలను నిశితదృష్టితో పరిశీలించడం కూడ నైతికతలో ఒక భాగం. మనుష్యుల జీవితంలో అనేక సమస్యలు తలెత్తుతుంటాయి. అవి చిన్నవి కావచ్చు, పెద్దవి కావచ్చు, భౌతికం కావచ్చు ఆధ్యాత్మికం కావచ్చు, కుటుంబపరం కావచ్చు, వ్యక్తిగతం కావచ్చు, సామాజికం కాని, రాజకీయంకాని – ఏదైనా కావచ్చు సమస్యకు సరియైన పరిష్కారం కోసం ప్రయత్నం మొదలవుతుంది.

సమస్య వ్యక్తిగతమే అయినా సార్వజనిక అభిప్రాయం దాని పరిష్కారంలో మధ్యపాత్ర వహిస్తుంది. మనిషి సంఘజీవి కదా.

సమస్యకు సంబంధించిన అన్ని కోణాలు, అన్ని వివరాలు సేకరించిన పిదప, అందుబాటులో ఉన్న నైతిక సూత్రాలను లిఖితము/అలిఖితము రెండింటిని తరచి చూసి నిర్ణయం తీసుకోవలసి ఉంటుంది. ముందు తన మనసు/అంతరాత్మ ఏమి చెప్తుందో వినాలి. అంతిమ నిర్ణయాన్ని అమలు చేసేందుకది చాలా ముఖ్యం. ఏది 'సరియైన'

నిర్ణయమని మనసు భావిస్తుందో తెలుసుకోవాలి. నైతికజ్ఞానులు/ తత్వవేత్తలు మనుషులు తాము ఏది 'మంచి'/సరియైన నిర్ణయమని భావిస్తారో దానిని ఆచరింపచేయడం కన్న 'ఏదిమంచో' అనేది తెలుసు కోవడం ముఖ్యమంటారు.

హృదయవైశాల్యం, మితం, దయ దానగుణం వంటివి మనిషి అలవాట్లు. ఆంగ్లంలోని (ethics) నైతికత మూలపదం ethos అనగా అలవాటు. అవి సహజసిద్ధమైనవి కాకపోయినా ప్రకృతి విరుద్ధమైనవి కావు. ప్రకృతి నుండి మనకు సంక్రమించి, మన అలవాటుగా గట్టి పడతాయి. మనిషి దైవసృష్టి అంటారు Pieper. స్వతహాగా మనిషికి కొన్ని హక్కులకోసమని అతను వాదించుకొనే హక్కు కూడ ఉంది. ఇతరులు తన హక్కులు హరించి వేయకుండ చూసుకోడం కూడ మనిషి హక్కు. 'మానవహక్కులు' అంటే ఏదిమంచో దానికోసం పెనుగులాడడం. దురదృష్టవశాత్తూ 'నాకిదికావాలి, ఇది నా హక్కు' అనే అర్థంతో, తన స్వార్థం కోసం పోరాడడం హక్కుగా చెలామణి అవుతోంది. మనిషి ఆలోచనాపరుడు అతని ఆలోచనకు మూలాధారం 'కారణం/హేతువు. హేతువు అనేది అతడి ఆవేశాలను, గాఢమైన ఉద్రేకాలను తృప్తిపరిచే సూత్రంగా కాకుండా అతడి ఆలోచనలని సరియైన దిశగా మళ్ళించి, సృజనాత్మకంగా పనిచేసే సూత్రం కావాలి.

అందుచేత నైతికత అంటే క్రమశిక్షణ. ఏది మంచి, ఏదిచెడు, ఏది తత్వం, ఏది ఒప్పు, ఏవి మన బాధ్యతలు, ఏవి మన విలువలు అది మనలను, మన ప్రవర్తనను మన హక్కులకు అనుగుణంగా, నడవడిని నిర్దేశించేది నైతికత. యంత్రాలు పనిచేస్తాయి. మృగాలు సంచరిస్తాయి. నక్షత్రాలు కదులుతాయి, మనిషి కొక్కడికే నడవడి అనేదుంది. అది నైతికవంతం కావాలి.

**అధ్యాయము 10**

# సవ్యమైన చర్య

'మీమాంస' ప్రకారం కార్యాచరణ పద్ధతులు మూడు రకాలు:

ఒకటి: మనిషి జన్మ ఎత్తడం వలన తప్పని సరిగా చేయవలసినవి. ఆ పనులు చేయడంలో ప్రత్యేకమైన ప్రతిభ అంటూ ఏమీ ఉండదు. మనిషిని, సమాజాన్ని, విశ్వాసాన్ని నిలబెట్టి ఉంచడాని కవి అవసరము. రెండు: కొన్నిచేయరాని పనులు చేపడితే అవి అనర్థదాయకమవుతాయి. అవి చేయకుండా ఉన్నంత మాత్రాన నెత్తిన కిరీటమేమీ రాదు. అయినా అవి చేయకుండ ఉండడం కూడ తప్పనిసరి. మూడు: ఈ రకం పనులు చెయ్యడం ఐచ్ఛికం. కావాలంటే చేయొచ్చు లేదా మానెయ్యొచ్చు. జీవితంలో ఏదైనా సాధించాలంటే కొన్ని త్యాగాలు చేయవలసి ఉంటుంది. కాకపోతే ఇవి తప్పనిసరి కావు.

మీమాంస మంత్రతంత్రాలతో కూడిన కార్యక్రమాలను గురించి కూడా చెబుతుంది. క్షుద్రశక్తులను ఆరాధించడం, మంత్రతంత్రాల సాయంతో శత్రువులను హింసించడం, చంపించడం వంటివాటిని గురించి చెబుతూ ఆ కార్యక్రమాలను చేపట్టేవాడు కూడా శిక్షకు, హింసకు లోనవుతాడని చెబుతుంది మీమాంస. ఈ పద్ధతులను గురించి చెబుతుంది కాని హత్య, దొంగతనం, హింస వంటివాటి గురించి చెప్పదు. ఈ విషయాలలో భగవద్గీత ఒక కొత్త కోణం ఆవిష్కరిస్తుంది. మనిషి చేపట్టే పనుల వలన మోక్షము రాదు అంటాడు కృష్ణుడు. పనులు చేసేది శరీరము. అది ప్రకృతి ప్రసాదము. కాని ఆ పనులతో ఆత్మకు ఎటువంటి సంబంధమూ లేదు. ఆత్మకు, ప్రకృతికి సంబంధం లేదు. అయినప్పటికీ ఆత్మ ప్రకృతి

పరిధిలో ఉన్నంతవరకు తన కర్తవ్యాన్ని నిర్వర్తించాల్సి ఉంటుంది. అహంకారంతో సంబంధంలేని సహజమైన పనులు చేపట్టాలి. ప్రకృతిని అధిగమించి అతీతమైన పనులు చేపట్టాల్సిన అవసరముంది. కృష్ణుడు మీమాంస సిద్ధాంతాన్ని దుయ్యబట్టడమంటే మతపరమైన బలులను, క్షుద్రదేవతలను ఆశ్రయించడాన్ని దుయ్యబట్టడమే. అందులో ముక్తిమార్గము లేదు. విమోచన లేదు. వీటివలన కృష్ణుడు వేదాలను బహిష్కరిస్తున్నాడని అర్థంకాదు. అలాంటప్పుడు తానే సర్వవేద సారాంశమని చెప్పేడివాడు కాదు.

ఏది సవ్యమైన చర్యో భగవద్గీత వివరిస్తుంది. అదే విధంగ ఏది అపసవ్యమో కూడ చెప్తుంది. ఏ చర్యా చేయకుండ ఉండడాన్ని గురించి కూడ చెబుతుంది. ఏ చర్య చేయకుండ ఉండడమంటే కాళ్ళు, చేతులు ఆడించకుండ ఉండడం కాదు. అహంభావం లేకుండా చేపట్టే దానిని నైతిక చర్య అనొచ్చు. దాని ఫలితాల ప్రభావం చేసే వ్యక్తి మీద ప్రసరించదు. అటువంటి చర్య చేపట్టే వ్యక్తికి దానిని తాను ధర్మం కోసమే ఆ పని చేస్తున్నాడని, తన కోసం కాదని తెలుసు. ఆ పని తన శరీరానికి, తన కోసం కాదని తెలుసు. ఆ పని తన శరీరానికి సంబంధించింది. ఆత్మకు సంబంధం లేదని కూడ తెలుసు. మనిషి ప్రతిపనినీ వీలయినంత మెరుగ్గా చేయాలి. ఫలితాన్ని దేవునికి వదిలేయాలి.

ఈ ప్రపంచంలో ప్రతీ చర్యకు ఫలితముంటుంది. జీవించి ఉన్న ప్రతీవ్యక్తి ఏదో ఒక పనిలో నిమగ్నమై ఉంటాడు. ఒక జ్యోతిష్కుడు ఒక కుర్రవాడిని చూసి ఇతడు గొప్ప పండితుడవుతాడని జ్యోతిష్యం చెప్తాడను కోండి, ఆ కుర్రవాడు ఏ ప్రయత్నమూ చేయకుండ పండితుడు అయిపోతాడా? కాదు. అతడెంతో కృషి చేయాలి. ఆ కృషి ఫలితంగానే అతడు పండితుడయ్యే వీలు ఉంది. ఇందులో 'విధి' పాత్ర ఏమీలేదు.

స్వయంకృషి రెండు రకాలు. మొదటిది గత జన్మకి సంబంధించినది రెండవది ప్రస్తుత జీవితానికి సంబంధించినది. ప్రస్తుత జన్మ / జీవితంలో చేపట్టే పనులతో/స్వయంకృషితో గతజన్మ తాలూకు కర్మలను/ఫలితాలను పడగొట్టొచ్చు, ఎదురించొచ్చు. విధి అంటే పూర్వజన్మ కర్మఫలమే. ప్రస్తుత జన్మకి, పూర్వ జన్మకర్మ ఫలితానికి నిత్యము సంఘర్షణ చెలరేగుతూ ఉంటుంది. ఏది బలమైనదో అది గెలుస్తుంది.

శాస్త్రాల కనుగుణంకాని స్వయంకృషి ఫలితాన్నివ్వదు. అంటే అది భ్రమ/భ్రాంతి ఆధారభరితమైన స్వయంకృషి. నీతివంతమైన స్వయంకృషికి మించింది లేదు. చెడును మంచితో, గతజన్మ కర్మఫలితాన్ని, ప్రస్తుత జన్మలో చేసే ఉత్తమ కృషితో ఎదిరించి మంచి ఫలితాన్ని పొందవచ్చు.

అలసత్వానికి, సోమరితనానికి వీలుపడనివ్వక నిత్యం కృషిచేస్తూ ఉండాలి. ఈ జీవితం ఎంతో కాలం కొనసాగదని మరచిపోగూడదు. క్రిములు చీములో దొర్లుతున్నట్లు మనిషి ఇంద్రియలోలత్వానికి లోనుకాకూడదు. జ్ఞానసముపార్జన చేసి, వివేచనతో చేసే స్వయంకృషి మాత్రమే సత్ఫలితాన్నిస్తుందని, సత్యానికి దగ్గరవుతామని తెలుసుకోవాలి. కృషినిబట్టే ఫలితముంటుంది. యిష్టాయిష్టాలకు దూరంగా ఉండి, శాస్త్రాలను సరిగ్గా అర్థం చేసుకొని, సాధుపుంగవుల ప్రవచనాలను అవగతం చేసుకొని చేసే స్వయంకృషి సత్యానికి దారితీస్తుంది.

స్వయంకృషి మూడు విధానాలు కనుక మూడు రకాల ఫలాలు లభిస్తాయి. అది అంతర్గతం మేలుకొలుపు. మానసిక నిర్ణయం భౌతికమైన కార్యాచరణ. గురువుల ఉపదేశాలు, శాస్త్ర పరిజ్ఞానము, స్వయంకృషి కలిస్తేనే ఋజుమార్గమేర్పడుతుంది. ఇక్కడ 'విధి', 'గ్రహపాటు'కి చోటు లేదు. కలుషితమైన మనసుని దారి మళ్ళించి, నిత్యకృషితో పవిత్రతతో, స్వచ్ఛతతో నింపాలి. అది విమోచనకి దారి తీస్తుంది.

పూర్వజన్మ కర్మఫలితం లేదా సంస్కారం ఈ జన్మలో చేసే మంచి పనులతో పునీతం చేయొచ్చు. కాకపోతే జన్మరాహిత్యం విముక్తి ద్వారానే లభిస్తుంది.

సంస్కారాలు రెండు రకాలు. పవిత్రమైనవి మోక్షానికి దారితీస్తాయి. అపవిత్రమైనవి బంధంలోనే ఉంచుతాయి. పూర్తి ఎఱుకతో, చైతన్యంతో పనిచేసేది మొదటిది; రెండవది జడపదార్థం. ఇతరులు చెప్పేది కాకుండ తనకు తాను తెలుసుకొని ముందుకు సాగేది మొదటిది. తనలోని లోపాలను సరిదిద్దుకుంటుంది. తానెంత పట్టుదలతో శ్రమిస్తే అంత ఫలితమొస్తుందని సాధకుడికి తెలుసు. ఇక్కడ 'విధి' 'గ్రహపాటు', 'తలరాత', 'దైవలీల' వంటివేవీ పనిచేయవు. సత్సంగులతో కాలక్షేపం చేయాలి; శాస్త్రాలను శ్రద్ధగా, తెలివితేటలతో అభ్యసించాలి. సత్యమైన పనిచేపట్టాలి.

వైరాగ్యం (సన్యాసము) మూడు విధాలు: త్యాగము, దాతృత్వము, పశ్చాత్తాపము. ఇవి ఆత్మను ప్రక్షాళనం చేస్తాయి. ఫలితమెట్లా ఉంటుందో నని ఆశించకుండ చేపట్టాల్సిన కార్యక్రమాలు. సత్కార్యాలను/సవ్యమైన పనులను చేపట్టకుండా వదిలేసే వ్యక్తులు తమస్సులో, గాడాంధకారమైన అజ్ఞానంలో ఉన్నట్లు లెక్క. అటువంటి పనులు చేపట్టడం కష్టతరమని ఎంచి చేపట్టకుండ ఉండేవారు రజస్సు ప్రభావంలో ఉంటారు ఫలితం గురించి ఆలోచించకుండ/ఆశించకుండ అటువంటి పనుల చేపట్టేవారు సాత్విక గుణ ప్రభావంతో ఉంటారు. అటువంటి వ్యక్తి నిజమైన సన్యాసి, వైరాగి, అసలైన సాధకుడు సిసలైన జ్ఞాని.

సరియైన కార్యాచరణకు అవసరమైనది సాధకుడు. సాధన, సాధించాల్సిన గమ్యము. ఇందులో ముఖ్యపాత్ర వహించేవి: కర్త, కర్మ, కర్మసాధనాలు. తమోగుణము, రజోగుణము, సాత్విక గుణ ప్రభావాలకు

లోనై ఉంటాయి. భిన్నత్వంలో ఏకత్వము. పైపైన కనబడే తేడాలను కాకుండ, వాటిలో నిగూఢంగ ఉన్న బ్రహ్మాన్ని చూడగలిగే వ్యక్తి సాత్వికుడై ఉంటాడు. విశ్వ శ్రేయస్సే తన కర్తవ్యమని భావిస్తాడు. ఫలితాన్ని ఆశించడు, ఆలోచించడు. పైన కనపడే తేడాలే సత్యమని నమ్మించేది రజోగుణము. ఫలితాన్ని గురించి ఆలోచించడమే కాకుండ తనకేమి జరుగుతుంది అదే భావనతో ఉండేవాడు రజోగుణ ప్రభావంలో ఉండేవ్యక్తి. పశువువలె ఏ ఆలోచనాలేకుండ కార్యరంగంలో దూకేవాడు తమోగుణ ప్రభావంలో ఉంటాడు.

భగవద్గీత కర్మలను అయిదు విధానాలుగ విభజిస్తుంది. అయిదు హేతువులు వాటిని ప్రేరేపిస్తాయి. అవి శరీరం ద్వారాగాని, ఆత్మ ద్వారా గాని, రకరకాల సాధనాల ద్వారాగాని, చలనశక్తి, జీవశక్తి ద్వారా గాని, మనకు తెలియని కారణం ద్వారా గాని కర్మాచరణ జరగవచ్చు. అన్ని సరియైన పాళ్ళలో అనుసంధానం కావాలి. అనుకూలించాలి.

ఇంకొక విధంగ కార్యాచరణ మూడు రకాలుగా విభజించవచ్చు; శారీరకము, పలుకు లేదా మాట, ఆలోచన ఇవన్నీ సాత్విక గుణసంపన్నమై ఉండాలి.

భగవద్గీత మెట్టవేదాంతం మీద ఆసక్తి కనపరచదు. సమాజం మీద, మనిషి మీద దాని ధ్యాస. అర్జునుడు, కృష్ణుడు ఇద్దరికి సమాజ శ్రేయస్సే ముఖ్యము. సమాజం కోసం యుద్ధం మాని అడవులకి వెళ్ళి సన్యాసిగా గడిపేందుకు అర్జునుడు సిద్ధం. రాజు/పరిపాలకులు లేకపోతే పరిపాలన చేసేదెవరు? అన్ని వర్ణాలు కలుషితమవుతాయి, స్త్రీ పురుషులు విచ్చలవిడిగ సంచరిస్తారు. తెలివిహీనులు, అధములు, దుర్మార్గులు పాలకులవుతారు. వర్ణం వగైరా గాలికి కొట్టుకొని పోతారు.

అర్జునుడు విచిత్రమైన (?) మనస్తత్వ విచారణ చేస్తున్నాడని కృష్ణుడు ఎత్తి చూపెడతాడు. ఏ సమాజాన్ని ఉద్ధరించాలనుకొంటున్నాడో ఆ సమాజపు కట్టుబాట్లని అతడు తిరస్కరిస్తున్నాడని, యోధుడిగ యుద్ధం చేయడమే అతడి కర్తవ్యమని విశదీకరిస్తాడు. సమాజంలో ఎవరిపని వారు చేయాలి. కృష్ణ పరమాత్మ కూడ తన విధులను తాను సక్రమంగ నిర్వహిస్తాడు. పరమాత్ముడు ఏ విధీ నిర్వహించకుండ ఉండిపోతే మనుషులు కూడ అదే విధంగా తమ కర్తవ్యపాలన చేయకుండ ఉండిపోతారు. సమాజం అస్తవ్యస్తమవుతుంది. దానికి భగవంతుడే కారణం అవుతాడు. ప్రపంచాన్ని సరియైన దిశగా నడిపేందుకు, ధర్మాన్ని నిలిపేందుకు భగవంతుడు రకరకాల అవతారాలను ఎత్తి శిక్షరక్షణ, దుష్టశిక్షణ చేయడం జరిగింది. దైవం మానవరూపంలో జీవించడం వలన మానవులు కాలాతీతమైన భగవత్ స్వరూపానికి దగ్గరవడం జరుగుతుంది. దానికోసం దేవుడు మూడు ప్రక్రియలు చేపడతాడు. అజ్ఞానాంధకారంలో కొట్టుకొని పోతున్న ప్రజలకు ఉపదేశాలివ్వడం, మానవరూపంలో ఉన్న తనను మోహింప చేయడం తద్వారా దైవానికి ప్రజలను సన్నిహితం చేయడం, చివరకు ప్రజలను అనుగ్రహించడం భగవంతుడికి ప్రపంచం పట్ల, ప్రజలపట్ల ఎంత అనురాగముందో తెలుపుతుంది భగవద్గీత.

భగవద్గీత (త్యాగం) 'యజ్ఞం' అనేమాటకు కొత్త అర్థాన్నిస్తుంది. అర్జునుడు తన స్వంత మనుషులనే / బంధువులనే చంపాల్సి వచ్చింది. కాని వీరుడిగ యుద్ధం చేయడం, వైరి వర్గం వారిని సంహరించడం అతడి కర్తవ్యం. ఆ పనిలో అతడికెటువంటి స్వార్థ చింతనలేదు కనుక దానివలన జరిగే మంచిగాని, హానిగాని అతడిని అంటవు.

అంతా భగవదేచ్ఛగ భావించి భగవంతుడి మీద వదిలేయాలి. పని చేయడం వరకే తనవిధి అని భావించడం కూడ 'యజ్ఞం' వంటిదే.

తమను తాము పూర్తిగ భగవంతునికి సమర్పించుకొనిన వారిని యోగులు అంటారు. తామే బ్రహ్మమని, బ్రహ్మమే తామని వారు పూర్తిగ దైవంలో లీనమై పోతారు. దానిని సమాధిస్థితి అంటారు.

ఇతరులు తమ తమ జ్ఞానసంపదను బట్టి తమను తాము కొందరు (తమ) సమర్పణమే భగవంతుడిగ భావిస్తారు. కొందరు ఇంద్రియ లోలత్వానికి లోను కాకూడదని ఇంద్రియాలను సమర్పిస్తారు. కొందరు ఆహారాన్ని సమర్పిస్తారు. కొందరు తమ యోగవిద్యని, కొందరు తమ పాండిత్యాన్ని సమర్పిస్తారు. ఈ త్యాగం మనసుని, అంతరాత్మని ప్రక్షాళనం చేస్తుంది. 'మీమాంస' లో చెప్పినట్లు అందులో భోగమేమీ లేదు. సవ్యమైన కార్యాచరణ మనిషిని ధ్యానం వైపు పురిగొల్పుతుంది. మనిషి ముఖ్యంగా నాలుగు సద్గుణాలు అలవరచుకోవాలి. నాలుగు పరిక్రమలు చేపట్టాలి. ద్వేషాన్ని తొలగించి ప్రేమను నింపుకోడం, కోరికలు లేకుండ ఉండడం, మౌనంగా కష్టాలను ఓర్చుకోడం, ధర్మానికి కట్టుబడి ఉండడం. దైవత్వమే అన్నింటికి మూలమనే సత్యాన్ని గ్రహించడం జరుగుతుంది. బౌద్ధం చెప్పే అష్టాంగ మార్గంలో మొదటి ఏడుసూత్రాలు సాధకుడు తనను తాను నైతికంగా తయారుచేసుకోడం గురించే చెప్తాయి. విముక్తికి మార్గం ఏర్పరచుకోడమే. మోక్ష సాధనలో ఉన్నవారు 'సంసారాని'కి 'నిర్వాణానికి తేడా లేదని, రెండూ ఒకటేనని తెలుసుకొంటారు.

**సంబంధ బాంధవ్యాలు - బాధ్యతలు**

మనకు ఇతరులతో ఉన్న సంబంధ బాంధవ్యాలు వారిపట్ల మన బాధ్యతలని నిర్దేశిస్తాయి. అవే మన స్థాయిని నిర్ణయిస్తాయి. ఇతరులు ఏమి చేస్తున్నారు అనేది ముఖ్యం కాదు, మనమేమి చేస్తున్నాము, మనము సహజంగా ప్రకృతి సిద్ధంగా ప్రవర్తిస్తున్నామా అనేది ఆలోచించాలి.

మనంతట మనము ఇతరులు బాధ కలిగిస్తున్నారు అనుకొంటే తప్ప మనలనేదీ బాధించదు. ఈ ఆలోచనా విధానమే మన కుటుంబసభ్యులతో, మన ఇరుగు పొరుగువారితో, సమాజంలోని ఇతర సభ్యులతో మన బాధ్యతలను నిర్ణయిస్తుంది.

దేవుడి పట్ల మన బాంధవ్యం పవిత్రంగా ఉండాలి. దైవం పట్ల సరియైన అవగాహన ఉండాలి. దైవత్వముందని అదే అన్నింటిని న్యాయంగా పరిపాలిస్తున్నదని నమ్మాలి. దైవం పట్ల విధేయత కలిగి దైవనిర్ణయానికి లోబడి ఉండాలి. దైవనిర్ణయాన్ని వివేచనతో అర్థం చేసుకోగలగాలి. అది చేస్తే దేవుడు అన్యాయం చేస్తున్నాడని; నిర్లక్ష్యం చేస్తున్నాడనే భావనరాదు. ఈ రకమైన ఆలోచనా ధోరణి అలవడాలంటే మన పరిధిలో లేని విషయాలను గురించి మనం పట్టించుకోకుండ మన పరిధిలో ఉన్న మంచి చెడులను గురించి మాత్రమే మనం ఆలోచించాలి.

మనిషి స్వతహాగా చెడునుండి, చెడు కారకాల నుండి దూరం ఉండే మనస్తత్వం కలిగి ఉంటాడు. అందరికి ఉపయుక్తమైన వాటిపట్ల ఆకర్షింపబడతాడు, వాటిని ప్రశంసిస్తాడు. హాని జరిగినప్పుడు, ఇది తన ఆనందం కోసమే జరిగిందని ఎప్పటికీ భావించడు. ఆ'హాని' నతడు ఆనంద దాయకమని భావించలేడు.

ఎక్కడ అభిలాష ఉంటుందో అక్కడ పవిత్రత ఉంటుంది. ఏది కోరాలో, ఎంత కోరాలో తెలిసిన వ్యక్తి పవిత్రతను గౌరవిస్తాడు. మనిషి చేయవలసిది ఏమిటంటే తన కష్టఫలితాన్ని సాంప్రదాయబద్ధంగా, పవిత్రంగ, మనస్ఫూర్తిగ దైవానికి అర్పించాలి. తన స్థాయికి మించిగాని, అజాగ్రత్తగా గాని నీచత్వంగా గాని, అల్పంగా గాని చేయరాదు. మనిషి తనకు తానే ఒక పద్ధతిని నిర్ణయించుకోవాలి. ఒంటరిగా ఉన్నప్పుడుగాని, నలుగురితో

కలసి ఉన్నప్పుడు గాని అదే పద్ధతిని పాటించాలి. మితంగా మాట్లాడాలి. అవసరమైనప్పుడు, అవసరమైనంత మేరకే మాట్లాడాలి. అతిగా గాని, అసందర్భంగా గాని నవ్వకూడదు. శపథం చేయడంగాని, ప్రతిజ్ఞ చేయడం గాని వీలయినంత వరకు చేయరాదు. మనం మంచివారితోనే సహవాసం చేయాలి. అపవిత్రుల సాంగత్యం మనలో చెడు కలగచేసే అవకాశముంది.

మనకవసరమైనంత మేరకే ఆహారపానీయాలను, దుస్తులు, వసతి ఏర్పాటు చేసుకొని, ఆడంబరాన్ని, సౌఖ్యాన్ని వదిలివేయాలి.

సాంప్రదాయబద్ధమైన లైంగిక సుఖాన్ని కోరుకోవాలి. ఎవరైనా వచ్చి ఫలానివారు మీగురించి చెడుగా మాట్లాడుతున్నారు అని చెప్తే వెంటనే దానికి ప్రతిస్పందించకుండ, 'ఆ వ్యక్తికి నా గురించి పూర్తిగ తెలియదు. తెలిసి ఉంటే నాలోని ఇతర అవలక్షణాలను గురించి కూడ మాట్లాడేవాడు' అనాలి.

సన్మానసభల జోలికి పోరాదు. ఒకవేళ వెళ్ళినా గాంభీర్యాన్ని పాటించాలి. ఎవరినీ నొప్పించకూడదు. ఉన్నత స్థాయిలో ఉన్న వ్యక్తిని కలవాలని వెళ్ళినప్పుడు ఆ వ్యక్తి ఇంట్లో ఉండకపోవచ్చు, తలుపు తీయకనేపోవచ్చు, మనలని ఖాతరు చేయకపోవచ్చు. తప్పని పరిస్థితులలో మనం వెళ్ళవలసి వస్తే పై నుదహరించినవి జరిగినా పట్టించుకోకూడదు. అనవసరంగా వచ్చామే అని భావించకూడదు. ఇటువంటి బాహ్యమైన విషయాలకు ప్రాముఖ్యతనిస్తే మన శీలం దెబ్బతింటుంది.

ఇతరుల సాంగత్యంలో ఉన్నపుడు ఎవరిగురించి వారు ఎక్కువగా మాట్లాడకూడదు. తమ గురించి మాట్లాడడం తమకు బాగానే ఉండినప్పటికీ వినేవారికి అంతగా నచ్చకపోవచ్చు. అతిగా నవ్వించకూడదు. ఇది ఒక్కొక్కసారి అనవసర ప్రసంగాలకి దారితీస్తుంది. తాముగాని, ఇతరులు

గాని అశ్లీల సంభాషణ చేయకుండ చూసుకోవాలి. వారు మనమాట వినకపోతే మౌనం ద్వారాగాని, ముఖ కవళికల ద్వారాగాని మన అసంతృప్తిని, అవ్యక్తపరచాలి.

ఏదైనా విషయం మనకు ఆనందం కలిగించినట్లయితే, దానిలో కొట్టుకొని పోకుండ మానుకోవాలి. కొంచెం వ్యవధి తీసుకొని ఆలోచించాలి. ఇప్పుడానందం కలుగుతున్నది, తరువాత చింతిస్తానేమో అని ఆలోచించాలి. ఈ ఆనందానికి దూరంగ ఉండినట్లు ఉండగలిగినట్లయితే నన్ను నేను ఏ విధంగ సంతోషపెట్టుకోగలను అని ప్రశ్నించుకోవాలి. ఆ ఆకర్షణ నుండి బయటపడే మార్గం ఆలోచించాలి. అటువంటి వ్యామోహం నుండి బయట పడగలిగితే తమను తాము అభినందించుకోవాలి.

ఏదైనా పని తప్పనిసరిగా చేయాల్సివస్తే దానిని బహిరంగంగానే చేయాలి. అది చేయరాని పని అయితే పూర్తిగ తప్పుకోవాలి. మంచిపని చేస్తున్నప్పుడు దాపరికమెందుకు? అనవసరంగ నిందించే వాళ్ళను చూసి ఎందుకు భయపడాలి?

మన పరిధికి మించి, మన శక్తి (తాహతు)కి మించి ఏదైనా పని ఒప్పుకొన్నామంటే మనం చేయగలిగిన దానిని నిర్లక్ష్యం చేసినట్టు లెక్క.

నడుస్తున్నప్పుడు, మేకుల్లాంటి వాటిమీద కాలు పెట్టకుండ కాలు బెణకకుండ జాగ్రత్తపడాలి. ప్రతిపనిని జాగరూకతతో చేయాలి.

మన పాదం కొలతల కనుగుణంగ మనం కాలిజోడును అమర్చు కొంటాం. మన శరీరం విషయంలో కూడ ఇదే ప్రమాణాన్ని ఆచరించాలి. దానికి మించి ప్రయాసపడితే మనం కొండకొన నుండి దొర్లినట్లే అవుతుంది. కాలిజోడు పరిమాణం సరిగ్గా లేకపోతే నడవడానికది అడ్డంకవుతుంది. అవసరానికి మించి ఏదీ చేయకూడదు.

ఎవరైనా మన గురించి చెడుగ మాట్లాడితే, చెడుగ ప్రవర్తిస్తే మనం అతడు దాన్ని తన బాధ్యతగ బావిస్తున్నాడని గుర్తుంచుకోవాలి. ఇతరులకు సవ్యంగా కనపడేది అతడికి సవ్యంగ కనపడకపోవచ్చు. అతడి అభిప్రాయం నిజంగ తప్పయినట్లయితే అతడు మోసగించబడ్డాడని అర్థం. ఒక నిజమైన సముచ్చయాన్ని ఒకవ్యక్తి తప్పనుకొంటే ఆ తప్పు ఆ సముచ్చయానిది కాదు, ఆవ్యక్తిదే ఆ విషయం మనకర్థమయితే మనమతడిని తప్పుపట్టలేము.

ప్రతి వస్తువుకీ రెండు పిడులుంటాయి, ఒకటి పట్టుకోడాని కనువైనది, రెండు అనువుకానిది. మన తమ్ముడో, హితుడో అన్యాయంగ ప్రవర్తిస్తే అనువుగాని పిడిని ఉపయోగించకూడదు. ఆ వ్యక్తి మన తమ్ముడని, స్నేహితుడని మనతో పాటే పుట్టి పెరిగాడని, గుర్తుంచుకొని అతడినే విధంగ మలుచుకోవాలో తెలుసుకోవాలి.

ఎవరైనా 'నేను నీకంటె ధనవంతుడిని, నీ కంటె నా వస్తువులు గొప్ప, నేను నీకంటె గొప్పవక్తని, కనుక నా ప్రసంగం నీ ప్రసంగం కంటె గొప్పది' అంటే అది పూర్తిగ తప్పు. అజ్ఞానుల ముందు మన పాండిత్య ప్రదర్శన చేయరాదు. గొఱ్ఱె కూడ తానెంత గడ్డి తిన్నదో గొఱ్ఱెలకాపరికి తెలుపదు. తాము తిన్న గడ్డి పరిమాణానికి సమంగా పాలను, ఊలుని ఇస్తుంది. మాటల కంటే చేతలే ముఖ్యం.

అజ్ఞాని తనకు జరిగేవన్నీ బయటి ప్రభావంతో జరుగుతున్నా యనుకొంటాడు. తత్వవేత్తకు అన్నింటికీ తానే కారకుడని తెలుసు. అతడు దేనికీ ఎవరినీ నిందించడు, దూషించడు, పొగడడు తన గురించి కూడా ఏమీ పలకడు. ఏదైన అడ్డంకి వస్తే తననే తప్పు పడ్తాడు. పొగిడే వ్యక్తులను నిరోధిస్తాడు. తనలో ప్రకృతి విరుద్ధమైన విషయాలేవైనా ఉంటే వాటిని తొలగించుకొనే ప్రయత్నం చేస్తాడు. అన్ని విషయాలలో మితమైన ధోరణిని

ప్రదర్శిస్తాడు. తననెవరైన తెలివితక్కువవాడని, అజ్ఞాని అని భావించినా అతడు లెక్కచేయదు. తనని తానే శత్రువుగా పరిగణిస్తాడు.

తన జీవన విధానానికొరకు ఏవైనా సూత్రాలను, నియమాలను ఏర్పరుచుకొంటే వాటిని తప్పనిసరిగ ఆచరిస్తాడు. పాటించ లేకపోతే తనను తాను అపవిత్రుడిగ భావిస్తాడు. నియమాలని అతిక్రమించడు. ఎప్పటి కప్పుడు తనను తాను మెరుగుపరుచుకొనే ప్రయత్నంలో ఉంటాడు. నైతిక తత్వవిచారం ప్రకారం మొదటి సూత్రం అసత్యం పలక్కుండ ఉండడం, రెండవది తార్కికంగ రుజువు చెయ్యడం (ప్రదర్శించడం) మూడవది మొదటి రెండింటికీ ధృవపరిచేది, విశదపరిచేది. మూడవది రెండవదాని మూలంగ, రెండవది మొదటిదాని మూలంగ అవసరం. అన్నింటికంటె ముఖ్యమైనది మొదటిది. కాని మనం మూడవదానికోసం తాపత్రయపడతాము. ఆ కారణంగా మనం మొదటిదానిని పూర్తిగ విస్మరిస్తాము. అనృతం పలుకుతాము. అసత్యం పలకరాదని మరచిపోతాము.

**కోరికలు – ఉద్రేకాలు**

కోరికలలో కొన్ని సహజమైనవి, కొన్ని అనవసరమైనవి. సహజమైన కోరికలలో కొన్ని ఆనందదాయకం, కొన్ని శరీరానికి విశ్రాంతి దాయకం, కొన్ని జీవితానికి అత్యవసరమైనవి. ఈ విషయాలపై సరియైన అవగాహన ఉన్నట్లయితే మనం మన శరీరానికి, ఆత్మకి చికాకులనుండి స్వేచ్ఛ కలిగించే పనులు మాత్రమే చేపడతాము. అదే జీవిత ధ్యేయము. ఆ లక్ష్యం కోసమే మనము బాధని, భయాన్ని దూరంగా ఉంచే ప్రయత్నం చేస్తాము.

బాధ లేనప్పుడు మనకు సంతోషం కావాలి అనే భావనరాదు. బాధల్లో ఉన్నప్పుడే బాధలు పోవాలని, ఆనందం కావాలి అనిపిస్తుంది. అందుకనే ప్రశాంతమైన జీవనానికి సంతోషము ముఖద్వారము వంటిది. అదే మంచికి

ముందడుగు. మనం మరల మరల దాని దగ్గరకు వెళ్తాము. ఎందుకంటే ఆ ఆనందమే మంచి అంతటికి కొలమాన మవుతుంది. ఆనంద మున్నంతకాలము శరీరంలో గాని, మనసులోగాని బాధనేది ఉండదు.

ఆనందాన్ని 'మంచి'తో ముడిపెట్టినప్పటికి మనం అన్ని ఆనందాలనీ కోరుకోము. ఫలానావాటి వల్ల మనకు ఆనందం కలిగేమాట నిజ మైనప్పటికీ, దానివల్ల కలిగే అసౌకర్యాలే ఎక్కువయినప్పుడు వాటి జోలికేపోము. కొన్నిసార్లు సంతోషం కంటె బాధనే కోరుకోవడం జరుగుతుంది. ఎందుకంటే సుదీర్ఘమైన బాధ తరువాత పొందే ఆనందం ఎంతో గొప్పగ ఉంటుంది. ఆ విధంగ చూసే సంతోషంతో పాటు బాధకూడ అవసరమే అనిపిస్తుంది. సంతోషం, బాధ వాటి వాటి అనుకూల, అనను కూల స్థితిగతులను బట్టి మనకేది కావాలో మనం నిర్ణయించుకోగలం. మంచి అనుకొన్నది చెడుగాను, చెడు అనుకొన్నది మంచిగాను పరిగణించవచ్చు.

సుఖము (సంతోషము) దానంతటదే చెడ్డదికాదు. దానిని పొందే మార్గమ సరియైనది కాకపోతే, అనర్ధాలతో కూడుకొన్నదయితే అది వద్దనిపిస్తుంది. మనం అన్నిటిని అన్నివేళలా ఆనందించలేము. మనకున్నవి కొన్నే అయినట్లయితే ఆ కొన్నింటినే ఆనందిస్తాము. సహజమైన సంతోషాలు సుసాధ్యమని, అసహజమైనవి కష్టసాధ్యమని అర్థం చేసుకొంటాము. విందు భోజనం కంటే సాధారణమైన భోజనమే ఎంతో రుచికరమనిపిస్తుంది బాగా ఆకలిగొన్నప్పుడు.

సామాన్యమైన జీవనమే మనకు ఆరోగ్యాన్నిస్తుంది. అటువంటి జీవనవిధానం మనకు ఎంతకావాలో, ఏమి కావాలో నేర్పిస్తుంది. అది అలవాటయిన తరువాత భోగాలనుభవించే అవకాశం కలిగినా వాటిపై మనసు లాగదు. ఆ భోగాలిచ్చే సంపద మీద ఆసక్తి కలుగదు.

కొన్ని కోరికలు నెరవేరకపోతే తీవ్రమైన బాధ కలుగుతుంది. మరికొన్ని కోరికలు తీరకపోయినా బాధేమీ కలుగదు. వాటిగురించి మనం పట్టించు కోనవసరం లేదు. అవి తీరే సాధనాలు లభించకపోతే వాటిని మనం మరచిపోతాము.

జీవిత పరిమితులు తెలుసుకొన్న వ్యక్తి, బాధానివారణ తెలుసుకొన్న వ్యక్తి, పోటీతత్వం తెలుసుకొన్న వ్యక్తి వాటిజోలికి పోకుండ సాధారణ జీవితాన్ని కోరుకొంటాడు.

ఆనందమయి జీవితము అంటే విశృంఖలత్వానికి అలవాటుపడి, ఇంద్రియలోలత్వానికి దాసోహమనే జీవితం కాదు. ఇటు శారీరకంగా, మానసికంగా బాధనుండి ముక్తి పొంది స్వేచ్ఛ అనుభవించే జీవితము అని అర్థము. మనము ఏ ఆనందాలను ఎన్నుకుంటున్నాము, వాటి అర్థమేమిటి, వంటి కుదురైన ఆలోచనలతో తీసుకొన్న నిర్ణయాలు ఆహ్లాదకర జీవితాన్నిస్తాయి.

మనుషులలో రెండు రకాల కదలికలుంటాయి. ఒకటి జీవితానికి అవసరమైనవి, అప్రయత్నపూర్వకాలు. రెండు ఇచ్ఛాపూరకమైనవి, ప్రయత్నపూరకాలు. గుండె కొట్టుకోవడం, ఊపిరి పీల్చుకోడం, మల విసర్జన చేయడం వంటివి జీవితావశ్యకాలు. మాట్లాడడం, అటూ ఇటూ తిరగడం మెదడు ఆదేశానుసారం జరిగే కదలికలు. ఎటువైపు నడవాలి, ఎందుకు, ఎలాగ వంటి ఆలోచనలు వీటికి ముందుగా వచ్చే ఆలోచనలు. ఆ విధంగ ఊహ అనేది మనలో జీవిస్తుంది. ఊహకనుగుణంగ మనలోని శక్తిని వినియోగించడం జరుగుతుంది. ప్రయత్నపూర్వకంగ జరిగే ఈ కదలికలు కోరికలు కావచ్చు, కోరికలనుండి దూరంగ జరిగే ప్రయత్నాలు కావచ్చు. మనకు లేని దానికోసం అర్రులు చాచడం కోరిక, ఉన్న దాని మీద అయిష్టం ఏర్పడి దూరం చేసుకొంటే దాన్ని 'ద్వేషం' అంటాము.

కొన్ని ఇష్టాయిష్టాలు పుట్టుకతో వస్తాయి. ఉదాహరణకు తిండిపోతు తనం. కొన్ని ఇష్టాయిష్టాలు అనుభవంతో ఏర్పడతాయి. బాధ కలిగించిన వాటిమీద అయిష్టం ఏర్పడుతుంది. తెలియని వాటికి దూరంగ ఉండడం కూడ సహజం. కొన్ని విషయాలపట్ల ఇష్టంగాని, అయిష్టంగాని ఉండదు. వాటిపట్ల ఒకరకమైన ధిక్కారముంటుంది. వాటిపట్ల ఉదాసీనత, ఇతర విషయాలపై ఆసక్తి వాటినుండి దూరముంచుతుంది.

మనిషి శరీరం నిత్యం మార్పు చెందుతూ ఉంటుంది. ఎల్లప్పుడూ కొన్ని (అవే) విషయాలు, ఒకటే విధంగ, ఒకే రకమైన ఇష్టంగాని అయిష్టంగాని కలగచేస్తాయని చెప్పలేము. అందరి ఇష్టాయిష్టాలు ఒకే రకంగా ఉంటాయని  చెప్పలేము. మనిషి తనకిష్టమైన విషయాలని మంచివని, ఇష్టంలేని వాటినన్నిటిని చెడ్డవని చెప్తుంటాడు. ఈ 'మంచి', 'చెడు' అనే వర్ణనలు ఆ వ్యక్తి అభిరుచిని బట్టి ఉంటుంది. అంతేకాని ఆయా వస్తువులను బట్టి ఉండదు.

బాహ్యమైన వస్తువులు మనకంటికి కనపడే తీరు, వాటిరంగు, వెలుతురును బట్టి, శబ్దాలు చెవులకు వినబడే పద్ధతిలోను, వాసన ముక్కుపుటాలకు సోకే తీరునుబట్టి ఉంటుంది. అవి మెదడుకు చేరి, మెదడు వాటికి ప్రతిస్పందించి, బాహ్య అంగాలకు కదలికలను ఇస్తుంది. ఈ కదలికలు ఇష్టాయిష్టాలను తెలియజేస్తాయి. మనసుకు ఆనందంగాని అగమ్యంగాని కలగజేస్తాయి.

ఇంద్రియాల ద్వారా కలిగే ఆనందాలు కొన్ని: చూపు, వినికిడి, వాసన, రుచి, స్పర్శద్వారా కలిగేవి. కొన్ని కొన్ని పనులు, కార్యక్రమాలు ఫలితంగా లభించేవి. ఇవి ప్రమోదము కలిగిస్తాయి. మరికొన్ని ఖేదమ కలిగిస్తాయి.

ఈ రకరకాల పేర్లు: హేలలు, కోరికలు, బాధలు, నొప్పులు ఆయా సందర్భాలలో వాడకం జరుగుతుంటుంది. మనుషులకున్న అభిప్రాయాలని బట్టి; వారు ఆశించే ఫలితాన్ని బట్టి, ఆయా వస్తువులని బట్టి, సామూహిక ఫలితాన్ని బట్టి వర్ణన మారుతూ ఉంటుంది.

చెడు అలవాట్లు మనిషిలో చెడు ప్రవర్తనకి దారితీస్తాయి. అవి దైవాన్ని ధిక్కరించడమే కాకుండ, మనిషికి హాని కలిగిస్తాయి. తనను తాను విస్మరించుకోడం వలన జరుగుతుంది.

మనలని మనం తెలుసుకోకపోవడం ఎందుకు జరుగుతుందంటే నిజాన్ని భరించడం కష్టం. మన గురించి మనం ఏవో రంగుల చిత్రం గీసుకొని, ఊహాలోకంలో ఉండడానికి ఇష్టపడతాము. కాని మన గురించి మనం తెలుసుకోవాలంటే, భయపడతాము. ఈ అజ్ఞానం ఇటు భౌతిక జీవితనానికి అటు అతీతమైన జీవితానికి రెండింటికి హానికరం. మనిషిలో ఉంచాల్సిన నమ్రత, వినయము శూన్యమవుతాయి. తన గురించి తనకు తెలియని వ్యక్తి భగవంతుని ఉనికిని తెలుసుకోడం కష్టమవుతుంది.

భయము, ఆందోళన, చికాకు మనిషి వ్యక్తిత్వంలోని ముఖ్యభాగాలు. భయాన్ని మన స్వీయ ప్రయత్నాల ద్వారా పోగొట్టుకోవడం కష్టం. మన వ్యక్తిగతం కంటె ముఖ్యమైనవి గొప్పవి ఐన విషయాలపై కేంద్రీకరించడం ద్వారా మన అహంకారాన్ని పోగొట్టుకోవచ్చు. దైవప్రేమలో నిమగ్నమైతే భయాలు పోగొట్టుకొనే అవకాశముంది. మనం ఏదైనా మంచి లక్ష్యం కొరకు పనిచేసేటట్లయితే మన భయాలు కొంతవరకు తగ్గుతాయి. అన్నింటికంటె ఉత్తమమైన దైవకార్యంలో నిమగ్నమైతే భయాలు పూర్తిగ పారిపోతాయి. దైవప్రేమ గాఢంగ ఉన్నప్పుడు భయాలకు తావుండదు. 'నేను శూన్యము దైవమే సర్వస్వము' అనుకొన్నప్పుడే దైవప్రేమ కలుగుతుంది.

**ప్రయోజనాలు – సాధనాలు**

ఫలితం బాగుంటే చాలు ఏ మార్గం అనుసరిస్తే నేమి అనేది చాలా పాత నానుడి. ఫలితాలే ముఖ్యం అనేది కూడా అటువంటిదే. ఫలితాన్ని బట్టే సాధనాలుంటాయి అంటుందీ వాదం. ఫలానా మార్గమనుసరిస్తేనే ఆ ప్రయోజనం సాధించడానికి వీలవుతుంది. ఆ మార్గమనుసరిస్తే కలిగే ఇతర ఫలితా(లు)ల గురించి పెద్దగ పట్టించుకోనవసరంలేదు అనేది ఒక వాదన. ఆ ఇతర ఫలితాలు వాటంతటవే మాసిపోతాయి అనేది ఇంకొక వాదన. ఇతర ఫలితాలు ఎంత హానికరమైనా వాటి గురించి ఆలోచించకుండ మనకు కావలసిన, దక్కిన ఫలితమే ప్రధానము అనేది వీరి వాదన. ప్రయోజనాలని మాత్రమే దృష్టిలో పెట్టుకొని సాధనాలకంత ప్రాధాన్యమివ్వక పోవడమనే ఈ వాదన సరియైనది కాదు. అదొక వితండవాదం.

'ఫలితాలు', కారణాలు – వీటిల్లో ఫలితాలే కారణాలు, కారణాలే ఫలితాలు అని ఇప్పుడందరు ఎరిగిన సత్యం. ఏదీ అంతిమం కాదు. ప్రయోజనమే ముఖ్యము సాధనాలు కాదు అనే వాదం ఐహికమైనది. ఒక ప్రయోజనాన్నాశించి దానికోసం మనం తయారుచేసే, వాడే ప్రతి పరిస్థితి/ నియమం కూడ ఒక ప్రయోజనమే, ఒక కోరికే. మనం అంతిమ ఫలితం అనుకొనేది కూడ ఒక సాధనే ఇంకొక ఫలితానికది దారి తీస్తుంది. ఇంతకుముందు సాధించిన ఫలితానికది అనుబంధమే. ఆ ఫలితం ఈ ఉ నికికి సంబంధించినదే కాబట్టి అది ఒక అడ్డంకిగానూ పరిణమించొచ్చు, ఇంకొక ప్రయోజనానికి సాధనమూ కావచ్చు. కొన్ని వస్తువు(లు)లే మనం సాధించదలుచుకొన్న ఫలితాలు అనే విషయాన్ని విస్మరిద్దాం కాసేపు. అప్పుడు మనకు కావలసిన ఫలితాలేవో మనం నిర్ణయించుకోవచ్చు. ఐహికంగ ఒక సంఘటనకి ఇతర సంఘటనలకి ఉన్న పరస్పరమైన సంబంధాన్ని బట్టి మన కోరికలని; లక్ష్యాలని ఏర్పరుచుకోవచ్చు.

లక్ష్యాలు, మార్గాలు అనే పదాలకు జన బాహుళ్యంలో కొన్ని సాధారణ మైన, సర్వసామాన్యమైన అర్థాలు వాడుకలో ఉన్నాయి. అన్ని విషయాలలో ఉన్నట్లే వీటికి కూడ ఈ వాడుక అర్థలున్నాయి. కోరికలు, లక్ష్యాలు ఒక పరిస్థితి నుండి ఇంకొక పరిస్థితికి దారితీస్తాయి. అవి గట్టిపడతాయి. జన బాహుళ్యంలో వాడుకలో ఉన్న ఈ ఆలోచనలు/భావాలు కొన్ని సందర్భాలలో నిర్ణయాత్మకమైన మేధో పరికరాలుగ వాడడం జరుగుతుంది. కొన్ని సంఘటనల విషయంలో కొన్ని అంశాలలో వాటినే ఆయా సంఘటనల/ అంశాలను పరీక్షించే యంత్రాలుగా/పనిముట్లుగా వాడడం; ఫలితాలని బేరీజు వేసే సాధకాలుగ వాడడం కద్దు. ఇది క్రమేణా జరిగి ఆయా లక్ష్యాలకు వాటిని కొలమానాలుగ, నిబంధనలుగ పరిగణించడం జరుగుతుంది. వాటికి కొంత విలువను ఆపాదించడం జరుగుతంది. వాటినే లక్ష్యాలుగ కూడ గ్రహించడం జరుగుతుంది. ఏ పరిస్థితులలో కోరికలు/లక్ష్యాలు ఏర్పడుతాయో, కాబోయే పరిణామాలనే విధంగా లక్ష్యాలుగా చూప బడుతాయో అనే విషయపరిజ్ఞానానికి దారితీస్తుంది. ఈ పరిస్థితులు కొరతకి, అవసరానికి, సంఘర్షణకి సంబంధించినవి. ఇంకొక స్థితి–మనిషికి చుట్టూ ఉన్న వాతావరణానికి మధ్యన జరిగే ఘర్షణ వలన ఉత్పన్నమయ్యేది. ఇంకొక కోరిక ఉత్పన్నమయ్యే అవకాశం లేదు. అనిర్దిష్టమైన లక్ష్యాలనుండి ఒక నిర్దిష్టమైన లక్ష్యాన్నేర్పరుచుకోడం సాధ్యం కాదు. ఒక ప్రయోజనాన్ని ఆశించి మనసులో ఉన్న ఉద్దేశాలను లక్ష్యంగా మార్చుకోడం అప్పటి యదార్థమైన స్థితిగతులను బట్టి ఉంటుంది. ఉదాహరణకి ఒకానొక రోగికి వైద్యం చేస్తున్న వైద్యుడు తాను ఏఏ విధమైన చికిత్సలు చేయాలో ముందుగా నిర్ణయించుకోవాలి. అతడి అంతిమ లక్ష్యం రోగికి పూర్తిగా ఆరోగ్యాన్ని సమకూర్చడమే అతడు రోగనిర్ధారణ చేసి రోగి చికిత్సా విధానాన్ని నిర్ణయించుకోవడం జరుగుతుంది. తను చేయబోయే చికిత్సయొక్క విలువను ఉజ్జాయింపు వేస్తాడు. రోగి సంపూర్ణ ఆరోగ్యమే పరమావధిగా

పనిచేయడం అతడికి తెలియకపోవచ్చు. రోగికున్న జబ్బును బట్టి అతడికి ఎటువంటి చికిత్సనందివ్వాలో, ఆ చికిత్స అతని జబ్బు ఏ విధంగా నయం చేస్తుందో అతడికి తెలుసు. రోగి ఆరోగ్యం పొందడమే అతడి అంతిమ లక్ష్యం దానికోసం రకరకాల పరీక్షలు చేయడం జరుగుతుంది. ఆ పరీక్షలు చేయడమే అతడి లక్ష్యం కాదు.

అంతిమలక్ష్యం మంచిదా కాదా అనే విషయం దాని ఉపయోగాన్ని బట్టి ఉంటుంది. అంతిమ లక్ష్యాలు సరియైనవా కాదా వాటి వాటి అవసరాన్ని బట్టి ఉంటుంది.

ఆత్మలో మమేకమై జీవనాన్ని సాగించాలంటే దాన్ని సాధించే మార్గం కూడ స్వచ్ఛమైనదై ఉండాలి. లక్ష్యాలకు మార్గాలకు మధ్య తేడాలేదు. భగవంతుడు మన మెన్నుకొనే మార్గాలపై మనకు అధికారమిచ్చాడు కాని ఫలితాల మీద ఇవ్వలేదు. లక్ష్యాలు మంచివైనపుడు వాటిని సాధించేమార్గాలు కూడా తప్పనిసరిగా మంచివే అయి ఉండాలి. లక్ష్యం ఎంత మంచిదైనా దానినేదో ఒక విధంగా సాధించాలనుకోవడం తప్పు. లక్ష్యం సాధించడమే కాదు, దానిని సాధించే మార్గం కూడ మంచిది కావాలి.

**కారణము (తర్కము) – మనస్సాక్షి**

తత్త్వము రెండు రకాలు. ఒకటి శోధన, రెండవది వ్యావహారికము. నీతి వ్యావహారికానికి సంబంధించినది. అది మన భావోద్వేగాల మీద మనం చేపట్టే పనులమీద ప్రభావం చూపుతుంది. మనుషులు సాధారణంగ తమ కర్తవ్యం/విధులను బట్టి పనిచేయడం చూస్తాము. కొన్ని పనులను తప్పనిసరి అని భావించి కొన్ని పనులను చేపట్టడం, కొన్ని పనులు అన్యాయమని భావించి కొన్ని పనులను చేపట్టక పోవడం జరుగుతుంది. కొందరు నైతిక తత్త్వవేత్తల అభిప్రాయమేమంటే నీతి మన వ్యవహారశైలిమీద

ప్రభావం కలిగి ఉంటుంది కనుక దానికి కారణం/హేతువు వుండదు. నీతి సూత్రాలు మనలని ఏవైనా పనులను చేయడానికి ప్రోత్సాహకరంగానైనా ఉంటాయి, లేదా నివారించనైనా నివారిస్తాయి. నీతి సూత్రాలకి, హేతువాదానికి పొంతనే ఉండదు. హేతువాదన మన రాగద్వేషాల మీద ఎటువంటి ప్రభావము చూపదు కనుక నీతిసూత్రాలు హేతువాదన నుండి ఉద్భవించాయి అనలేము.

హేతువు సత్యాసత్యాలను రుజువు చేస్తుంది. యదార్థమైన ఆలోచనలకి, ఋజువర్తనానికి, సత్యమైన ఉనికితో అనుసంధానమై ఉన్నది. 'సత్యము' దానికి భిన్నముగా ఉన్నది 'అసత్యము'. ఈ అనుకూల, అననుకూల ధోరణికి లోనుకాని విషయం హేతువాదానికి సంబంధం లేనిది.

మన ఉద్రేకాలకి, మన చేష్టలకి, మన సంకల్పాలకి ఈ హేతువుతో సంబంధంలేదు. అవి స్వతంత్ర ప్రతిపత్తి కలిగి ఉన్న విషయాలు. నీతి సూత్రాలకి కారకాలంటూ ఏవీ ఉండవు. అవి హేతువు నుండి ఉద్భవించవు. హేతువుకి మనస్సాక్షికి ఎటువంటి సంబంధమూ లేదు. శాస్త్రము, హేతువాదము ఆలోచనలకి, వాటి పరస్పర బాంధవ్యానికి సంబంధించినవి. ఆ సంబంధాలు/అనుబంధాలు భిన్నమైన ప్రకృతి కలిగి ఉంటే వాటిని కారకాల ద్వారా కనుక్కోలేము. హేతువు మన ప్రవర్తన మీద రెండు విధాలుగ ప్రభావం కలిగి ఉంటుంది. ఒక విధానం: ఈ వస్తువు లేదా ఫలానా వస్తువు దీనికి సంబంధించినది అని చెప్పి ఉద్రేకాన్ని రేకెత్తించడము, ఇంకొక విధానము: కారణాలకి ఫలితాలకి మధ్యనున్న సంబంధాలను వివరించి ఉద్రేకాన్ని కలిగించడము, మన చేష్టలకి సంబంధించిన నిర్ణయాలివే. ఈ నిర్ణయాలు తప్పుకూడ కావచ్చు. అవి హేతువాదనకి నిలవకపోవచ్చు.

మంచికి చెడుకి మధ్యనున్న తేడా హేతువు వల్ల కలిగినది కాదు. ఆ తేడా మన చేతలమీద ప్రభావం చూపుతుంది. కాని దానికి కారణాలు

హేతువు ఒకటే కాజాలదు. హేతువు, నిర్ణయం ఒక ఉద్రేకాన్ని కలిగించ వచ్చు. అటువంటి నిర్ణయం సత్యమైనా, అసత్యమైనా అది మంచి అనిగాని చెడు అనిగాని చెప్పలేము. ఒక నిర్ణయం ఇతర నిర్ణయాలకి దారి తీయొచ్చు. అటువంటప్పుడు ఆ చేతలకి కారణభూతాలైన వాటిమీద నీతిముద్ర పడే అవకాశం ఉండదు. అందుచేత నీతికి, హేతువుకి సంబంధంలేదు. నీతికి హేతువు కారకం కాదు. మంచి చెడు అనేవాటికి ఆ హేతువుకి సంబంధం లేదు. ప్రతిచేష్టలో కొన్ని ఉద్రేకాలు, కొన్ని సంకల్పాలు, కొన్ని భావనలు, కొన్ని ఉద్దేశాలు ఇమిడి ఉంటాయి. అందులో యధార్థము/వాస్తవము/ నిక్కము అంటూ ఏమీ ఉండదు. ఆ విషయం మీద దృష్టిపెట్టి చూస్తే అందులోని చెడు మనకు గోచరం కాకపోవచ్చు. మనం చేతలు/ఫలితాల మీద దృష్టిపెడితే మనలో ఆ చేతల మీద ఒక విధమైన అసమ్మతి పుట్టొచ్చు. కాని ఇది మన భావనలకి సంబంధించింది కాని హేతువుకి సంబంధించింది కాదు. ఆ భావన మనలో ఉంటుంది కాని ఆ విషయంలో గాని వస్తువులో గాని ఉండదు.

ఏదైనా ఒక చేష్టని మనం చెడుగా భావించడం జరిగితే ఆ చేష్టపట్ల మనలో, మన ప్రవృత్తిరీత్యా, మనలో దానిపట్ల వ్యతిరేకత ఉందని అర్థం. మంచి చెడుల శబ్దాలతో, రంగులతో, వేడి, చల్లదనాలతో పోల్చవచ్చు. కాని ఆయా గుణగణాలు మంచి చెడులలో లేవు. కాని మన గ్రహణశక్తిలో ఉంటాయి. అన్నింటికంటె మన బాధలు, మన ఆనందాలే మనకు ముఖ్యమనిపిస్తాయి. ఈ భావనలు మంచికి దగ్గరగా ఉండి, చెడుకి దూరంగ ఉన్నట్లయితే అవి మన ప్రవర్తనని శీలాన్ని క్రమబద్ధం చేయగలుగుతాయి. మంచి చెడులను హేతువు ద్వారా కాకుండ, పోలిక ద్వారా కాకుండ, మన భావనల ద్వారా, అవి మన మనసులో వేసే ముద్రల ద్వారా గుర్తించవచ్చు. నీతికి సంబంధించిన మన నిర్ణయాలు చాలా మట్టుకు మన మనసులో ఉన్న

ముద్రలని బట్టి/గుర్తులని బట్టి ఉంటాయి. కనుక నీతి అనేదాన్ని మనం మనసులో అనుభవించవచ్చు కాని ఇదీ అని గట్టిగ నిర్ణయించలేము.

అనుభవం అనుక్షణం మన మనసులో గుర్తులు/ముద్రలు వేస్తుంటుంది. మన మనసులో ఉన్న ఈ ముద్రలు మనలో ఆనందాన్ని, దుఃఖాన్ని కలుగచేస్తుంటాయి. కొన్ని చేతలు, కొన్ని ప్రక్రియలు మనకు మంచిగాను లేదా చెడుగాను తలపిస్తాయి. మనకు ఆనందం కలగచేసే వాటిని మంచివని, బాధని కలిగించేవి చెడువని అనిపిస్తాయి. వాటిని తలుచుకోగానే తృప్తిని కాని అసంతృప్తిని గాని కలిగిస్తాయి. తృప్తిని కలిచించే వాటిని మెచ్చుకోడము, అసంతృప్తిని కలిగించే వాటిని తెగడడము జరుగుతుంది. కాని ఆ తృప్తిగాని అసంతృప్తిగాని ఎందుకు కలుగుతుందో పరిశీలించము. సౌందర్య పిపాస లేదా సౌందర్యాన్వేషణలోగాని, అనుభూతుల విషయంలోగాని, అభిరుచుల విషయంలో గాని ఇటువంటి నిర్ణయాలే తీసుకొంటుంటాము. మనకు హాయిని కలిగించే వాటిమీద మంచి అనేముద్ర వేస్తాము. ఆ విధంగా చూస్తే మంచి, చెడు అనే వాటిని మనం మన అనుభూతుల దృష్ట్యా నిర్ణయిస్తున్నాము అంతేగాని హేతువు వల్లకాదు. ఆయా వస్తువుల/ విషయాల గురించి తలుచుకోగానే కలిగే ఆనందమయ అనుభూతులను బట్టి ఉంటుంది. అనుభూతులకు, ఆనందాలకు అనుసంధానమై ఉంటాయి. మన నీతికి సంబంధించిన మన నిర్ణయాలు మన పనులెటువైపు మొగ్గుచూపుతున్నాయో అనేదాని మీద మనం చేసే పునరాలోచనలు మన విధి+కర్తవ్యపు అంచులను నిర్ణయిస్తాయి. కొన్ని విషయాలలో అనుభూతులు మనలో అంగీకారాన్ని కలుగచేస్తాయి. కొందరి తెలివితేటలు, చమత్కారం, కులాసాగా ఉండే ప్రవర్తన ఇతరులలో వారిపై సానుభూతిని, సద్భావనని కలుగచేస్తాయి. ఇతరుల ప్రేమను, గౌరవాన్ని పొందే లాగుచేస్తాయి. ఇటువంటి కొన్ని

గుణాలు కొన్నిప్రత్యేక సూత్రాలవల్ల మనిషికి సహజంగ నచ్చుతాయి. వాటికి ఫలానా అని ప్రత్యేకమైన వివరణ ఇవ్వజాలము. కొన్ని సర్వ సాధారణమైన సూత్రాలకు సంబంధించి ఉంటాయి.

ఈ విధంగ కాకుండ, మనస్సాక్షి అనేది మనిషి ఆలోచనలను, పదాలను, చేష్టలను నిర్ణయిస్తుంది. మన ఆలోచనలు, చేష్టలు, భాష మంచివైనట్లయితే మనకు ఆనందాన్ని, మంచివి కానట్లయితే బాధను కలిగిస్తాయి. మన అంతరాత్మ ప్రభోదంతో ఏదిమంచి, ఏదిచెడు అనేది మనకు తెలుస్తుంది. మన అంతరాత్మ ప్రభోదాలే మనకు శాసనాలుగ పరిణమిస్తాయి. మనం తీసుకొనే నిర్ణయాలను శాసిస్తాయి. ఆ విధంగ మనిషికున్న హేతువాదశక్తి; మనస్సాక్షి మనలను నైతికంగ నడిపే మార్గదర్శ కాలవుతాయి. మంచి చెడులను నిర్ణయిస్తాయి. అన్ని సాంఘికమైన, మతపరమైన సంప్రదాయాలు నైతిక సూత్రాలకి, నైతిక నిర్ణయాలకి విలువనిస్తాయి. అన్ని సంప్రదాయాలు మనిషిని పునఃపరిశీలనకు ప్రోత్సహిస్తాయి. మనలని గురించి మనం లోతుగ పరిశీలించుకొనేందుకు అవసరమైన సాధనాలనందిస్తాయి. మనలని నైతికతకు బద్ధం చేస్తాయి. నైతికత శక్తిని తెలియచేస్తాయి.

మన మనస్సాక్షి శక్తివంతంగ ఉన్నట్లయితే మన చేతలని ఇతరులతో మన సంబంధ బాంధవ్యాలని అది పరిశీలించి దానిని బేరీజు వేస్తుంది. ఆరోగ్యవంతమైన మనస్సాక్షి వర్తమానంలో నివసిస్తుంది. అది గతాన్ని అనుసంధానం చేసుకొంటూ ముందుకు సాగుతుంది. అది తన సహజ స్వభావం చేత ఇతరుల ముందు చాలా తేజోవంతంగ ఉంటుంది. మనసులో ఒక ఉద్దేశాన్ని, కలిగించి ఉత్తేజితమై ఇతరులకొక ప్రతిపాదన చేస్తుంది. ఆరోగ్యవంతమైన అంతరాత్మ నూతన భావాలను గ్రహించేందుకు సిద్ధంగ ఉంటుంది. తన అనుభవాలను, అనుభూతులను ఇతరులతో పంచుకొని, కొత్త ప్రతిపాదనలకు, చేతలకు దారితీసే విధంగ పనిచేస్తుంది.

## సుగుణము

సుగుణము చాలా ఉత్కృష్టమైనది. ఇతర గుణాలతో పోల్చబడేది. అందరిలో అన్ని గుణాలు సమానంగ ఉండే మాటయితే ఎవరినీ, దేనికీ పొగిడే అవసరంగాని, అవకాశంకాని ఉండదు. అన్ని సుగుణాలకి మూలం వివేకం. వివేకవంతంగా, న్యాయవంతంగా, మర్యాదపూర్వకంగా జీవించాలంటే జీవితం ఆహ్లాదభరితంగా ఉండాలి. ఆహ్లాదము పరస్పరం ఆధార భూతాలు. ఆహ్లాద భరితంగ ఉంటేనే వివేకవంతంగ ఉండగలం. వివేకవంతుడు ఎల్లప్పుడు ఆనందంగా ఉంటాడు. తాను బాధపడడు ఇతరులకు బాధ కలిగించడు. అతడిలో కోపావేశాలుగాని, రాగద్వేషాలుకాని ఉండవు. అతడెంతో శక్తిశాలిగ ఉంటాడు. కోపతాపాలు వంటివి బలహీనులలో ఉంటాయిగాని వివేకవంతులలో ఉండవు.

సుగుణానికి, నైతికతకి తేడా ఉంది. రెండూ మంచితనానికి నిర్వచనాలే. అయితే కొంత వ్యత్యాసముంది. నైతికత కర్తవ్యపాలనలో ఒక ముఖ్యభాగం. సుగుణము కూడ కర్తవ్యపాలనలో ఒక భాగమైనప్పటికీ అదే ప్రధానమైనది కాదు. మనం కొందరి వ్యక్తులను చూసి ఎంతో గౌరవిస్తాము. వారి గొప్పతనం వారి సుగుణాలలో ఉంది. వారి నైతికతకి మూలం వారి సౌజన్యం కానవసరంలేదు.

ప్రశంసార్హమైన గుణాలు సుగుణాలు. వాటిని మేదోపరమైనవని; నైతిక పరమైనవని; నైతికపరమైనవని విభజించడం జరిగింది. తత్వ విచారానికి సంబంధించిన వివేచన; ఎదుటి వ్యక్తులను అర్థం చేసుకొనే శక్తి; ఆచరణ యోగ్యమైన తెలివితేటల ఇత్యాది మేధస్సుకు సంబంధించిన సుగుణాలు. ఔదార్యం, సంయమనం, దాతృత్వం వంటివి నైతిక సుగుణాలు. మేధోపరమైన సుగుణాలు అభ్యాసం మీద; అనుభవం మీద ఆధారపడి ఉంటాయి. నైతిక సుగుణాలు 'అలవాటు' మీద ఆధారపడి ఉంటాయి.

సుగుణాలనేవి ఆచరణ ద్వారా లభ్యమవుతాయి. న్యాయవంతమైన పనుల ద్వారా న్యాయ ప్రవర్తన; ధైర్యవంతమైన పనుల ద్వారా ధైర్యము, ఓర్మి వహించడం ద్వారా సంయమనము అలవడుతాయి. సుఖలాల సత్వానికి దూరంగ ఉండడం వలన సంయమనం కలుగుతుంది. సంయమనం పాటించడం వలన సుఖలాలసత్వానికి దూరంగ ఉండ గలుగుతాము. ధైర్యము కూడా అంతే. తగని లేదా భయంకరమైన విషయాలపై సహజంగానే విముఖత్వం కలిగి ఉండడము; అటువంటివి నిరోధించేందుకు తగినశక్తి కలిగి ఉండడం ధైర్యవంతుల లక్షణం. ఇటువంటి సుగుణాలను బాల్యంనుండి, యౌవ్వనం నుండి అలవరచుకోవటం అవసరము.

మనం చేపట్టే పనులు/ ప్రక్రియలు మనకు ఆనందం కలిగిస్తాయా, బాధ కలిగిస్తాయా అనేదాన్ని బట్టి మన ప్రవృత్తి ఏమిటో తెలుస్తుంది. శారీరక సుఖాలకు దూరంగ ఉండి, అందులో ఆనందం పొందే వ్యక్తి సంయమనం కలవాడు; శారీరక సుఖాలకు లొంగేవాడు సంయమనం లేనివాడు. భయంకరమైన వాటికి ఎదురొడ్డి నిలిచి అందులో ఆనందం పొందేవాడు ధైర్యవంతుడు; భయపడి, బాధపడేవాడు పిరికివాడు.

నైతికత మన సుఖాలతో; దుఃఖాలతో ముడిపడి ఉంటుంది. కొన్ని చెడు-అలవాట్లు వలన మనకు ఆనందం/సుఖం కలగడం; కొన్ని మంచి పనుల వలన బాధ కలగడం జరుగుతుంది. అంచేత మనం కొన్ని మంచి పనులకు దూరంగ ఉంటాము. అంచేత చిన్నప్పటి నుండే మనం చేయ కూడని పనులకు మనపిల్లలను దూరంగా ఉంచడము, చేయవలసిన పనులు బాధ కలిగించినా సరే చేసేవిధంగ పెంచాల్సిన అవసరం ఉంది. ఇదే సరైన చదువు. ఆ విధంగ చూస్తే మన సుగుణాలు సుఖదుఃఖాలతో కలిసివుంటాయి. సరియైన విధానంలో ఈ సుగుణాలను ఉపయోగించు

కోగలిగితే ఆ వ్యక్తి మంచిగాను, అస్తవ్యస్తంగా వాడుకొనేవాడు చెడుగాను పరిణమిస్తాడు.

పనులను న్యాయవంతంగ చేసేవాడు న్యాయ పక్షపాతిగాను, ఓర్మితో చేసేవాడు సంయమనవంతుడుగాను తయారవుతాడు. అంటే ఏమిటి? మనం చేపట్టే ప్రక్రియలు లేదా చేతలు వాటంతటవే స్వభావసిద్ధంగా సుగుణ వంతమైతే ఆ పనులు న్యాయవంతంగా, సంయమనంతో చేసినట్లు లెక్కకాదు. ఆ ప్రక్రియలు చేపట్టే వ్యక్తికూడ కొన్ని స్థితిగతులకు లోబడి ఉండాలి. ఒకటి అతడికి సరియైన అవగాహన ఉండాలి. ఆ ప్రక్రియలను అతడు మనస్పూర్వకంగ, వాటికోసమే వాటి నెన్నుకోవాలి. గట్టి నమ్మకంతో, చిత్త చాంచల్యం లేకుండా పనులు చేపట్టాలి. చివరి రెండు అంశాలు చాలా ముఖ్యమైనవి.

న్యాయవంతమైన వ్యక్తి, సంయమనం కలిగిన వ్యక్తి, న్యాయవంతమైన, సంయమనవంతమైన పనులు చేపట్టాలి. ఆ పరిస్థితులలో ఉన్న ఏ న్యాయ వంతుడైనా, ఓర్మి కలవాడైనా ఆ ప్రక్రియలనే చేపట్టాలి. అప్పుడే ఆ వ్యక్తులు సుగుణవంతులవుతారు.

సుగుణమంటే ఏమిటి? మనలో మూడురకాల విషయాలున్నాయి. రాగద్వేషాలు; సామర్థ్యాలు, ప్రవృత్తులు. ఆకలి, కోపము, భయము, విశ్వాసము, ద్వేషము, సంతోషము, జాలి వంటివి రాగద్వేషాలు. పై అనుభూతులను కలగచేసేవి సామర్థ్యాలు. ఈ అనుభూతులతో మనకున్న అనుబంధం మన ప్రవృత్తి ఉదాహరణకి మనకు విపరీతమైన కోపం కలుగుతుందనుకోండి. అది మంచిదికాదు. అదే మితంగా కలిగితే మంచిది.

సుగుణాలు కాని, దుర్గుణాలు కాని ఉద్రేకాలుకావు. మనలో ఉన్న సుగుణాలని బట్టిగాని, దుర్గుణాలను బట్టిగాని ప్రజలు మనలని గౌరవించడం

గానీ అదే విధంగ తెగడడం గాని జరుగుతుంది. మన అనుభూతులను బట్టికాదు. మనకు కోపంగాని, భయం కాని మన ప్రమేయం లేకుండానే కలుగుతాయి. సుగుణాలుకాని దుర్గుణాలుకాని ఎంపిక ద్వారా కలుగుతాయి. ఉద్రేకాలకి, ఆవేశకావేశాలకి మనం స్పందిస్తాము. సుగుణాలకి, దుర్గుణాలకి స్పందించము. అవి సామర్థ్యాలు కూడ కావు. సామర్థ్యం సహజసిద్ధమైనది. మనం స్వతహాగ మంచివాళ్ళము, చెడ్డవాళ్ళము కాము. కనుక సుగుణాలు ఉద్రేకాలూ కావు, సామర్థ్యాలు కావు. ప్రతీ సుగుణం అత్యున్నత స్థితిలో ఉండడం; అత్యున్నత స్థాయిలో పనిచేయడం. ఉదాహరణకి మన కన్ను మంచి స్థితిలో ఉండి, దానిపని అది అత్యున్నతస్థాయిలో చేసినట్లయితే మనం చక్కగా చూడగలుగుతాము. అదే విధంగ సుగుణవంతుడైన వ్యక్తి అత్యుత్తముడుగా పనిచేయగలుగుతాడు.

ప్రతి సుగుణం యొక్క ప్రత్యేకమైన గుణగణాన్ని తీసుకొన్నట్లయితే, ఇది ఇంకా బాగా రుజువౌవుతుంది. అవిచ్ఛిన్నము, భాగించదగినదేదైనా తీసుకొని దానిని ఎక్కువ పాళ్ళలోగాని, తక్కువ పాళ్ళలో గాని సమాన పాళ్ళలోగాని తీసుకోడానికి వీలుంది. సమానమైనదంటే ఎక్కువకు, తక్కువకు మధ్యస్థంగా ఉండేది. రెండు విపరీతాలకు నడుమనుండేది.

ఈ సూత్రాన్ననుసరించి ఉద్రేకాలకి, చేతలకి సంబంధించిన నైతిక సుగుణం రెండింటికి నడుమ నుండే మధ్యస్థ స్థాయికి గురిపెడ్తుంది. ఉదాహరణకి, భయము, ఆకలివంటివి విపరీతంగా గాని, అతి తక్కువగా గాని అనుభూతి చెందవచ్చు. ఇది రెండూ అంగీకరించతగినవి కావు. ఎక్కువ, తక్కువలకు మధ్యస్తంగ వింతగ అనుభూతి చెందినచో అది అంగీకార యోగ్యమవుతుంది. మెచ్చుదగినదౌతుంది. ఇదే సుగుణం యొక్క స్వభావము. అదొక రకమైన ప్రమాణము. జయం సంపాదించడానికొకటే మార్గము. అపజయం కలగడానికి అనేక విధానాలున్నాయి. అతి అనేది

దుర్గుణం యొక్క స్వభావం, మితం సుగుణం యొక్క స్వభావం. అరిస్టాటిల్ సుగుణాన్ని ఈ విధంగ నిర్వచించాడు, "సుగుణం ఎంపికతో కూడుకొన్నది, మితమైనది. అది హేతువాద సూత్రంతో కూడుకొన్నది. ఆచరణాత్మకమైన వివేకమున్న వ్యక్తి దానిని ఆ సూత్ర ప్రకారం నిర్ణయిస్తాడు.

ప్రతీ చేష్ట; ప్రతి అనుభూతి/ఉద్రేకము మధ్యస్థంగ ఉండదు. కాని స్వాభావికంగ చెడ్డవి: ఉదా:–ఈర్ష్య, టెంపరితనం వంటివి, దొంగతనం, హత్య వంటివి చెడుచేతలు. వీటిలో మంచి అనేది మచ్చుకు కూడ కానరావు. ఇటువంటి వాటిలో వింతయుగాని, మధ్యస్థంగాని, అతిగాని ఏవీ ఉండవు. ఏ విధంగా చూసినా అవి పూర్తిగ దుష్టమైనవే.

ప్రవర్తనకి సంబంధించిన ఈ ప్రకటనలు సర్వ సాధారణమైనవి. అందరికీ వర్తిస్తాయి. వ్యక్తులకు సంబంధించిన ప్రకటనలు వాస్తవానికి ఇంకా దగ్గరగ ఉంటాయి. వ్యక్తుల విషయంలో ధైర్యము భయానికి, నమ్మకానికి మధ్యస్థంగ ఉంటుంది. అతి ధైర్యం ప్రదర్శించే వ్యక్తి అహంకారి, అతి భయాన్ని వ్యక్తం చేసే వ్యక్తి పిరికివాడు. అదే విధంగ సుఖాలను అనుభవించే విషయంలో సంయమనం మధ్యస్తంగ ఉంటుంది. బాధ విషయంలో అది వర్తించదు. భోగలాలసత అతికి నిదర్శనము. అది పూర్తిగ లోపించినవాడు ఉద్వేగ రహితుడు. ధనం/డబ్బు ఇచ్చి పుచ్చుకోడంలో ఔదార్యం మధ్యస్థం. అతి దాతృత్వం, విచ్చలవిడితనం, దాతృత్వమసలు లేకపోవడం పిసినారితనం. తగినంత మోతాదులో ఆత్మాభిమానం ఉండడం వేరు. అది ఎక్కువైతే పొగరుమోతుతనం; అసలు లేకపోవడం న్యూనతా భావం. మోతాదు మించని ఆవేశం, రుజువర్తనం, ఆమోదయోగం. ఇతరులకు వినోదమివ్వడంలో మోతాదు మించక పోవడం ఆహ్లాదకరం, మోతాదుమించితే అది వెకిలితనం. స్నేహతత్వంలో మోతాదు మించకుండ మధ్యస్థంగ ఉంటే అది సంతోషదాయకం, మోతాదు మించితే అది

అనుచితమైన ప్రశంస అవుతుంది. అసలే మాత్రము స్నేహభావం ప్రదర్శించక పోవడం అహంకారమవుతుంది.

ఉద్రేకాలకి, అనుభూతులకి సంబంధించి ఇదే సూత్రం వర్తిస్తుంది. మర్యాదపూర్వకమైన సిగ్గును, వినయాన్ని ప్రకటించడం మోతాదు. అతి వినయాన్ని, సిగ్గును ప్రదర్శించడం ధూర్తలక్షణం. అసలు సిగ్గే లేకపోవడం సిగ్గులేనితనం. అన్యాయం అధర్మం పట్ల కలిగే కోపం మోతాదులో మధ్యస్థంగా ఉంటుంది. ఈర్ష్యాపరుడు ఇతరుల బాగును చూసి ఏడుస్తాడు. దుర్మార్గుడు ఇతరులకు జరిగిన అన్యాయాన్ని చూసి ఆనందిస్తాడు.

ఉద్రేక స్వభావం కలవాడు, కోపిష్టి దేనినీ ఓర్చుకోలేడు. అటువంటి ఉద్రేకము లేకుండడం మంచి గుణమైతే, విపరీతమైన ఉద్రేకముండడం మంచిదికాదు.

ఆ విధంగా సుగుణం రెండు విపరీతాల మధ్యస్తంగ ఉంటుంది. అతి ఎక్కువకు అతి తక్కువకి మధ్యలో ఉంటుంది. ఉద్రేకాలలో అనుభూతులలో మధ్యస్తంగ ఉండడం ఆరోగ్యదాయకం. సద్గుణాలను కలిగి ఉండడం చాలా కష్టం. మధ్యే మార్గాన్ని కనుగొనడం ఇంకా కష్టం. కోపం ఎవరికైనా కలగవచ్చు. డబ్బు ఎవరికైనా ఖర్చుపెట్టవచ్చు. కాకపోతే ఆ ధనాన్ని సరియైన వ్యక్తికి, సరియైన సమయంలో, సరియైన మోతాదులో, సరియైన ఉద్దేశంతో, సరియైన రీతిలో ఇవ్వడం మంచిది. కాని ఇది అందరికీ సాధ్యం కాదు. అంతటి పరిపక్వత, మంచితనం, ఉదాత్తత చాలా దుర్లభం. కొన్నిసార్లు మోతాదు మించడం; కొన్నిసార్లు లేమిని ప్రదర్శించడం జరిగి మధ్యేమార్గం ప్రకటితమౌతుంది.

సుగుణం ఉద్రేకాలతో, వాటి ప్రక్రియలతో సంబంధించినది కనుక, బుద్ధి పూర్వకమైన ఉద్రేకాలు, ప్రక్రియలపై ప్రశంసగాని, నిందగాని వేయడం

జరుగుతుంది. అప్రయత్నం కలిగే ఉద్రేకాలపై, చేసేపనులపై జాలి చూపాల్సి ఉంది. అజ్ఞానం వల్ల, బాహ్యమైన ఒత్తళ్ళ వల్ల కలిగే ఈ ఉద్రేకాల వల్ల చేపట్టే పనుల విషయంలో ఆ వ్యక్తికి సంబంధముండదు.

విశిష్ట లక్షణాలు మధ్యనున్న వ్యత్యాసాలను తెలుసుకొనేందుకు, వ్యక్తుల పనులకంటే వారు ఎంపికచేసే సుగుణాలేముఖ్యము. ఎంపిక ఉద్దేశ పూర్వకమే కాని పూర్తిగ అదే కాదు. వాటిమధ్య తేడా తెలుసుకోవచ్చు. పసిపిల్లలు, జంతువులు స్వచ్ఛందంగ ఉండటం చూస్తాము. కాని ఎంపికలో కాదు. (అప్రయత్నంగ) క్షణికంగ తీసుకొనేనిర్ణయం ఎంపిక కాజాలదు. ప్రయత్నపూర్వకంగా, తనకున్న విభిన్నమార్గాలలో ఒకానొక మార్గాన్ని, దాని విలువలు తెలుసుకొని ఎంపిక చేయడం వేరు. క్లుప్తంగా చెప్పాలంటే సుగుణాలను మనం ఎన్నుకొంటాము ప్రయత్నపూర్వకంగా, బుద్ధి పూర్వకంగా ఎంపిక చేస్తాము. అవే మనలని శాసించే శాసనాలు.

మనచేతలు, ప్రవృత్తులు ఒకేరకమైనవి కావు. మనకువిషయాలు బాగా తెలిసినట్లయితే మన చేతలు మొదటినుండి చివరి వరకు మన అధీనంలో ఉంటాయి. ప్రవృత్తులు మొదట్లో మన అధీనంలో ఉండినప్పటికి చివరికి ఏ విధంగ తయారవుతాయో చెప్పలేము. మనమే విధంగా పనిచేయాలో నిర్ణయం తీసుకొనే విషయంగా చూస్తే మన ప్రవృత్తులు మనం కోరుకొన్నట్లే ఉంటాయి. ఆత్మకు సంబంధించిన సుగుణాలు రెండురకాలు. శీలానికి సంబంధించినవి, మేధస్సుకు సంబంధించినవి. ఆత్మకు రెండు భాగాలున్నాయి. ఒకటి తర్కసహితము రెండు తర్కరహితము. అందులో మొదటి భాగంలో రెండు పార్శ్వాలున్నాయి అందులో ఒకటి స్థిరమైన, మార్పులేని వాటిమీద దృష్టిపెడితే రెండవది మారుతూ ఉండే చంచలమైన వాటి మీద దృష్టిపెడుతుంది.

వస్తువులు వేరువేరు తత్వాలు కలిగి ఉంటాయి. ఆ వేరు వేరు తత్వాలున్న (వాటిని) విషయాలను ఆత్మలో వేరువేరు భాగాలు బాధ్యత వహిస్తాయి. ఆ విధంగ ఆత్మలోని ఆ భాగానికి ఆ విషయానికి అవినాభావ సంబంధమేర్పడుతుంది. ఈ రెండు భాగాలను శాస్త్రీయమనీ, గణనాత్మక మనీ అంటారు. మార్పులేని అంశాల గురించి ఎవరూ గుణించరు. గణనాత్మకమైన భాగం తర్కం వైపు మొగ్గు చూపుతుంది.

ఒక విషయం ఎంత బాగా పనిచేస్తుంది అనేది దానిలోని ముఖ్యాంశం. ఆత్మలో మూడు భాగాలున్నాయి. అవి చేతలని, సత్యాన్ని, భావోద్రేకాన్ని, తర్కాన్ని, కోరికను అజమాయిషీ చేస్తుంటాయి.

ఇందులో భావోద్రేకం చేతలకి దారితీయదు. జంతువులకి భావోద్రేకముంటుంది. కాని అది చేతలకి దారితీయవు ఒక ఆలోచన కలిగినప్పుడు దానికి వత్తాసు పలకడమో, లేదా దానిని వ్యతిరేకించడమో జరుగుతుంది. అదే విధంగ ఒక కోరిక కలిగినపుడు దానిని తీర్చుకోవడమో లేదా దానికి పూర్తిగా దూరంగ ఉండడమో జరుగుతుంది. నైతిక సుగుణం ఎంపికతో కూడుకొన్నది. ఎంపిక అనగానే ఉద్దేశపూర్వకము. దాని ఆలోచన, ఆ కోరిక రెండూ సరియైనవిగా ఉండాలి. ఎంపిక సరైనది కావాలి. అది కోరికను ధృవపరిచేదిగ ఉండాలి.

ఈ విధమైన మేధ ఆచరణాత్మకము. ఆలోచనాత్మకమైన మేధస్సు ఆచరణాత్మకము కాదు. మంచి, చెడు అనే అంశాలు ఇందులో భాగాలే. ధ్యానించడం వరకే దీని పరిమితి. సరియైన కోరిక కోరడం మంచితనం. అది ఆచరణాత్మకమైన ఆలోచనతో ముడిపడి ఉంటుంది.

ఒక ఫలితాన్నో, ప్రయోజనాన్నో ఆశించి ఒక ఎంపిక చేస్తాము. ఆ ఎంపిక చేయడానికి తర్కము, ఆలోచన అవసరము. మంచి ఎంపిక

చేయడానికి గాని, చెడు ఎంపిక చేయడానికి గాని మేధస్సుతో పాటు శీలము కూడ ముఖ్యము. ఒక ఫలితాన్ని ఆశించి చేసే ఆలోచన మాత్రమే ఉత్పాదకమైనది. మంచి కోరిక సత్ఫలితాన్ని ఆశిస్తుంది. కావాలని ఇచ్ఛాపూర్వకంగ ఒక కోరిక, తార్కికంగ చర్చించి కోరేది మరొక రకం కోరిక. అటువంటి కోరిక ఫలితమే మానవుడు.

గతంలో జరిగినదానిని ఎంపిక చేయడం సాధ్యం కాదు. గతాన్నెవరూ చర్చించరు. ఒకసారి జరిగిన సంగతులను తిరగతోడడం కాని, వాటిని జరగకుండ చేయడం గాని దేవుని వల్ల కూడ కాదు.

ఈ రెండు రకాల మేధస్సు భాగాలూ చేసేది సత్యాన్వేషణే. ఆత్మ సత్యాన్ని సాధించేందుకు కావలసిన స్థితిగతులు ఐదు. అవి కళ, శాస్త్రీయ విజ్ఞానము, ఆచరణయోగ్యమైన తెలివితేటలు (జ్ఞానము), తత్వవిచారాత్మక తెలివి, అంతర్దృష్టితో కూడిన తెలివితేటలు. అభిప్రాయము, నిర్ణయము ఇందులో భాగాలు కావు.

కళ కల్పనకి సంబంధించినది. ఒక వస్తువు/ఒక కళారూపం ఏ విధంగా ఉనికిలోకి వస్తుందో అన్న దానికి సంబంధించినది. దాని సృష్టి కళాకారుడిలో ఉంటుంది కాని ఆ కళారూపంలో ఉండదు. కళ ఉనికిలో ఉన్న వస్తువుల గురించికాని, కళారూపంలో బయటకొచ్చే వస్తువుల గురించి గాని, అది ప్రకృతిసిద్ధంగా ఉన్నాయా లేదా అనే విషయం గురించి గాని పట్టించుకోదు. కళారూపానికి కావలసిన సామగ్రి అందులోనే ఉంటుంది. తయారు చేయడం వేరు, నటించడం వేరు. కళ తయారు చేయడానికి మాత్రమే సంబంధించినది. శాస్త్రీయవిజ్ఞానం ఒక అవసరం నుండి పుట్టుకొస్తుంది. మనమంతా మనకు తెలిసినదాన్ని ఇంకొక రకంగ ఉండే అవకాశముంటుందన్న ఆలోచన కూడ లేకుండా ఉంటాము. అది మన

పరిశీలన పరిధికి కాకుండ బయట జరిగినప్పుడు అవి ఉన్నట్లు కూడ మనకు తెలియదు. మనకు దానితో అవసరం పడితేనే దాన్ని గురించి తెలుసుకొంటాము. ఇది అంతులేకుండ కొనసాగుతూ ఉంటుంది. మన అవసరాలు నిత్యసత్యాలు. వాటికి నాశనం లేదు.

శాస్త్రీయ విజ్ఞానం యొక్క మూలసూత్రం తార్కికాధారం లేని విషయాల గురించిన భయంనుండి పుట్టుకొస్తుంది. ఒక వివేకవంతుడు తనకేది అవసరమో, ఏది ఉపయోగకరమో తెలుసుకోగలిగిన ఆచరణాత్మకమైన తెలివితేటలు కలిగి ఉంటాడు. అది కళ కిందకాని, శాస్త్రీయ విజ్ఞానం కింద కాని లెక్కకు రాదు. మనిషికి ఏది మంచిదో, ఏది మంచిది కాదో తెలుసుకొనే శక్తి ఉన్నవారిని ఆచరణాత్మకమైన తెలివితేటలు కలవారిగ పరిగణిస్తాము. వారు కేవలం తమకు మాత్రమే కాకుండ మానవాళికంతటికి ఏది మంచి, ఏది చెడు అనే ఇంగిత జ్ఞానం కలిగి ఉంటారు.

ఆచరణాత్మకమైన వివేకమొక సుగుణం; అది కళకాదు. ఆత్మ రెండు రకాల ఆలోచనాశక్తి గల భాగాలు కలిగి ఉంది. ఏ భాగంలోని ఆలోచనాశక్తి 'అభిప్రాయాలను' ఏర్పరచుకోగలదో దానికి సంబంధించినది. ఆచరణాత్మక మైన వివేచన నిత్యసత్యాల గురించి మాత్రమే కాకుండ వివరాల గురించి కూడ తెలుసుకొంటుంది. అది ఆచరణాత్మకం కనుక వివరాల గురించి తెలుసుకొంటుంది. పెద్దగ విజ్ఞానం లేకపోయినా అనుభవం ఉన్నవారు జ్ఞానవంతులకంటే మిన్నగా ఉంటారు. ఆచరణ అంటేనే క్రియ; పనులుచేయడం. కనుక వీరికి ఆచరణలో పెట్టగలిగిన ఆలోచన/ఆపనులు చేయగలిగిన శక్తి రెండూ ఉండడం చూస్తాము. తత్వవిచారానికి సంబంధించిన వివేచన సరియైన/న్యాయమైన నియమం ప్రకారం నడుచు కోవడమే కాదు; ఆ న్యాయవంతమైన నియమం యొక్క ఉనికిని తెలియ చేస్తుంది. వైజ్ఞానిక ఫలితాలువైజ్ఞానిక పరిశోధన నుండి కాక అంతా

మొట్టమొదట అంతర్దృష్టి వలన కలుగుతాయి. ఈ విధంగా జరిగే అవకాశముంది. మనసుకు తట్టడం అనే సూత్రం నుండి మొదలవుతుంది. పరిశీలన/పరిశోధన వివేకం విజ్ఞానం ఫలితాలన్నిటికన్న ఉత్కృష్టమైనది. వివేకవంతుడు మొట్టమొదట మనసుకు తట్టే సూత్రం నుండి చివరి ఫలితం వరకు తెలిసికొని ఉంటాడు. అంతర్దృష్టితో పాటు వైజ్ఞానిక జ్ఞానం కలిగి ఉండడమే వివేకము.

దిగువస్థాయిలోని జీవితం, ఇతర సుగుణాలతో కూడుకొని ఉన్న జీవితం (సంతోషంగా)ఆనందమయంగా ఉంటుంది. మనం ఒకరిపట్ల ఒకరు న్యాయవంతంగానే ఉంటాము. శీలానికి సంబంధించిన సుగుణాలు మన భావోద్రేకాలు/అనుభూతులతో ముడిపడి ఉంటాయి. ఆచరణాత్మక వివేచనకు సంబంధించిన సూత్రాలు నైతిక సూత్రాలతోను, నైతికతలోని న్యాయం ఔచిత్యం ఆచరణాత్మకమైన వివేచనతోను సంబంధం కలిగి ఉంటుంది.

నైతిక సుగుణాలు ఉద్రేకాలతో, అనుభూతులతో అనుసంధానం కలిగి ఉంటాయి. అవి మన సంకీర్ణ మనస్తత్వానికి సంబంధించి ఉంటాయి. సంతోషం వగైరా వీటికి సంబంధించినవే. అత్యున్నతమైన స్థాయికి చెందిన మేధస్సుకు వీటికి సంబంధం లేదు.

సుగుణానికి సంకల్పం ముఖ్యమా, ఆచరణ/ నడవడి ముఖ్యమా అనే వాదనొకటి ఉంది. అది రెండూ ముఖ్యమే. కాకపోతే సుగుణాన్ని ఆచరణలో పెట్టేందుకు ఇంకా ఎన్నో అంశాలు కావాలి. మనం ఆచరణలో పెట్టే సుగుణం ఎంత గొప్పదైతే అంత ఎక్కువ అంశాలు కావలసి వస్తాయి. తత్వవిచారంలో మునిగి ఉండే ఆలోచనా పరుడికి ఆచరణతో పనిలేదు. నిజానికది అతడి ఆలోచనకి అడ్డంకులవుతాయి. కాకపోతే అతడూ

సమాజంలో నలుగురితోపాటు జీవించాల్సిన అవసరముంది కనుక అతను కూడ మంచిపనులు చేయవలసి ఉంది.

మనిషికిమంచితనమే కాకుండ అతడు జీవించడానికి అవసరమైన ధనం కూడ కావాలి. శరీరం ఆరోగ్యంగ ఉండేందుకు ఆహారంతో పాటు ఇతరత్ర హంగులు కూడ కొన్ని కావాలి. దీనర్థం మనిషి ఆనందంగ జీవించడానికి ఈ హంగులు అన్నీ తప్పనిసరి అని కాదు కేవలం కొన్ని నిత్యావసరాలు తీరడానికి కావలసిన వసతులు. కొన్ని సద్గుణాలతో మనిషి ఆనందంగ జీవించవచ్చు.

మంచి, చెడు సహజమైన గుణాలా కాదా అనే ప్రశ్న కూడ ఉంది. 'సహజమ'నే దానికి మనమిచ్చే అర్థాన్ని బట్టి ఉంటుంది దీనికి సమాధానం. 'సహజమ'నేది అద్భుతానికి వ్యతిరేకమైనట్లయితే మంచి, చెడులు సహజమైన గుణాలే. సహజమనేది అసాధారణానికి వ్యతిరేకమైనట్లయితే; ఉదాహరణకి, వీరోచితమైన (ధైర్యం) సుగుణంగాని, పశుప్రాయమైన క్రూరత్వంగాని అసాధారణాలు; మంచిచెడులు సహజమైనవే, సహజమంటే కృత్రిమానికి వ్యతిరేకమైనట్లయితే మంచి చెడులు సహజమైనవే. మనకిగాని, ఇతరులకి గాని ఆనందం కలిగించే గుణాలు మనలో ప్రేమని, గర్వాన్ని కలిగిస్తాయి. మనకు చికాకు కలిగించే గుణాలు ద్వేషాన్ని, న్యూనతని కలగచేస్తాయి. గర్వాన్ని, ఆనందాన్ని కలిగించే సద్గుణము, ద్వేషాన్ని కలిగించే చెడు, రెండూ సమానంగానే పరిగణిస్తారు. కనుక వీటిని ఒకదానితో మరొకదానిని పోల్చి నిర్ణయించాలి. ఒక చేష్టగాని ఒక క్రియగాని మంచి అనిగాని, చెడు అనిగాని వర్ణించామంటే దానర్థం అవి ఆయా గుణగణాల చిహ్నాలని అర్థం. ఆ గుణగణాలు కలకాలం నిలిచి ఉండేవై ఉండాలి. వాటి తాలూకు సూత్రాలు ఆ వ్యక్తి పూర్తి ప్రవర్తనలో విస్తరించి ఉండాలి. చేతలు/క్రియలు ఏవో కొన్ని సూత్రాలనుండి పుట్టుకొని రావు. కనుక అవి ప్రేమానురాగాలు, ద్వేషము

వంటి వాటిమీద ప్రభావము కలిగి ఉండవు కనుక, అవి నైతికత కింద పరిగణింపబడవు.

మనం చేపట్టే ఏదైనా ఒక పనిగాని, కొన్ని పనులుగాని నైతికతలో జన్మించినట్లు అనుకోము. ఆ వ్యక్తి యొక్క శీలము, దానికంటె ప్రధానము. వ్యక్తి మాటలు కంటె, పలుకుల కంటే అతడి పనులే ప్రధానమైనవనడం సబబే. అవి ప్రేమనుగాని, వైషమ్యాన్నిగాని కలిగిస్తే అవి ఆ వ్యక్తిత్వాన్ని ప్రతిఫలించినట్లు లెక్క.

ఆ విధంగా ఆనందాన్ని కలిగించేవి సద్గుణాలని, బాధని కలిగించే దుర్గుణాలని అంటారు.

అహింస అనే గుణము అనేక ఇతర అనైతిక విషయాలకి దారి తీస్తుంది. అనృతం పలకడం ఇతరులను నొప్పించడం కింద లెక్కకొస్తుంది. దొంగతనం కూడ ఇతరులను బాధించడమే. మన అవసరాలకు కావలసిన ధనం కంటె ఎక్కువ ధనాన్ని పొంది ఉండడం కూడ, ఇతరులను బాధించినట్లు లెక్క. ఇతరులను బీదవారిని చేసి వారిని వారి అవసరాలనుల తీర్చుకోనీయకుండా చేస్తున్నట్లు లెక్క. ఇది కూడ అహింసలో నుండి పుట్టిన గుణమే. బుద్ధుడు ప్రతిపాదించిన 'కరుణ' అనే గుణము, అందరి మనుషులను జతపరిచి, విశ్వ సోదరత్వాన్ని, భ్రాతృత్వాన్ని పెంపొందించేది. అది 'సన్యసించుట' అనే దానికి విరుద్ధము. మానవ జీవిత లక్ష్యము 'నిర్వాణ'ము, అంటే బాధనుండి, దుఃఖము నుండి విముక్తి. దీనికి హద్దులు లేవు.

బుద్ధుడు ప్రతిపాదించిన 'మధ్యమార్గము', సంపూర్ణమైన స్వార్థానికి, సంపూర్ణమైన సన్యాసి జీవితానికి (అన్నింటినీ త్యజించడానికి) మధ్యలో ఉండేది. ఇది ఈ రెండు విపరీతాలనుండి ప్రయోజనాలు పొందే విధంగ

ఉంటుంది. అందరినీ ప్రేమించి, అందరి యెడల కరుణను చూపించగల వ్యక్తిలో స్వార్థపరమైన కోరికలు వాటంతటవే మాయమై, త్యాగధనుడైన సన్యాసి పొందే ఆనందాన్ని పొందగలుగుతాడు; ప్రశాంతత, తృప్తి కలుగుతాయి. స్వార్థపరంగా కోరికలను తీర్చుకొంటే కలిగే ఆనందం కంటె ఎక్కువ ఆనందం ఈ మధ్యేమార్గంలో లభిస్తుంది. ధ్యానం వలన వ్యక్తికి బాధనుండి, దుఃఖం నుండి విముక్తి కలుగుతుంది. బుద్ధుడు చెప్పే నిర్వాణమంటే ఒక వ్యక్తికి కలిగే విమోచనం కాదు, వ్యక్తి ఆత్మ, విశ్వాత్మతో మమేకమై విముక్తి సాధించడం. మహాయాన బౌద్ధాన్ని అనుసరించే వ్యక్తి ఒక ప్రతిన కూడ చేపడతాడు. అదేమిటంటే ఈ ప్రపంచలోని అన్నింటికి నిర్వాణం (మోక్షం) కలిగేవరకు తన వ్యక్తిగత విమోచనాన్ని అంగీకరించను అని.

ఒక వ్యక్తి తాను తన జీవితమంతా ఇతరుల సేవలో/ప్రేమలోనే గడిపినట్లు, తనలో స్వార్థ చింతన లేదన్నట్లు భావిస్తే అది ఆత్మవంచన అవుతుంది. నిజానికి ఇతరులమీద ప్రేమ చూపుతున్నామన్న భావనలో స్వార్థచింతన దాగి ఉంది. 'నేను' అనే భావనే చాలా బలంగా ఉంటుంది. భగవంతుడైనా, మనిషి అయినా ఒక్కదానితో తృప్తిపడగలరు. దైవంతో అనుసంధానం కలిగే విషయంలో కూడా తన ఒక్కడి తృప్తే ముఖ్యపాత్ర వహిస్తుంది. మానవ జీవిత లక్ష్యము దైవసాయుజ్యము. దీనికున్న మార్గాలలో సత్ప్రవర్తన ఒకటి మన జీవితంలో మనం పెంపొందించుకొనే సుగుణాలను బట్టి మనం మోక్షసాధనకు ఎంత చేరువలో ఉన్నామో తెలుస్తుంది.

వ్యక్తిగతంగా సాధించే ఆత్మాభివృద్ధి, స్వీయాభివృద్ధి కంటె, దైవం మీదగల ప్రేమ, దైవాన్ని గురించి తెలుసుకోవడం ప్రధానమైనవి. ఒక వ్యక్తి తనకిష్టమైన కొన్ని నైతిక సుగుణాలను పెంపొందించుకొని, వాటిని

గురించి చాటింపు వేస్తూ తనను తాను గొప్పగ చిత్రీకరించుకోడం జరిగితే అది అహంకారం అవుతుంది. మూఢత్వమవుతుంది. ఇవి అతి దరిద్రమైన నైతిక దుర్గుణాలు.

మనకు దొరికిన వరం/ఔచిత్యం అపౌరుషేయము/దివ్యము అయినట్లయితే, మనం మొత్తం వ్యక్తిత్వంలో ఒక భాగం అభివృద్ధి చెందినా మిగతా భాగాలలో అభివృద్ధి జరగకుండ ఉండదు. నిజమైన ఔచిత్యాన్ని, అసహజమైన ఔచిత్యానికి తేడా కనుగొనడం కష్టం. కాని, కాలం గడుస్తున్నకొద్దీ ఆత్మమీద వాటి ప్రభావం తేటతెల్లమవుతూ వస్తుంది. సాధారణ వ్యక్తులకు కూడ అది విదితమవుతుంది. ఏ వ్యక్తి అయితే క్షణ క్షణానికి తన స్వార్థాన్ని విడనాడి, తన జీవితం మీద మోహాన్ని తగ్గించు కొంటూ వస్తాడో, దైవానికి చేరువవుతాడో ఆ వ్యక్తికి, అతడి (ప్రయాస) ప్రయత్నానికి అనుగుణంగ వరమీయడం జరుగుతుంది.

**న్యాయము**

న్యాయము అనే సిద్ధాంతము ఎట్లా పుట్టిందో ప్లాటో తను రాసిన 'ది రిపబ్లిక్' అనే పుస్తకంలో ఇలా వివరిస్తారు. "తప్పు చేయడం బాగానే ఉంటుంది. కాని దానివలన బాధపడడం బాగాలేదు. బాధించిన వాడికి ఉన్న అనుకూల పరిస్థితి కంటె బాధితుడికి కలిగే కష్టనష్టాలు, దుఃఖము ఎక్కువ. ఒక వ్యక్తి బాధితుడిగా, బాధించేవాడిగా రెండురకాల అనుభవాలను చవిచూసినప్పుడు, ఎదుటివాడు కలిగించే దుఃఖం నుండి తప్పించుకోలేని పరిస్థితిలో ఉన్నప్పుడు వారు ఒకరితో మరొకరు ఒడంబడిక చేసుకొన్నారు. 'ఎప్పుడూ ఎదుటివాడిని బాధించకూడదని, బాధింపపడకూడదని' ఒప్పందం చేసుకొన్నారు. నియమాలు, నిబంధనలు ఏర్పరుచుకొన్నారు. దానిని 'న్యాయము' అన్నారు. 'ధర్మము' అన్నారు. అలాగ న్యాయము అనే

దొక 'రాజీ' అది. తన స్వభావం చేత మంచేమీ కాదు, తప్పు చేయకుండ ఉండుటకొక ఒప్పందం చేసుకోవడం.

ఆ విధంగా ఆవిర్భవించిన న్యాయం మనుషులు ఒకరినొకరు బాధించకుండ, ఒకరినొకరు హాని కలగచేయకుండ, వారిని దుఃఖం నుండి కాపాడే ప్రయత్నం. ఈవిధంగా ఒప్పందం చేసుకొనని జీవులకు న్యాయ మేమిటో, అన్యాయమేమిటో తెలియదు. నొప్పించకుండ, నొప్పింప నీయకుండ చేసుకొన్న ఒడంబడికే న్యాయము. అన్యాయమనేది దానంతటదే తప్పుకాదు. తప్పు చేసిన తమను శిక్షించే అధికారమున్నవారి నుండి/ వారు విధించే శిక్ష నుండి తప్పించుకోలేక పోతున్నామనే భయం మనిషిని అన్యాయానికి దూరముంచుతుంది. న్యాయమనేది అందరికీ సమానంగ వర్తిస్తుంది కనుక అది అందరికీ ఉపయోగకరం. కొన్ని దేశాలలో ఉన్న ప్రత్యేక పరిస్థితుల వలన అందరికీ ఒకటే న్యాయము వర్తించకపోవచ్చు. మరకొన్నిసార్లు, పరిస్థితుల మార్పువల్ల ఒకానొకప్పుడు న్యాయవంతమైనది, ఆ తరువాత అన్యాయం కావచ్చు.

మనిషి తన సహజమైన జంతు ప్రవృత్తికి వ్యతిరేకంగ న్యాయాన్నమలు చేస్తాడు; తప్పు చేయకుండ ఉండలేక న్యాయాన్ని పాటిస్తాడు. తప్పని పరిస్థితులలోనే అతడు న్యాయవంతంగ ఉంటాడు, ఒప్పు చేస్తాడు."

న్యాయమనేది ఒక వ్యక్తిలోగాని, ఒక సమాజంలో గాని ఉండొచ్చు. సమాజం వ్యక్తి కంటే పెద్దది కనుక అక్కడ లభించే న్యాయం పెద్దది. కనుక ఒక వ్యక్తి ఇంకొక వ్యక్తికి తనకు లభించే దానికి ప్రతిగా ఏదైనా ఇవ్వడం జరిగితే అది తనకు లాభదాయకమేనని అతడికి తెలుసు.

ఏ ఇద్దరు వ్యక్తులూ ఒకటే విధంగ పుట్టరు. వారి స్వభావాలలో తేడా ఉంటుంది. ఒక్కొక్కరం ఒక్కొక్క వృత్తికి అనుకూలంగ ఉంటారు. కనుక

ప్రతివ్యక్తిని ఇతర వ్యాసంగాలనుండి సరియైన సమయంలో తప్పించి, అతడే న్యాయవృత్తికి అనుకూలమో దానిని చేయనిస్తే ప్రతి ఒక్కరు చక్కగ పనిచేయగలుగుతారు.

ప్లాటో ప్రకారం రాజ్యము నాలుగు విధాలైన ధర్మాలని పాటించాలి. అందులో న్యాయము నాలగవది, ముఖ్యమైనది. న్యాయమొక విశ్వజనీనమైన సూత్రం. ఎవరు ఏ పని చేయడానికి సహజసిద్ధంగ అనుకూలురో ఆ పనిని చేయనివ్వడమే ఆ సూత్రము.

ఎవరి పనివారు చేసుకొంటూ, ఇతరుల జోలికి పోకుండ ఉండడం కూడ న్యాయమే. సమాజంలో ఉన్న అనేకశ్రేణులు/వర్గాలు: ఉదాహరణకు వర్తకులు, రక్షకులు వగైరా ఎవరిపని వారు చేసుకొంటూపోతే ఆ సమాజము న్యాయవంతమైన సమాజము. ఎవరి ప్రకృతికి సరిపడే ఉద్యోగాన్ని! వృత్తిని వారు చేసుకొంటున్నంత కాలము ప్రజలు ఒకరి స్తానాన్ని మరొకరు, ఒకరి పనిముట్లని మరొకరం మార్పిడీ చేసుకొన్నా నష్టంలేదు.

ఏ విధంగా రాజ్యము లేదా సమాజము న్యాయవంతమో అదే విధంగ వ్యక్తికూడ న్యాయవంతుడే. వ్యక్తిలోని అన్ని విభాగాలు సరిగ్గా పనిచేసి నట్లయితే, తనకు సహజసిద్ధంగ అనుకూలమైన పని చేస్తున్నట్లయితే అది న్యాయము. అతడి వివేకము, ఆలోచన అతడిని సక్రమమార్గంలో నడపాలి. ఆత్మ, శరీరము రెండు సయోధ్యతో పనిచేయాలి. రెండింటికి సరైన తర్ఫీదునివ్వాలి. మనసు, శరీరము తగిన శిక్షణ పొందినట్లయితే, తమ తమ బాధ్యతలనెరిగి పనిచేసినట్లయితే, వాటిని మనిషికున్న అంతులేని కోరికల మీద అధికారం కలిగి ఉన్నట్లయితే ఉండేలాగు ఏర్పాటు చేయాలి. అవి రెండు మనిషికి కాపలా కాయాలి. శారీరక ఆనందాలు హద్దుమీరకండ ఉండేలాగు చూడాలి. అతడి స్వభావంలోని ప్రతి అంశము తన విధిని

తాను సక్రమంగ చేసి, నియమానుసారంగ ఉండినప్పుడు ఆ వ్యక్తి న్యాయవంతుడు అంటాము.

న్యాయము అనేది అంతరంగానికి సంబంధించినది, బాహ్య ప్రవర్తనకు సంబంధించినది కాదు. న్యాయవంతుడైన వ్యక్తి తన మనసు/తన ప్రకృతి/స్వభావంలోని పలు అంశాలు ఒకదాని స్థానం మరొకటి తీసుకోకుండా జాగ్రతపడతాడు. క్రమశిక్షణతో తన యింటిని తాను చక్కదిద్దుకొంటాడు. తనలోని భాగాలన్నీ ఒక దానితో మరొకటి సయోధ్యతో పనిచేసేటట్లు చూసుకొని తాను 'ఒక్క' మనిషిగా (రకరకాలుగ కాకుండ) ఉండి తన ఇహ జీవితాన్ని సాగిస్తాడు.

తాను చేపట్టే అన్ని పనులలోనూ న్యాయవంతంగా ఉంటాడు. అది తన అలవాటుగ చేసుకొంటాడు. అతడు వివేకం గురించి మాట్లాడడమంటే తన ప్రవర్తనను న్యాయవంతంగా ఉంచే వివేచన గురించి మాట్లాడడ మన్నమాట. ఏ చేష్ట ఏ పనైనా పై అలవాటును భంగపరిస్తే అతడు దానిని న్యాయానికి విరుద్ధంగా భావిస్తాడు. దానిని అజ్ఞానంగాను తప్పుగాను భావిస్తాడు. న్యాయవంతంగా ఎటువంటి సమస్యలనూ ఎదుర్కోడు. అన్యాయవంతుడికి అన్నీ సమస్యలే. తానున్న సమాజానికి అన్యాయం తలపెట్టడం అన్నింటికంటె పెద్ద అధర్మంగ భావిస్తాడు.

న్యాయంలో రెండు సూత్రాలున్నాయి. అందులో ఒకటి స్వేచ్ఛకు సంబంధించినది. తనకెంత స్వేచ్ఛ స్వాతంత్ర్యమున్నాయో, అంతే స్వేచ్ఛ స్వాంతంత్ర్యాలు ఇతరులకు కూడ ఉండాలని కోరుకోడం; రెండవది సమాజంలోని వ్యక్తుల మధ్య వ్యత్యాసముండడం అధర్మమని భావించడం; ఒకవేళ ఉన్నా అది అందరి బాగుకోసం; ప్రజాశ్రేయస్సుకోసం పనిచేయాలని కోరుకోడం. వారి వారిలో నున్న స్థాయీ భేదాలు, వారు నిర్వహించే బాధ్యతలు, అధికారాలు అందరికి సమానంగ లభించాలని కోరుకోడం.

పైనుదహరించిన సూత్రాలు ఒక విషయం తెలియచేస్తాయి. న్యాయమంటే, స్వేచ్ఛ, సమానత్వం; అందరి శ్రేయస్సుకోసం పనిచేసే వారికి తగిన బహుమానం లభించడమనే మూడు సూత్రాలపై ఆధారపడి ఉంది. ఈ నిర్వచన వ్యక్తులకి, దేశాలకి, రాజ్యాలకి, వర్తక వ్యాపార శ్రేణులకి, మత సంస్థలకి, అన్ని సమూహాలకి వర్తిస్తుంది. కొన్ని ప్రత్యేక పరిస్థితులలో హేతువాదంపై నిర్భందంగ కొన్ని నియమాలను విధించినప్పుడు న్యాయపరమైన సమస్యలు తలెత్తుతాయి. ఒకరిపై మరొకరు ఆధారపడిన, ఒకే పరిస్థితి నెదుర్కొంటున్న సంస్థలపై నిర్బంధ నియమాలని విధించినప్పుడు న్యాయ సమస్యలు తలెత్తుతాయి. న్యాయానికి ముఖ్యము సమతుల్యత పాటించడం. ఒకరికి ఒకరు సహకారమందించే వాళ్ళకు, ఒకరితో ఒకరు పోటీ పడ్తున్నవాళ్ళకు న్యాయాన్ని సమానంగా అందింపచేయడం. పోటీతత్వం ఆరోగ్యవంతంగా ఉండేలా చూడడం న్యాయంలో ఒక భాగం.

ఏదైనా ఒక కార్యక్రమంలో (పనిలో) కొంతమంది పాల్గొంటున్నప్పుడు, పాల్గొనే వారిలో ఎవరికైనా తమతోపాటు పాల్గొంటున్న ఇతరులకు కొన్ని స్థితిగతులు అనుకూలంగ ఉన్నాయని, తాము తమకు అనుకూలం కానివాటిని అంగీకరించాల్సిన పరిస్థితి ఏర్పడిందని బాధపడకూడదు. అందులో భాగస్థులందరికీ తమకోరికలు న్యాయవంతమైనవని, ఇతరులు కూడ వాటిని ఆ విధంగానే గుర్తించాలని ఉంటుంది. ఆ కార్యక్రమంలో పాల్గొనే వారందరు కొన్ని న్యాయసూత్రాలు, కొన్ని ప్రతిపాదనలు ఒకరికొకరు ప్రతిపాదించి, అంగీకరింప చేసినట్లయితే ఆ కార్యక్రమం న్యాయవంతమని చెప్పొచ్చు.

ఒకరిమీద మరొకరికి ఏ అధికారమూ లేని సామాన్య ప్రజలు తమ పరస్పర సమ్మతితో కొన్ని సూత్రాలను అంగీకరించినట్లయితే ఆ పరిస్థితిని న్యాయవంతమని చెప్పవచ్చు.

అటువంటి పరస్పర సమ్మతికి వచ్చినపుడు అక్కడ నిజమైన సౌహార్దం ఏర్పడుతుంది. ఆ విధంగ పరస్పరమైన అంగీకారంతో ఒప్పుకొన్న సూత్రాల ఆధారంగ పనిచేసే వ్యవహారాల గురించి మాట్లాడవలసి వస్తే న్యాయమైన సూత్రాలనే ఉపయోగించాల్సి వస్తుంది.

ఒక వ్యవహారంలో భాగస్వామ్యులైనవారు దానికి సంబంధించిన సూత్రాలు, నియమాలు న్యాయవంతంగ ఉన్నాయి అని అంగీకరించాలి, వాటి ప్రకారం నడుచుకోడానికి ఒప్పుకోవాలి. అందులో కొన్ని బాధ్యతలను నిర్వర్తించే వారికి కొన్ని హక్కులు కూడ ఏర్పడుతాయి. ఆ విధంగ పుట్టుకొచ్చిన హక్కులు, బాధ్యతలు ఆ వ్యవహారంలో భాగస్థులైన వారిమీద ఆధారపడి ఉంటాయి. దీన్ని న్యాయవంతమైన వ్యవహారము అంటారు. సరిసమానమైన దృష్టి కలిగి ఉండడం అంటారు.

ఒకరిపై ఒకరికి విశ్వాసముండడం; కృతజ్ఞత కలిగి ఉండడం వేరు సరిసమాన దృష్టి ఉండడం వేరు. కొంత ఇది ఆ వ్యవహారంలో భాగస్థులను తమ స్వంత ఆసక్తిని కొంత తగ్గించుకొనేట్లు చేస్తుంది. తాము చేస్తున్న ఉమ్మడి వ్యాపారంలో ఉమ్మడి వ్యవహారంలో తమతోపాటు ఇతర భాగస్థుల ఆసక్తిని; వారి ఆశలని కూడ గుర్తించాలి. ఇదొక నైతిక బాధ్యత. ఇది ఎంపిక కిందగాని, అంతర్దృష్టితో కూడిన నైతికతగాని కాదు. ఇతరులను గుర్తించడం, వారి హక్కులను బాధ్యతలని గౌరవించడం. ఆ విధమైన నడవడిక, ప్రవర్తన కలిగి ఉండడం ఇందులో ముఖ్యభాగం.

ఇందులోని ఇంకొక విశేషమేమంటే దానితో పొసగని విధంగ ఎవరైనా తమ హక్కును ప్రకటిస్తే దానికి నైతిక విలువ ఉండదు. ఈ సూత్రం న్యాయాన్ని ఔదార్యంతో ముడిపెడ్తుంది. అందరి శ్రేయస్సుకు దారితీస్తుంది. ఆ విధంగ న్యాయం నైపుణ్యానికి మారుగ నిలుస్తుంది.

కార్య నిర్వాహక వర్గం సరియైన నిర్ణయాల తీసుకొంటే సరియైన న్యాయం జరుగుతుంది. ఆ సంస్థకు సంబంధించిన అన్ని పరిపాలనా సమస్యలు సక్రమంగ పరిష్కరింపబడుతాయి. మనిషి యొక్క ప్రవృత్తిని దృష్టిలో పెట్టుకొని చూస్తే ఈ న్యాయసూత్రాలెంత గొప్పవో అర్థమవుతుంది. ఈ విధమైన పరిశీలన న్యాయము నైతికతతో ఎంతటి అవినాభావ సంబంధము కలిగి ఉందో తెలుస్తుంది.

ప్రతి ఒక్కరూ తాము న్యాయవంతంగా ఉన్నామనే భావిస్తారు. సరి సమానమైన దృష్టికల ఈ న్యాయసూత్రమును పాటించే సమాజంలో కొన్ని సంబంధ బాంధవ్యాలైనా తాము దగ్గర వారమనే భావంతో ఉండాలి. ఒక సమాజం ఎక్కువ భాగం వ్యవహారాలలో ఈ సూత్రాన్ని వాడొచ్చు; ఎక్కువగా దీనిమీద శ్రద్ధపెట్టొచ్చు, నీతి సూత్రాలకంటె దీనినే ఎక్కువగా పాటించవచ్చు. ఆ విధమైన పరిశీలనలో ఒక సమాజానికి మరొక సమాజానికి వ్యత్యాసం ఉండడానికవకాశముంది.

న్యాయమనే సుగుణము సమాజానికెంతో ఉపయోగకరం. అసలు ప్రజల ఉపయోగార్థమే ఇది పుట్టింది. దీనివలన కలిగే మేళ్ళు దీని యోగ్యతను తెలియచేస్తాయి. మనిషి సంఘజీవి. మనుషులు ఒకరితో ఒకరు సంబంధ బాంధవ్యాలు కలిగి ఉంటారు. వాటిని నిలబెట్టేందుకిది చాలా అవసరం. సమాజంలోని ప్రజలు నిర్భయంగ ఆనందంగ ఉండేందుకిది దోహదం చేసి శాంతిభద్రతలను కాపాడుతుంది. సమానత్వం, సమభావం అనేవి న్యాయాన్ని ఖచ్చితంగ అమలు చేస్తేనే సాధ్యమవుతాయి. మనిషిలో మానవత్వాన్ని, మితాన్ని పెంపొందింపచేసేది న్యాయం. ప్రకృతి మనకు కొన్ని ఆనందాలనిచ్చింది. తమ తెలివితేటలతో, పరిశ్రమతో, కష్టంతో మనిషి ప్రకృతినుండి ధారాళంగ తీసుకొని ఆ వస్తువులతో ఆస్థి అనేదానికి అంకురార్పణ చేశాడు. ఒక సభ్యసమాజంలో ఆస్థిని అనుభవించడమనేది

ఒక సాంఘిక హక్కుగ నెలకొన్నది. ఆ విధంగ అది ప్రజలకుపయుక్తమై ఉన్నది.

న్యాయశాఖలో ఉన్న అన్ని నియమనిబంధనలు మనిషి శ్రేయస్సునే కాంక్షిస్తాయి. మనుషుల స్వాధీనంలో ఉన్న వారి ఆస్థి, సంపదను కాపాడి శాంతివంతంగా ఉండే వీలుకల్పిస్తుంది న్యాయం. ఆస్తి, ఐశ్వర్యాలను కాపాడే న్యాయసూత్రాలు, ఆ సంపద సమాజానికి ఉపయుక్తమయ్యే విధంగా చూడాలి. స్వార్ధచింతనికి దారితీయకుండ తగు జాగ్రత్తలు వహించాలి. ఆస్థి అంటే ఏమిటి? ఏదైనా వస్తువుకాని, వస్తు సముదాయం కాని ఒక వ్యక్తి అనుభవించే హక్కు; అతను మాత్రమే అనుభవించే హక్కు కలిగి ఉండడం. ఈ ఆస్థులు భిన్న సమాజాలలో భిన్న రకాలు. ఆయా సమాజాల పద్ధతులు, సాంప్రదాయాలు, కట్టుబాట్లు, అలవాట్లని గమనించాలి. కొన్ని స్థిరాస్థులు, కొన్ని చిరాస్థులు అన్నింటికంటె ముఖ్యమైన అంశం సమాజం యొక్క శ్రేయస్సు; ఆనందం.

మొత్తానికి ఆస్థికి సంబంధించిన విషయాలు పౌరసమాజానికి సంబంధించిన అధికారంలో ఉండాలి. ఆ న్యాయమే ఆస్థిపాస్తుల విషయం చూసుకొంటుంది. ప్రభుత్వం చేసే చట్టాలకు లోబడి ఉండాలి. వ్యాపార వాణిజ్యాలు, మతం జనాభా వంటి విషయాలు పరిగణనకు తీసుకోవాలి. న్యాయము, చట్టము సమానమని, కొన్నిసార్లు న్యాయం చట్టం కంటె గొప్పదని అంటారు. న్యాయము, చట్టము ఒకదానికొకటి అనుబంధం కలిగి ఉంటాయి. ఏదైనా ఒక ప్రామాణికాన్ని తీసుకొని అది న్యాయమైనదా; అన్యాయమైనదా అని పరీక్షించేముందు ఆ ప్రామాణికాన్నే విచారించాలి. అదే విధంగ సాధారణమైన చట్టము, ఈ నియమ నిబంధనలకు అతీతమైన ఆదర్శం కోసం మనం దావా వేస్తామనుకోండి, దాని విచారణ వీటికంటె ఉన్నతమైన పునాదిపై జరగాల్సి ఉంటుందని ప్రొఫెసర్ డెల్ వెసియో (Prof. Del Vecchio) అంటారు.

ప్రొ. Del Vecchio రెండు రకాల న్యాయం గురించి మాట్లాడుతారు; ఒకటి లీగల్ జస్టిస్. అనగా చట్టపరమైన న్యాయము; రెండు ఎతిక్ జస్టిస్; నైతిక న్యాయము. ఇది ఒక ప్రత్యేకమైన సద్గుణంగ ఎదిగిందని చెప్తారు. అది హక్కులు, బాధ్యతల గురించి చెబుతుంది. జుడీషియల్ జస్టిస్; న్యాయ స్థానానికి సంబంధించిన న్యాయము రెండుగ విభజించబడింది. ఒకటి డిస్ట్రిబ్యూటివ్ జస్టిస్ రెండు రెట్రిబ్యూటిల్ జస్టిస్. డిస్ట్రిబ్యూటివ్ జస్టిస్ రీ–కాగ్నిటివ్ జస్టిస్‌గా, అట్రిబ్యూటివ్ జస్టిస్‌గా చీలింది. రెట్రిబ్యూటివ్ జస్టిస్ కమ్యూనికేటివ్ జస్టిస్‌గాను, పీనల్ జస్టిస్ గాను చీలింది.

రాజ్యాంగాలు, శాసనాలు వగైరా విశదమైన ఏ మాత్రము శంక లేని అనుమానాలకి తావివ్వని పదాలతో వ్రాయలేదు. కొన్ని కొన్ని న్యాయ సంబంధమైన పదాలు విశదీకరించి వ్రాసినప్పటికీ, వాటి నిర్వచనాలింకా అదృష్టంగానే ఉన్నాయి. ఏ ఏ సందర్భాలలో ఏ ఏ విధంగా వాటిని వాడు కోడం ఎట్లాగో అంత స్పష్టత లేదు.

ఆ కారణం చేత వ్రాయబడని నియమాలు, వ్రాయబడిన నియమాలు కొత్త కొత్త అర్థాలకు, విశ్లేషణకు తావిస్తుంటాయి. చట్టానికి సంబంధించి న్యాయవ్యవస్థ ఒక విశ్లేషణ సంస్థగా పనిచేస్తుంది. ఈ విశ్లేషణ నైతిక విషయాలలో కూడ అవసరం. న్యాయశాఖకు సంబంధించిన అన్ని సూత్రాలు, అన్ని చట్టాలు కలిసి కూడ సరియైన సమాధానాలివ్వలేకపోవచ్చు. ఒక్కొక్క సమస్యకు అసలు సరియైన/సూటియైన సమాధానము ఉండక పోవచ్చు.

**విలువలు**

మనకు ప్రత్యక్షంగాను, మౌలికంగాను అనుభవంలోకి వచ్చే విషయాలను మనం ఇష్టపడేవి, మనం ఆనందించడానికి సాధించడానికి

అవకాశమున్నవి విలువలుగా పరిగణిస్తాయి. అవి వేటిమీద ఆధారపడి ఉన్నాయో తెలిస్తే వాటి అనుభవం ఒక విలువగ పరిగణిస్తాము. అటువంటి ఆచరణాత్మకమై వివరణ 'విలువ' యొక్క భావాన్ని మాత్రమే తెలియచేస్తుంది, విలువను కాదు. ఆ భావనను ఆచరణలో పెట్టినప్పుడే అదొక తెలివైన సురక్షితమైన విలువగల విషయంగ రూపుదిద్దుకొంటుంది.

'అనుభవించి, ఆనందించడానికి', 'అనుభవించడానికి అవకాశ ముండడానికి' మధ్య తేడా ఉంది. అదే విధంగ కోరదగినదానికి, 'కోరడానికి' మధ్య తేడా ఉంది. మనం ఒక విషయాన్ని అనుభవించి ఆనందించాము అన్నామంటే దానర్థం ఉనికిలో ఉన్న విషయం గురించే మాట్లాడుతున్నా మన్నమాట. ఆ విషయాన్ని గురించిన విలువను మాట్లాడడం కింద లెక్కకాదు.

ఫలానా విషయం లేదా అంశం ఆనందించడానికి అనువైనదనో, అవకాశం కలిగి ఉన్నదనో అంటామనుకోండి ఆ విషయం అక్కడితో ముగియదు. ఆనందయోగ్యమనడంలో దాని సంబంధ బాంధవ్యాలను, ప్రతిస్పందనలను గురించి మాట్లాడుతున్నామన్న మాట. సరే అది ఆనంద యోగ్యమన్నాము. అలా అన్నప్పుడు మరియొక సమస్య ఉత్పన్నమౌతుంది. ఆ ఆనందానికి ఖరీదు ఎలాగ కట్టాలి? అది కోరదగినదా కాదా అనేదింకొక అంశం. మనం ప్రత్యక్షంగా అనుభవంలోకి వచ్చే విషయాలను సాధించ డానికి అవకాశమున్న విలువలుగా పరిగణిస్తాము.

ఒక విషయాన్ని ఆనందదాయకమైనదిగా వర్ణించామంటే ఆ ఆనందాన్ని పొందేందుకు కొన్ని అనుకూల పరిస్థితులవసరం. ఆ ఆనందం ఆహ్వానించదగినదై ఉండాలి. ఫలానా విధంగ జరగబోతూ ఉంది అనిపించాలి. అదొక అంచనా; అదొక సూచన. జరగబోయే దానిని నిర్ణయించేదిగ ఉంటుంది.

(రుచి) 'అభిరుచి' అనేది మనం అలవరచుకొనేది. అది మన విలువల గురించి తెలిపే/వ్యక్తపరిచే ఒక భావం. మన విలువలు మేధో పరమైనవి కావచ్చు, సౌందర్యాత్మకం కావచ్చు. నీతిమంతం కావచ్చు. అవన్నీ మనం అలవరచుకొన్న అభిరుచి మీద ఆధారపడి ఉంటాయి. ఈ అభిరుచి అనేది మన నిరంతర ఆలోచనా ధోరణి మీద ఆధారపడి ఉంటుంది.

అభిరుచి అనేది మన ఇష్టాల, ఆనందాల నిజమైన శ్రేష్ఠత మూల్యాన్ని అంచనా కట్టడం మీద; అనుభవ సారం మీద ఆధారపడి ఉంటుంది. అంతర్దృష్టి అనేది మన ఆలోచనాత్మక అనుభవం మీద ఆధారపడి ఉంటుంది అంతేకాని కేవలం చింతనాశీలకమైనది కాదు.

మన ఇష్టాలు వాటి ఫలితాలు కొన్ని ప్రత్యేక పరిస్థితులపైన ఆధారపడి ఉంటాయి. వాటి గురించి ఆలోచించినపుడు, ఆ ఇష్టాలు ఏ సిద్ధాంతాలపై ఆధారపడి ఉంటాయో అవి వాటి విలువను నిర్ధారించడంలో ఉపయోగ పడతాయి. ఏదైనా ఒకటి ఇష్టపడడం జరిగితే ఆ ఇష్టం నిర్ద్వందంగా ఉంటుంది. దేన్ని ఇష్టపడాలో, దేన్ని కోరుకోవాలో అనే నిర్ణయం మట్టుకి భవిష్యత్తు కార్యాచరణని నిర్దేశిస్తుంది.

అభిరుచి అనేది అనుభవసారం మీద ఆధారపడి ఉంటుంది. అది మన ఇష్టాలు, ఆనందాల యొక్క నిజమైన  విలువను అంచనా కట్టడం మీద ఆధారిక పడి ఉంటుంది.

అంతర్దృష్టి (చింతనాశీల పరిశోధన) అనేది మన ఆలోచనాత్మకమైన అనుభవం మీద ఆధారపడి ఉంటుంది.  మనకిష్టమైనవాటికి అవసరమైన పరిస్థితులు, వాటి ఫలితాలు గురించి ఆలోచించుకుంటే ఆ ఇష్టాల సిద్ధాంతాలు / ప్రతిపాదనలు వాటి మూల్యాన్ని నిర్ధారించడంలో ఎంతో ఉపయోగంగా  ఉంటాయి.

ఆ విధంగ చూసినప్పుడు విలువలు మన (అభిరుచి) ఇష్టాల కనుగుణంగ ఉంటాయి. అట్లాగని ప్రతి ఇష్టమూ అలాంటిదని చెప్పలేము. ఆ ఇష్టం వేటిపైన ఆధారపడి ఉందో వాటిపైన, ఆ ఇష్టం పైన మనం తీసుకొన్న నిర్ణయంపైన ఆధారపడి ఉంటుంది. తాత్కాలికంగ ఏర్పడే ఇష్టాలకు, మన తరచి చూసి ఇది మంచిది అని నిర్ణయం తీసుకొన్న ఇష్టాలకు చాలా తేడా ఉంది. రెండవ రకానికి చెందిన ఇష్టాలు మన ప్రవర్తనని, మన ప్రవృత్తిని తెలుపుతాయి.

విలువల గురించిన తీర్పులు మన అనుభవంలో కొచ్చిన పరిస్థితులు, ఫలితాలపై నిర్ణయాలే అంటారు జాన్ డ్యూయి John Dewey మనం ఎటుంటి కోరికలు కోరాలో, ఎటువంటి ఆనందాలని కోరుకోవాలో, ఎటువంటి ఇష్టాలు ఏర్పరచుకోవాలో అనే వాటిని ప్రభావితం చేస్తాయి. అవి మన వ్యక్తిగతమైన, సామాజికమైన ప్రవర్తనని నియంత్రిస్తాయి అంటారు John Dewey.

మన మనసు లోతుల్లోనుండి వచ్చిన అనుభవం మీద ఆధారపడిన ఆనందాలకొక అర్థమూ ఒక ఉపయోగమూ ఉంటాయి. అటువంటి ఆనందాలు చేదు జ్ఞాపకాలని మిగల్చవు. వాటి ప్రయోజకత్వం ఆ ఆనందాలని ఇనుమడింప చేస్తాయి. అటువంటి విలువగల ఆనందాలని కోరుకోడానికి, కేవలం ఆ ఆనందం కొనసాగాలని కోరుకోడానికి వ్యత్యాసముంది.

ఈ మంచి విషయాన్ని ఆనందించడమే దాని విలువ అవుతుంది. విలువలంటూ వేరే ఏమీలేవు. ఒక విషయం యొక్క విలువ/శ్రేష్ఠత దానిని అనుభవించడంలో ఉంటుంది. సంతృప్తి ఉన్నచోటే విలువ ఉంటుంది. సంతృప్తి విలువగా మార్పుచెందడానికి కొన్ని అనుకూల పరిస్థితులు కావాలి.

'విలువలు' అందరికీ తెలిసినవే అనీ, వాటి యోగ్యతని బట్టి మనం వాటిని అలవరచుకోవాల్సి ఉందని కొందరి అభిప్రాయం. ఉన్న విలువలను అలవరచుకోవడం కంటె ముందు అవేవో తెలుసుకోడం ముఖ్యం.

ఒక మనిషి విలువ అతడెంత ప్రయోజనకారో అనే దానిపై ఆధారపడి ఉంటుంది. అది అతడిపై ఇతరులకున్న అవసరాన్ని బట్టి, వారి తీర్పుపైన ఆధారపడి ఉంటుంది. విలువ అనేది స్థిరంగ మారకుండ ఉండేది కాదు. ప్రతి వ్యక్తి తనను తాను అత్యున్నత స్థాయి వ్యక్తిగా పరిగణించవచ్చు. కాని అది నిజం కాదు. ఇతరులు అతడినేవిధంగ అంచనా వేస్తారో అదే ముఖ్యము. మనిషి విలువను బట్టి అతడికి గౌరవం; అగౌరవం లభిస్తాయి. ఎక్కువ విలువ ఉన్న వ్యక్తిని గౌరవించడమూ తక్కువ విలువ ఉన్న వ్యక్తిని అగౌరవ పరచడం సాధారణం. అది ఆ వ్యక్తి ప్రవర్తన బట్టి ఉంటుంది.

సమాజంలో ఒక వ్యక్తికి గల గౌరవాన్ని హుందాతనమంటారు. ఉద్యోగం, హోదా, పరపతి వంటివి దీనికనుసంధానంగ ఉంటాయి.

ఒక వ్యక్తిని సహాయంకోసం అర్థించామంటే అర్థం ఆ వ్యక్తికి మనకు సాయపడే శక్తి మనం నమ్ముతున్నామన్నమాట. అదే విధంగ మనం ఇతరుల పట్ల విధేయత కలిగి ఉన్నామంటే అర్థం ఆ వ్యక్తికి ఆ హుందాతనముందని అర్థం. అప్రయోజకుల్నెవరూ ఖాతరు చేయరు, గౌరవించరు. ఒక వ్యక్తికుండే సహజమైన సామర్థ్యం అతడి విలువని నిర్ధారిస్తుంది.

ఒక వ్యక్తి (సమాజంలో) నలుగురితో ఉన్నప్పుడు ఏ విధంగ ప్రవర్తిస్తాడు అనేది చాలా ముఖ్యం. కాని వాటికంటె ముఖ్యం ఇతరులతో/ మానవాళితో అతడు శాంతియుతంగ, ఐక్యతతో జీవించేందుకు అతడేమి చేస్తాడు అనేది. ఈ జీవిత లక్షణం కేవలం అతడికి ఒకసారి కలిగిన తృప్తికి సంబంధించినది కాదు. మనిషి ఏదైనా అనుభవాన్ని దాని తృప్తిని

ఒకసారికి మాత్రమే పరిమితం చేయడు. ముందు ముందు భవిష్యత్తులో కూడ అటువంటి తృప్తిని, ఆనందాన్ని పొందాలని కాంక్షిస్తాడు. ఒకసారి తృప్తి పొందడంతో ఊరుకోక అటువంటి తృప్తి నిరంతరం కలుగుతూ ఉండాలని కోరుకొంటాడు. వ్యక్తులకు వారు ఆశించిన ఫలితాలందకుండా పోయినప్పుడు అది ద్వేషంగ మారుతుంది. అదొక ఊహాపరమైన ప్రతీకారంగా మారి అతడికొక విధమైన తృప్తినిస్తుంది. ఎవరికి వారు తమను తాము సరిగ్గా అంచనా వేసుకోగలిగితే ఇటువంటి అనర్థాలు జరగవు.

బానిసల నీతి ఇంకొక రకంగ ఉంటుంది. వీరిలో కూడ ద్వేష ముంటుంది. దీనిని రగిలించేశక్తి బయటి వారి మీద ఉంటుంది. తనలోకి కాకుండ బయట శక్తుల వేపు చూడడం ఈ ద్వేషం స్వభావం. ప్రతిచర్యే గాని చర్య ఉండదు దీనిలో.

దీనికి పూర్తిగ విరుద్ధం గొప్పవారి విలువల అంచనా అవి స్వతహాగా పెరుగుతాయి. తమకు వ్యతిరేకమైన వాటితో పోల్చుకొని తమను తాము నిర్ధారించుకొంటారు. అప్రయోజకులు, బలహీనుల ఆనందం ఉదాసీనంగా ఉంటుంది. అదొక మత్తులాగా, సోమరితనంగా రూపుదిద్దు కుంటుంది. ద్వేషపరుడైన వ్యక్తి నిజాయితీకి, సూటితనానికి, రుజువర్తనానికి దూరంగా ఉంటాడు. అతని మనసెప్పుడు ప్రక్కదార్లను, రహస్యమార్గాలను, దాచుకొనే స్థలాలను వెతుక్కుంటూ ఉంటుంది. రహస్యంగా ఉండడమే అతడికి రక్షణ కవచంగా, సుఖవంతంగా ఉంటుంది. అతడు నిశ్శబ్దాన్ని, వేచి ఉండడాన్ని ఇష్టపడతాడు. తనను తాను కించపరచుకొంటూ ఉంటాడు. కొంతమందికి కుశాగ్రబుద్ధి కంటే అచేతన కౌశలం మీద నమ్మకమెక్కువ. వీరు అప్రయత్నంగా అప్పటికప్పుడు కలిగే ఆవేశాలకు, స్పందనలకు లోబడి వ్యవహరిస్తారు. కోపము, ప్రేమ, పగ, కృతజ్ఞత వంటి రాగద్వేషాలకి,

సాహసోపేతమైన చర్యలకి పాల్పడుతారు. ఒక గొప్ప వ్యక్తిలో ద్వేషమనేది తలెత్తకపోవచ్చు. కాని అధములలో అది తలెత్తకుండ ఉండదు.

ఉత్తములు శక్తివంతులు తమ శత్రువులని కాని, తనకు జరిగిన అన్యాయాలని కాని; దురదృష్ట సంఘటనలని కాని, ప్రత్యేక శ్రద్ధతో చూడరు. వారిలో స్వతహాగా తమను తాము బాగుచేసుకొనే లక్షణముంటుంది. తమ శత్రువులని  గౌరవించే శక్తి కూడా వీరిలో ఉంటుంది.

దానికి విరుద్ధంగ ద్వేషపూరితమైన వ్యక్తి తనచుట్టూ శత్రువులని సృజించుకొంటాడు. తన శత్రువులని దుష్టులుగా భావిస్తాడు; తనను తాను మంచివాడిగా భావిస్తాడు. కాని ఉత్తములు మంచిని ఉత్పత్తి చేసుకొని దానికి విరుద్ధమైనది చెడు కదా అని తెలుసుకొంటారు.

వివేచన కలిగించే గొప్పవరాలలో ముఖ్యమైనది స్నేహం. అదే విధంగా ఏ దురదృష్టమూ ఎప్పటికీ ఒకేలాగు కొనసాగదని, సుదీర్ఘంగా కొనసాగదని ఎరుక కలిగి ఉండడం వలన స్నేహతత్వాన్ని పదిలంగా కాపాడుకొనేట్లు చేస్తుంది.

ప్రతి ఆరోగ్యవంతమైన నీతిసూత్రమూ ఏదో ఒక జీవితస్పందనతో ముడిపడి ఉంది. బలవంతంగ రుద్దబడిన నీతి జీవన సహజలక్షణాలకు, స్పందనలకు విరుద్ధంగా ఉంటుంది. విలువల గురించి మాట్లాడడమంటే ఒక జీవన దృక్పధాన్ని కలిగి ఉండడం. మన జీవితం మనల్ని విలువలవైపు ప్రోత్సహిస్తుంది. మనం విలువలకి విలువ ఇచ్చినంతకాలమూ మన జీవితం విలువైనదిగ  ఉంటుంది.

ఆదర్శవంతమైన ప్రేమ చట్టాన్నధిగమిస్తుంది. ఆదర్శవంతమైన ప్రేమనుండి ఒక సాంఘిక న్యాయాన్ని జనింపచేయలేము. జీవితంలోని

సంఘర్షణలను సరిదిద్దడం, నియంత్రించడం చట్టం యొక్క బాధ్యత. ఆదర్శవంతమైన ప్రేమ నీతికి మూలాధారం. అదే వ్యక్తులను విలువలకి దగ్గర చేస్తుంది. ఆదర్శవంతమైన ప్రేమ అన్ని న్యాయవంతమైన చర్యలకి సన్నిహితంగ ఉంటుంది. తమ లోటుపాట్లను తెలుసుకొనేందుకు ఉ పయోగపడ్తుంది. సమానత్వమనే ఆదర్శం ప్రకృతి సహజమైనది. అస్తిత్వాన్ని అధిగమిస్తుంది.

**మన వశంలో ఉన్న శక్తులు**

అన్ని నైతిక చర్యలకి ఆధారంగా ఉండేది వివేకము. అది మనం జీవితాన్ని ఏ విధంగ ఆహ్లాదంగా, గౌరవవంతంగా, న్యాయవంతంగా జీవించవచ్చో చెప్తుంది. మన జీవితంలోని అన్ని చర్యలు వివేకవంతంగా చేయాలి. కొన్ని శక్తులు / కొన్ని విషయాలు మన అధీనంలో ఉంటాయి. కొన్ని ఉండవు. మన అభిప్రాయాలు, కోరికలు, అసహ్యం, కదలికలు మన అధీనంలో ఉంటాయి. మన శరీరము, ఆస్థి, పరువు, ఉద్యోగం మన స్వాధీనంలో లేనివి. మన అధీనంలో ఉండేవి స్వేచ్ఛాయుతమైనవి. కాని అవి మన స్వాధీనంలో లేనివి బలహీనమైనవి, నియంత్రణకు లోనైనవి. ఎవరైనా ఒక వ్యక్తి, తన అధీనంలో ఉన్నవే తనవని, తన అధీనంలో లేనివి తనవికావని అనుకొంటే అతన్ని ఎవరూ కానలేరు. అతడెవరినీ నిందించడు, ఇతరులు కూడ అతడికి హాని తలపెట్టరు. ఆ విధంగా అతడికి శత్రువులుండరు.

ఎవరైనా గొప్పపనులు చేయబూనితే, దానికి కావల్సినంత శ్రమ చేయాలి. ఒకేసారి పలుకార్యాలను నెత్తికెక్కించుకోరాదు. ఒకదాని తరువాత మరొకటి చేపట్టాలి. గొప్పపనులతో పాటు సంపదని, అధికారాన్ని పొందాలని చూస్తే ఏ విషయాలు అతడి జీవితంలో స్వేచ్ఛని, ఆనందాన్ని

చేకూరుస్తాయో వాటిని కోల్పోతాడు. కఠినంగా కనపడే విషయాలు నిజగా కఠినమైవేనా లేదా తనపరిధిలో ఉన్నాయా లేదా అని పరీక్షించాలి. తన అధీనంలో లేనివయితే దానిని గురించి పట్టించుకోకూడదు.

కోరిక తీరుతుందని తీర్చుకోగలమని నమ్మకం ఆశ ఉంటుంది. కోరిక తీర్చుకోలేని వ్యక్తి దురదృష్టవంతుడు. కొన్ని కోరికల మనల్ని అగాధంలో పడవేస్తాయి. అందులో పడకుండా ఉండాలని వ్యక్తి కోరుకుంటాడు. అయినా, అందులో పడిపోవడం జరిగితే అతను దురదృష్టవంతుడు. ఎవరైనా ప్రకృతికి విరుద్ధమైన వాటినుండి తప్పించుకోవాలని చూస్తే, ఆ శక్తి అతడి అధీనంలో ఉంటే, అతడు వేటినుండి తప్పించుకోవా లనుకొంటాడో వాటిలో పడడు. కాని ఎవరైనా మరణం నుండి అనారోగ్యం నుండి తప్పించుకోవాలని చూస్తే అతడు దుఃఖభాజనుడౌతాడు. అంచేత మనం జీవితంలో అన్నిరకాల అసహ్యాలకి దూరంగ ఉండాలి. మన అధీనంలో ఉన్న శక్తుల మీదే ఆధారపడాలి, ఏది మంచిదో దాన్నే కోరాలి. మన మనసుకు నచ్చేవి మనలో కొన్ని కోరికలు జనింపచేస్తాయి. ఆ కోరిక నైజమెట్టిదో మనం మన మనసులో పెట్టుకోవాలి. ఉదాహరణకి మనకొక మట్టికుండ నచ్చిందనుకోండి. దానికి పగిలిపోయే నైజముంది. కనుక అది పగిలిపోయినా బాధపడకూడదు.

మనం ఏదైనా చర్య చేపట్టబోయేటప్పుడు, అది ఎటువంటి చర్యో గుర్తుపెట్టుకోవాలి. అదే విధంగ మన సంకల్పాన్ని ప్రకృతి సహజంగ ఉండేట్లు చూసుకోవాలి.

మనుషులు కొన్ని విషయాలపట్ల కొన్ని అభిప్రాయా లేర్పరుకొంటారు. ఆ విషయం కాకుండ తామేర్పరుచుకొన్న అభిప్రాయాలు వారినెక్కువ భయపెడ్తాయి. ఉదాహరణకి మరణం భయంకరమైనది కాదు. కాని కొందరు మరణం భయంకరమనుకొంటారు.

మనం కలవరం చెందినప్పుడు, చీకాకుకు లోనైనప్పుడు, ఇలా బాధకలిగినప్పుడు మనం ఆ స్థితికి ఇతరులను నిందించకూడదు; మనమే బాధ్యులని తెలుసుకోవాలి. అజ్ఞాని మాత్రమే తన బాధలకు ఇతరులను నిందిస్తాడు. జ్ఞాని అనగా సర్వం తెలిసిన వ్యక్తి తననూ నిందించుకోడు, ఇతరులనూ నిందించడు.

ఇతరుల గొప్పతనానికి పొంగిపోనవసరం లేదు. ఏదైనా ప్రకృతి సిద్ధంగా ఉండి, మన అధీనంలో ఉండినట్లయితే మనం పొంగిపోవచ్చు.

ఏదైనా కోరిక, తనకు వచ్చిన రీతిలోనే తీరాలని కోరుకోవడం తప్పు. అది దాని ప్రకృతికి అనుకూలమైన రీతిలోనే జరగాలని కోరుకోవాలి. అప్పుడెటువంటి చింతాలేకుండ ప్రశాంతంగ ఉండొచ్చు.

అనారోగ్యం శరీరానికి సంబంధించినది మనసుకు కాదు. కుంటితనం కాలుకే కాని మనసుకు కాదు. ఈ పరమార్థాన్ని తెలుసుకోగలిగితే మన మనసునేదీ బాధించదు.

ఏదైనా సంఘటన జరిగినప్పుడు దానిని ఏ విధంగా ఉపయోగించు కోగలమో ఆలోచించాలి. ఒక పురుషుడికి అందమైన స్త్రీ గోచరించినపుడు, సంయమనం పాటించాలి. నొప్పి, బాధ కలిగినపుడు ఓర్చుకోవాలి. ఇతరులు నిందించినపుడు భరించగలగాలి. ఈ విధమైన ప్రవృత్తిగల వ్యక్తిని ఎవరూ ఏమీ చేయలేరు.

ఏదైనా వస్తువు పోగొట్టుకొని పోయినపుడు, 'నా వస్తువుపోయింది' అనకూడదు. తీసుకొన్న వ్యక్తి మంచివాడు కాకపోవచ్చు అయినా ఆ వస్తువు ఎక్కడికి చేరాలని భగవంతుడు సంకల్పించాడో అక్కడికి చేరిందని అనుకోవాలి. మనది కాకుండ పోయినపుడు దాని గురించి విచారించడ

మనవసరం. ఇతరులకి మనం ముఖ్యమైన వ్యక్తిగా కనిపిస్తే మనం నమ్మకూడదు. ఒకవ్యక్తి ఒక విషయంలో జాగరూకత కలిగి ఉండడం సంభవిస్తే అతడన్ని విషయాలలోనూ అదే జాగ్రత్త కలిగి ఉంటాడు.

ఒక వ్యక్తి తన బార్యాబిడ్డలు, స్నేహితులు చిరకాలం జీవించి ఉండాలని కోరితే అది తెలివితక్కువ కోరిక. మన అధీనంలో లేని శక్తులను మనం కోరుకొన్నట్టవుతుంది. ఎవరైనా తన కోరికలేవీ అసఫలం కాకూడదని కోరుకొంటాడనుకోండి అది అసాధ్యం కాదు. మనిషి స్వేచ్ఛ కోరుకొన్న ట్లయితే అతడే కోరికల ఉచ్చులోనూ పడడు. దేన్నీ తప్పించుకోవాలని చూడదు.

మనం ఏదైనా విందు భోజనం (banquet) చేయాడానికి వెళ్ళా మనుకోండి. తినుబండారాలు మనముందు కొచ్చినప్పుడు చేయిచాచి మనకు కావలసినంత తీసుకోవాలి. అది మనముందుకు రాకపోయినా, మన ముందునుండి మనకందకుండ, వెళ్ళిపోయినా దానిగురించి పట్టించు కోకూడదు. ఇదే సూత్రాన్ని భార్యాబిడ్డల విషయంలో సంపద, హోదా విషయంలో అవలంబించాలి. అన్నీ మనముందుంటే కూడ వాటిమీద వ్యామోహం లేకుండ ఉండగలిగితే ఆ వ్యక్తి దైవత్వాన్ని కలిగి ఉన్నట్టు లెక్క.

ఒక వ్యక్తి తన కుటుంబంలో జరిగిన మరణం గురించిగాని, పోగొట్టుకున్న సంపద గురించిగాని, దుఃఖిస్తుంటే మనం సానుభూతి చూపించాలి. మనము అతడితో పాటు దుఃఖించకూడదు. ఎవరూ పందెంలాంటి వాటిల్లో పాల్గొనరాదు. జయాపజయాలు మన చేతిలోలేవు కాబట్టి. ఎవరైనా ఒక వ్యక్తిని సన్మానం చేస్తుంటే, గొప్పగా కీర్తిస్తుంటే, అధికారం కలిగి ఉన్నట్లయితే ఆ వ్యక్తి ఆనందంగా ఉన్నాడని భావించ

నవసరం లేదు. అతడ్ని చూసి అసూయ పడరాదు. గొప్ప హోదా; పదవి ఉన్న వ్యక్తి స్వేచ్ఛగ ఉండలేడు. మన అధీనంలోని విషయాల గురించి మనం పట్టించుకోకూడదు.

ఇతరుల మనలని అవమానిస్తున్నారు; మనపై దాడి చేస్తున్నారు. గేలి చేస్తున్నారు అనుకొన్నామనుకోండి, అది తప్పు. మనకు ఆయా విషయాలపట్ల ఉన్న అభిప్రాయాలే మనల్ని ఆ విధమైన ఆలోచనకు లోనుచేస్తున్నాయి అని తెలుసుకోవాలి. ఆయా సంఘటనల పట్ల తీవ్రంగ స్పందించకూడదు. నిదానంగ ఆలోచిస్తే మనపై మనకు నిగ్రహం కలుగుతుంది.

మన 'మరణాన్ని' నిత్యం స్మరించగలిగితే మనలో విపరీతమైన కోరికలేవీ కలగవు.

జీవితాన్ని ఒక తత్వవేత్త వలె జీవించాలి. ఇతరులని తృప్తి పరచడానికి మనకు బాహ్యమైన విషయాలపై ఆధారపడడం జరిగితే అది మన జీవిత ధ్యేయాన్ని విచ్ఛిన్నం చేసినట్లు భావించాలి.

"నేనెందుకూ కొరగాను, నేను ఏ గౌరవమూ దక్కకుండ అజ్ఞాతంగ ఉండి రాలిపోతాను" వంటి ఆలోచనలు రాకూడదు. గొప్ప స్థాయి, గౌరవం లభించక పోవడమనేదొక లోటు అయినట్లయితే ఆ లోటు లేకుండ జీవించడమే మంచిది. ప్రతి వ్యక్తీ ప్రత్యేకత కలవాడే. ఇతరులకు లేని ప్రత్యేకతలు ఆ వ్యక్తిలో ఉన్నప్పుడు అతడు ఎందుకూ కొరగాని వాడెట్లా అవుతాడు? ఏమి చేసినా, ఎట్లా చేసినా మనం మన నమ్మకాన్ని, మన విధేయతను మరువకూడదు. లక్ష్యసాధనకు హద్దు ఏర్పాటు చేయనప్పుడు, దేనికీ కృంగిపోరాదు. సామాజిక కార్యక్రమాల్లో మనలని కాకుండ ఇతరులని ఎన్నుకొన్నారనుకోండి, ఆ కార్యక్రమాలు మంచివైతే సంతోషించాలి.

మంచివి కాకపోతే మనకవి దక్కలేదని బాధపడకూడదు. ఇతరులు పొగడ్తవంటివాటిని ఉపయోగించి ఏదైనా పొందారనుకొండి, మనకు అటువంటిది దక్కలేదే అని ఎట్లా అనుకోగలం? మనం పొగడ్తలాంటివి చేయలేనప్పుడు ఆ ఇతరులు పొందినవి కాంక్షించడం అవివేకం.

ప్రకృతి ధర్మాలు అందరికీ సమానమే. ఇరుగింట్లోనో, పొరుగింట్లోనో మరణం సంభవిస్తే మనమంతగా బాధపడం. మన ఇంట్లోనే జరిగితే పొర్లి పొర్లి ఏడుస్తాము.

ఎవరికైనా దైవత్వంలో ఆశ్రయం దొరికితే, అది ఎటుదారి తీస్తుందో ఎవరికీ తెలియదనే విషయం గుర్తు పెట్టుకోవాలి. అది దైవగురువుకే తెలుసు. మన అధీనం లేని విషయం గురించి, మనం అది మంచికాదు, చెడూ కాదు అనుకోవాలి. అది మంచయినా, చెడు అయినా మనకందులో ఏ ప్రమేయము లేదు కనుక దానిని విస్మరించడమే మంచిది. అంచేత దైవగురువును కోరిక సఫలమవ్వాలని గాని; విఫలమౌతుందేమోనని భయంతో గాని చేరకూడదు. ఏది జరిగినా అంతా మనమంచికే అనుకునే మనస్తత్వం అలవరచుకొంటే జరిగిన దాన్ని సక్రమంగా వినియోగించుకో గలిగితే, మన దైవాలను మంచి సలహాదారులుగ స్వీకరించగలగాలి. దైవత్వమభ్యసించడానికి జరగబోయ దాని గురించి చెప్పమని, భవిష్యద్వాణిని వినిపించమని అడగనవసరం లేదు. ఒక స్నేహితుడో, దేశమో ప్రమాదంలో ఉన్నట్లయితే మనం వారి సహాయానికి వెళ్ళడం గురించి ఎవరి సలహానూ తీసుకోనవసరం లేదు. మనకది ప్రమాద భూయిష్టమైనా సరే స్నేహితుని కోసం, దేశం కోసం ముందడుగు వేయాలి.

సంకల్పము; అనవసరము వేరు వేరు. మనకు సంకల్పం ఉన్నా, లేకపోయినా 'అవసరాన్ని' తీర్చుకోక తప్పదు. మనం ఎలాగ

బ్రతకదలుచుకొన్నాము అనేది సంకల్పంమీద ఆధారపడి ఉంటుంది, అవసరం మీద కాదు. మనమెన్నో చర్యలు, కార్యక్రమాలు చేపడతాము. వాటిని మనం సంకల్పంతో మన ఇషాయిష్టాల ప్రకారం ఎన్నుకొంటాం. ఎన్నిక అవసరం లేనట్లయితే ఎన్నికేచేయము. మనం స్వేచ్ఛగ ఎన్నుకోవచ్చు అన్నప్పుడు దానిని అవసరం కింద జమకట్టం. అవసరం వేరు, స్వేచ్ఛమైన ఎన్నిక వేరు. తన సంకల్పానికి విరుద్ధంగా బాధ పడుతున్నట్లయితే అది అతని ఎన్నిక కానేరదు. స్వేచ్ఛాయుతమైన ఎన్నికను పోగొట్టుకోలేము.

**అందరి శ్రేయస్సు**

'ఏది మంచి' 'ఏది చెడు' అనేది నీతిశాస్త్రంలో అతిముఖ్యమైన ప్రశ్నలు. వీటి విషయంలోనే చాలా పొరపాట్లు, తప్పులు జరుగుతుంటాయి. 'ఏది మంచి' అనే విషయం కూలంకషంగా; ఏ మాత్రం అనుమానాలు లేకుండ, సరిగ్గా తెలుసుకోవాలి. అది తెలుసుకొంటేనే నీతిని అమలుచేయడం వీలవుతుంది.

'ఇది మంచిది' అని చెప్పేందుకు సరియైన కారణాలు చూపుతుంది నీతిశాస్త్రం. నీతి శాస్త్రం మనకు విజ్ఞానాన్నిస్తుంది, అమలుతో దానికి పనిలేదు.

'మంచిది' గురించిన సిద్ధాంతాలు విడదీసి విశ్లేషించేవి కాకుండా, జతచేసి జోడించేవిగా ఉంటాయి. 'పసుపు' అనే వర్ణన ఎటువంటిదో 'మంచి' అనే వర్ణన కూడ అటువంటిదే. 'పసుపు' అంటే ఏమిటో తెలియని వారికి ఎంత చెప్పినా అర్థం కాదు. ఎన్ని పదాలు వాడినా, ఎన్ని నిర్వచనాలు చెప్పినా 'మంచి' అనేదేమిటో తెలియని వారికి దాని స్వభావం తెలియచెయ్యడం సాధ్యంకాదు. పులికి చారలుంటాయనో, మచ్చలుంటాయనో వర్ణించి చెప్పవచ్చునేమో గానీ మంచిని నిర్వచించడం కుదరదు.

'మంచి' అనబడే వస్తువులు/అంశాలు వేరే ఇతర గుణగణాలు కూడ కలిగి ఉంటాయి. 'మంచి'ని అంటిపెట్టుకొని ఉండే ఆ గుణగుణాలే మంచి అనడం శుద్ధ తప్పు– (Natura listic fallacy)

మనకు కావల్సింది 'మంచి' అంటే ఏమిటి? చాలా మంది దేనిని 'మంచి' అనుకొంటారో అది నిజంగానే 'మంచి' వారి అభిప్రాయం సరైనదే. వారు దేనిని 'మంచి' అంటున్నారో తెలుసుకోడం మనం చేయాల్సినపని.

ప్రతి కళ, ప్రతి పరిశోధన, ప్రతి కార్యక్రమమూ 'మంచి' కోసమే పాకులాడుతాయి. దాన్ని బట్టి మనం 'మంచి' అనేది అన్ని అంశాలకు లక్ష్యము అనుకోవచ్చు అంతిమంగా అన్నింటి లక్ష్యమూ 'మంచే'.

లక్ష్యాల గురించి మాట్లాడినప్పుడు వేరు వేరు కార్యక్రమాలకి వేరు వేరు లక్ష్యాలుంటాయని, ఆయా కార్యక్రమాల్ని బట్టి ఆ లక్ష్యాలు మారుతుంటాయని గుర్తుపెట్టుకోవాలి. మనమొక లక్ష్యాన్నాశించి ఒక కార్యక్రమాన్ని ఏర్పాటు చేసుకోవడం జరిగితే, మనం ఏదో ఒకటి ఆశించి ప్రతిదానినీ ఎన్నుకొంటే అది 'మంచి' అవుతుంది. ఒక కార్యక్రమం యొక్క ఫలితం ఒకవ్యక్తికైనా, ఒక రాష్ట్రానికైనా ఒకేరకంగా ఉండటం జరిగితే, ఒక వ్యక్తికి లభించే దానికన్నా రాష్ట్రానికి సంబంధించినది గొప్పది. దానిని సాధించడమూ, నిలబెట్టుకోడమూ కష్టము. ఒక వ్యక్తికి ప్రయోజనం చేకూర్చడమూ తక్కువదేమీకాదు.

విజ్ఞానము అలాగే తక్కినవన్నీ కూడ 'మంచి' కోసమే పనిచేస్తాయి. రాజకీయ శాస్త్రము 'మంచి'లో ఉత్తమమైన మంచి కోసం, 'ఆనందం' లేదా సంతోషం కోసం పనిచేస్తుంది. ఆనందంగ ఉండడమంటే సవ్యమైన జీవితాన్ని గడపడము, మంచినే చేయడము. 'ఆనందం' అంటే ఏమిటి? దానికి వేర్వేరు నిర్వచనాలున్నాయి. కొందరేమో సంపద, గౌరవము, సుఖము

కలిగి ఉండడం ఆనందమంటారు. కొందరేమో ఆరోగ్యమే మహాభాగ్యము, ఆనందానికి మూలము అంటారు. చాలామంది జీవితాల్ని పరిశీలిస్తే, వారందరూ 'మంచిని' ఆనందాన్ని ఒకే గాటికి కట్టేయడం కనిపిస్తుంది. ఆనందమంటే వారి దృష్టిలో సుఖించడం, భోగించడం. జీవిత పరమావధే సుఖించడం.

ఇందులో మూడు రకాలున్నాయి. 1. భోగించడం 2. రాజకీయం 3. ఆలోచనాత్మకమైనవి. ఎక్కువమంది తమ అభిరుచులలో ఒకరినొకరు బానిసల్లాగ అనుకరించడం కనిపిస్తుంది. భౌతికమైన సుఖాన్నే చాలామంది కోరుకొంటారు.

కొందరు పరువుగా, మర్యాదగా, గౌరవంగా బ్రతకడమే ఆనంద దాయకమని భావిస్తారు. అది రాజకీయతతో కూడిన లక్ష్యం 'మర్యాద' 'మంచి' నేస్తాలని వారి భావన. తమను తమ సద్గుణాన్ని' చూసి విజ్ఞులు గౌరవించాలని కోరుకొంటారు. ఆ విధంగ చూస్తే సద్గుణం అనేదే వీరి లక్ష్యమనిపిస్తుంది. ఇక్కడితో ఈ వాదన ముగియదు. సద్గుణాన్ని కలిగి ఉండటమంటే, నిద్రావస్థలో ఉండడమని; ఏ పనిలేకుండ ఉండడమని, కష్టాలకు కన్నీళ్ళకు గురికావడమనీ అనిపిస్తుంది. ధనం సంపాదించడం ఏమంత 'మంచి' లక్షణం కాదు. డబ్బు ఉపయోగకరము మాత్రమే. డబ్బుతో కొనుగోలు చేసే వస్తువులు, సౌకర్యాన్ని కలిగించవచ్చు, ఆ సౌకర్యాలు సుఖాన్ని కలిగించవచ్చు, కాని అవే లక్ష్యాలు కానేరవు. మంచి అనేది అనేక కోణాలలో ఆవిష్కరించబడుతుంది. పదార్థాలలో మంచి దైవత్వము, తర్కములో విశిష్టతలో సద్గుణం; పరిమాణంలో 'మితం'; సంబంధ బాంధవ్యాలలో ఉపయోగకరం; సమయంలో సరియైన అవకాశం దొరకడం; స్థలంలో సరియైన ప్రదేశం దొరకడం వంటివి. మంచి అనేది అన్నింట్లోనూ ఉంటుందని గాని, ఒకే రకంగా ఉంటుందని గాని చెప్పలేము. అంచేత అది 'ఇదే' మంచి అని ఇదమిద్ధంగా చెప్పలేము.

'మంచిది' కొన్ని స్వతహాగా మంచివి, కొన్ని ప్రయోజనం కలవి. తెలివితేటలు, చూపు; గౌరవమర్యాదలు వాటంతటవే మంచివి. కొన్ని సుఖాలు కూడ స్వతహాగా మంచివే వాటిని మంచి లక్ష్యాలతో అనుసరిస్తే వస్తువులు వేరైనా వాటిలో 'మంచి'– ఒకేరకంగా కనపడాలి. సీసము తెలుపు, మంచు తెలుపు.

గౌరవము, వివేకము, సుఖములలో ఉన్న మంచి వేర్వేరు. వివిధ చర్యలలో, వివిధ విభాగాలలో మంచి భిన్నంగ ఉంటుంది. ఉదాహరణకు మందు కోరే లక్ష్యం ఆరోగ్యము, ఎత్తుగడ కోరేది విజయము; భవన నిర్మాణకళ కోరేదొక మంచి భవనము.

మనం చేపట్టే ప్రతి చర్యా 'మంచి'ని కోరే చేస్తాం. ఒక్కొక్కసారి ఒక 'మంచి'కాకుండ ఎక్కువ రకాల 'మంచి' కలగొచ్చు.

'చెడు' మంచికి వ్యతిరేకం. దానిని నియంత్రించి కట్టడిచేస్తే, దాని ముందు 'మంచి' మరింతగా మెరుస్తుంది. 'మంచి' మీద మనుషులకు మక్కువ మరీ పెరుగుతుంటుంది. 'మంచి', 'చెడులకు' సంబంధించిన కారణాలన్నీ తెలుసుకోవాలి. పొరపాట్లు, తప్పులు చేయకుండ ఉండడానికిది చాలా అవసరం. నిత్యం ఆనందంగా ఉండే ప్రయత్నం చేయాలి, సమస్యలకు దూరం ఉండాలి.

సృష్టిలోని అనేక అంశాలు/విషయాలు కిందనుండి పై వరకు వివిధస్థాయిలలో కనపడే వాటినుండి కనపడని వాటివరకు, భూమి నుండి ఆకాశం వరకు, వరుసక్రమంలో అమర్చబడి ఉంటాయి. ఈ అసమానత్వం వాటి వేరు వేరు ఉనికి కోసమే.

ఒకానొక ప్రతినిధి ఒక మార్గాన్ననుసరించి ప్రయాణిస్తున్నది అంటే ఆ ప్రతినిధి ఆ మార్గంతో ఏదో ఒక ఒప్పందం చేసుకొని ఉన్నట్లు మనమర్థం

చేసుకోవాలి ఆ ప్రతినిధి ఆ మార్గంలో వెళ్ళడమే సరియైనది. ప్రతి ప్రతినిధి మంచికోసమే పనిచేస్తుంది. ప్రతినిధి తాను చేరుకోదలచిన లక్ష్యం చేరుకొంటేనే స్వాంతన కలుగుతుంది. అంతిమంగ అందరూ కోరేది మంచే. మన ప్రతిపనీ మంచికోసమే చేపడుతున్నాం. అంటే మంచి అనేది 'లక్ష్యం' స్వభావాన్ని చేరుకొనేందుకొక చర్య చేపట్టడం జరుగుతుంది. ప్రతినిధి ఎన్నుకొన్న చర్యకూడ మంచిని సంతరించుకొంటుంది. కనుక ప్రతీచర్య మంచికొరకే. తెలివైన ప్రతినిధి ముందే ఒక లక్ష్యాన్నేర్పరుచుకొని దానివైపు పయనం సాగిస్తుంది. మరియొక ప్రతినిధి ప్రకృతి సహజమైన స్పందనతో అడుగులు వేయడం జరుగుతుంది. సహజమైన/ప్రకృతి సిద్ధమైన తపనతో ముందుకు సాగడం జరుగుతంది. అదీ 'మంచి' కొరకే కనుక ప్రతి ప్రతినిధి 'మంచి' గురించే తపిస్తుంది. దీన్నిబట్టి తేటతెల్ల మయ్యేదేమంటే ఏ ప్రతినిధీ చెడు సంభవించాలని కోరుకోదు. ప్రతినిధి ఉద్దేశానికి సంబంధించింది కాదు.

ఒక చర్య ఆశించిన ఫలితం కాకుండ, ఫలితం లోపభూయిష్టంగ ఉండటం జరిగితే ఆ చర్యలోనే లోపాలున్నట్లు అర్థం. కాలికి కుంటితనం కాలి ఎముకను వంచడం వలన జరగొచ్చు. ప్రతినిధి తనకున్న శక్తి ప్రకారం పనిచేస్తుంది కాని లోపాల ప్రకారం పనిచేయదు. లోపాలవలన ఫలితం సరిగ్గా రాకపోతే ప్రతినిధి ఉద్దేశం తప్పుకాదు. కనుక 'చెడు' ప్రతినిధి ఉద్దేశంతో సంబంధం లేకుండ ఉత్పన్నమయ్యిందని అర్థం.

ఏ ప్రతినిధీ 'చెడు' జరగాలని కాని 'చెడు' జరుగుతుందేమో అని కాని ఉద్దేశించదు. మంచే జరగాలని కోరినా చెడు కూడ జరగడం జరిగితే అది ప్రతినిధి ఉద్దేశానికి సంబంధం లేదు.

పైన ఉదహరించిన విషయాలను పరికిస్తే 'చెడు'ను 'మంచే' సృష్టిస్తుంది. చెడు చెడును సృష్టించగలదు, కాని అది మంచిసాయంతో

తప్పు పనిచేయలేదు. ఏ పని చేయడానికైనా కారణం నిర్దిష్టమైనది కావాలి. చెడు నిర్దిష్టమైనది కాదు. చెడు అంటూ సంభవిస్తే అది 'మంచి' వల్లే జరగాలి.

ప్రతీ కారణమూ ఒక స్వరూపము, ఒక లక్ష్యము కలిగి ఉండాలి. ఒక ప్రతినిధి వలె వ్యవహరించాలి. 'చెడు' కి ఆ లక్షణాలేవీ లేవు. కనుక అది హేతువు కాజాలదు. ప్రతినిధీ కాజాలదు, లక్ష్యము కాజాలదు. 'మంచి' ఒకటే ఆ లక్షణాలు కలిగి ఉన్నది. అదే 'చెడు'ను కూడ సృష్టిస్తుంది.

నీతి నియమానుసారం నైతికలోపం శక్తిలోటుపాట్ల వలన కలుగుతుంది. నైతికలోపం ఐచ్ఛికమే కాని తప్పనిసరిగ రుద్దబడిందికాదు. నైతిక లోపం కార్యాచరణలో కనిపిస్తుంది కాని ఫలితంలో కనపడదు. ఎందుకంటె నైతిక కళంకం ఒక పనిచేయడానికి సంబంధించినది, నైతిక కళంకం స్వరూపానికి గాని, పదార్థానికి గాని సంబంధించినది కాదు.

నైతిక చర్యలలో నాలుగు సూత్రాలిమిడి ఉన్నాయి. మొదటిది, ఏదైనా ఒక విషయం కలతచెందేది గుర్తింపబడడం, రెండవది భవిష్యత్తు గురించి భయపడే అనుభూతాత్మక శక్తి. మూడవది సంకల్పం. నాలగవది కార్యాచరణకి సంబంధించినది.

ఏ శక్తి కార్యాచరణకి పూనుకొంటుందో అది మంచి చెడులమధ్య నున్న తేడాని తెలుసుకొంటుంది. బాహ్యమైన ఈ చర్యలు ఐచ్ఛికమైతే తప్ప ఈ విభాగానికి చెందవు. సంకల్పచర్య మంచిదైతే బాహ్యాచర్య మంచి గాను, చెడ్డదైతే బాహ్యాచర్య చెడ్డది అవుతుంది. సంకల్పానికి సంబంధం లేకుండా బాహ్యాచర్య లోపభూయిష్టమైనదైతే నైతిక కళంకాని కెటువంటి సంబంధమూ ఉండదు. కుంటితనం నైతికమైన కళంకం కాదు. ఇటువంటి లోపం నైతిక కళంకాన్ని తగ్గిస్తుంది. కనుక నైతికలోపం సంకల్పానికి

సంబంధించినదే. ఎందుకంటే అది ఐచ్ఛికమైనది. ఆ విధంగా తప్పు జరగడానికి మూలకారణం సంకల్పంలోనే ఉంటుంది. సంకల్పంలో లోపమెప్పుడు కలుగుతుందంటే, ఆలోచన సహేతుకం కాకపోయినా, సరియైన లక్ష్యం లేకుండా పోయినా.

ప్రతి పనికి ఒక ధ్యేయముంటుంది. ప్రతి సంకల్పానికి ఒక ఆశయం ఉంటుంది. కొన్నిసార్లు ఒకపనికి ఒకటి కాక అనేక ఫలితాలు, వివిధరకాల ప్రయోజనాలు కలగడం కద్దు. ఒక చర్యకు నాంది పలికేది మట్టుకు ఖచ్చితమైన ధ్యేయం దిశగా కాకుండ ఇంకొక దిశలో చర్య కొనసాగితే అది నైతికమైన తప్పుగ పరిణమిస్తుంది.

ఆలోచన సహేతుకం కాకపోయినా; ఆ సరియైన లక్ష్యం లేకపోయినా సంకల్పంలో లోపం కలుగుతుంది. ఒకపనికి సంకల్పించాలా వద్దా అనేది సంకల్పబలంలోనే ఉంది. అది అనువుగాని లక్ష్యాన్ని ఛేదించాలని అనుకోనంత కాలము దానిలో నైతికమైన చెడు ఏదీ ఉండదు. ఆ విధంగా చూస్తే ప్రకృతి సిద్ధంగాను, నైతికంగాను కూడ చెడు పొరపాటుగ మంచినుండే ఉద్భవిస్తుంది.

ప్రకృతిలో ఆనందానుభవం ఆచరణలో తెలుస్తుంది. ఇతరత్రా తెలియదు. ప్రకృతి సహజమైన ఆనందాలు అంతిమ లక్ష్యాలు కానేరవు. ఉదాహరణకు తిండి ద్వారా, లైంగిక చర్య ద్వారా కలిగే ఆనందం ఆ అనుభవం కలిగినపుడు మాత్రమే తెలుస్తాయి. అవే అంతిమ ఆశయాలుకావు. ఎందుకంటే అవి మనిషిలోని అత్యున్నతమైన ఉదాత్త భావాలను వ్యక్తపరిచేవి కావు. అవి అతడి ఇంద్రియాలకు మాత్రమే సంబంధించినవి. అంచేత ఇటువంటి ఆనందాలని అత్యున్నత లక్ష్యాలుగ భావించలేము.

తిండి, లైంగికచర్య వంటి ఇంద్రియసుఖాలు తుచ్ఛమైనవి; పశువులకు మనుషులకు కూడ అవి దాదాపు సమానం. వాటిని పొందడం మనిషిలోని ఔన్నత్యాన్ని తెలుపవు కనుక అటువంటి ఆనందాలు క్షణికాలు, ఉన్నత మైనవి కావు.

అధికారం, హెూదా మనిషి మంచితనాన్ని, గొప్పతనాన్ని సూచించవు. పైగా అవి స్థిరంగ ఉండవు. అదీకాక అధికారం, హెూదా చెడ్డవారిని కూడ వరించొచ్చు. మనిషి తానుగ చేసే ఉత్తమమైన పనులు ద్వారా ఉత్తముడుగా పిలువబడుతాడు. కాని అధికారం, హెూదాల వలన కాదు.

మనిషి ఉత్కృష్టత అతడి శరీర సౌష్టవంలోగాని, అందంలో గాని, బలంలోగాని ఉండదు. మంచివారికి, దుర్మార్గులకి కూడ ప్రత్యేకత లుండొచ్చు. ఇవి కూడ అస్థిరమైనవే వాటికి సంకల్పబలానికి సంబంధం లేదు. ఇవి కేవలం శారీరకమైనవి. ఆత్మకు సంబంధించిన 'మంచి' శరీరానికి సంబంధించిన వాటికంటె గొప్పది. ధ్యానము, అవగాహన ఆత్మకు సంబంధించినవి. అందము, బలము, శారీరక దర్పము వంటివి మనిషి కంటె కొన్ని జంతువులకే అధికంగా ఉండడం గమనించవచ్చు. వాటిని బట్టి జంతువు మనిషి కంటె గొప్పదనాల్సి వస్తుంది. కాని అది సరియైనది కాదు. మనిషిని మంచివాడిగా పరిగణించడానికి ఇవేవీ లెక్కలోకి రావు.

మనిషి అత్యున్నతమైన ఆనందం అతడి నైతికతలోనూ లేదు. ప్రతి నీతి వెనుక ఇంకొక సూత్రముంటుంది. శాంతిని లక్ష్యంగా చేసుకొని న్యాయాన్ని కోరుకొంటాం. ఒక లక్ష్యం కోసం ఆనందాన్ని కోరుకోలేము. నైతికమైన సుగుణాలు కూడ మనిషికి పూర్తిస్థాయి ఆనందాన్నివ్వలేవు. ఇవి ఇతర అంశాలపై ఆధారపడి ఉంటాయి కనుక ఇవి అంతిమంగ ఆనందాన్నివ్వడం జరగదు.

'మంచి', 'చెడు' అనేవి కేవలం మన ఆలోచనలని బట్టి, అనుభూతిని బట్టి నిర్ణయింపబడుతాయి. ఒకే విషయం; లేదా ఒకే అంశం సందర్భానుసారంగ 'మంచి' కావచ్చు చెడు కావచ్చు. సంగీతం చెవిటివాడికి వినిపించదు కనుక అది 'మంచి కాదు, చెడుకాదు. ఆప్తుల మరణానికి దుఃఖించే సమయంలో సంగీతం ఆనందాన్నివ్వలేదు. మనిషి ఆహ్లాదంగ శాంతియుతంగ ఉన్నప్పుడు మాత్రమే ఆనందాన్నివ్వగలదు.

పై అంశాలన్ని పరిశీలించినప్పుడు అవి మనిషి ప్రవర్తనని ఏ విధంగ నిర్దేశిస్తాయో, ఆ ప్రవర్తనను మనమే విధంగ అంచనా వేయొచ్చో తెలుస్తుంది. మనం 'ఉత్తమము' అని ఒక ఆదర్శాన్ని లక్ష్యంగ ఎంచుకొన్నపుడు, ఏ ఏ మార్గాలు ఆ లక్ష్యానికి చేరువకు తీసుకొని వెళ్ళగలవో అవన్నీ 'మంచివి', ఏవి దానికి దూరం చేస్తాయో అవి 'చెడు'. 'సంపూర్ణత', 'అసంపూర్ణత' ఈ విధంగానే విశదమౌతాయి.

మనసుకు సంబంధించినది, ఆలోచనా పరిపుష్టితో నిండినది అయిన కార్యాచరణ మంచిది. మన మనసుకు కాకుండా బాహ్యామైన విషయాలపై ఆదారపడినవి జడస్థితిగతులు. మన చర్యలు మనశక్తిని, జడస్థితి మన చేతగానితనాన్ని సూచిస్తాయి. మనిషి ఆలోచనామృతంతో నిండిన పనులు మంచివిగా సవరణమిస్తాయి. తక్కినవి మంచీ కావచ్చు కాకపోవచ్చు. మన మేధాశక్తిని సాధ్యమైనంతవరకు సమగ్రవంతం చేయాలి. అందులోనే మనిషికత్యున్నత ఆనందముంది. మనశ్శాంతి కలిగి ఉండడమే అన్నిటికంటె గొప్పవరము. అది దైవానుగ్రహం వలన సాధ్యము. సమగ్రమైన మేధస్సు మాత్రమే దైవాన్ని పూర్తిగ అర్థం చేసుకో గలుగుతుంది. మనిషి తన కోరికలన్నిటిని నియంత్రించే కోరిక ఏమిటంటే తనను తాను, ఇతరమైన అన్ని విషయాలను చక్కగా అవగాహన చేసుకోగలగడటమే.

తెలివి, మేధ లేని హేతువులేదు. మనిషి ఆనందించగలిగింది మేధస్సు ద్వారా నిర్ణయింపబడిన జీవితం మాత్రమే. మనిషి తన మేధోశక్తిని పరివృష్టం చేసుకోడానికి అడ్డంకులు కలిగించేవే చెడుగుణాలు. మేధస్సు ద్వారా మనిషి తనను సమగ్రంగ తీర్చిదిద్దుకోగలడు. యుక్తమైన జీవితాన్ని అనుభవించ గలడు. హేతువే మనిషిని నడపగల మార్గసూచి. ప్రతి ఉద్దేశానికి, ప్రతి ఆలోచనకు ఒక ఆశయముంటుంది. ఆ ఆశయసాధన కోసమే మనమూ ప్రతిపాదన చేస్తాం; కార్యాచరణ చేపడతాము. అనుకోని విధంగా మనమనుకొన్న, ఆశయంతో పాటు మరికొన్ని ప్రయోజనాలు సిద్ధించా యనుకోండి అవన్నీ మన లక్ష్యాలు కావు. కానేరవు. మనం ఏ ఆశయం కోసం ఉద్యమం చేపట్టామో అదొక్కటే ముఖ్యమైనది. ఇతర ప్రయోజనాల కోసం కాకుండ ఆ ఒక్క ముఖ్యమైన ఆశయం కోసమే మనమాచర్య చేపట్టడం జరిగింది. మరొక దానికోసమది కాదు. దానికోసం మాత్రమే మనం ఆశిస్తాం. సంతోషం/ఆనందం– అవే మన లక్ష్యాలు; మరొకటి, మరొకటి కావు. గౌరవం, సుఖం, హేతువు వంటి సుగుణాలు మనకు ఆనందాన్నందిస్తాయి. అందుచేత వాటిని కోరుకొంటాము. ఆనందమే మన పరమావధి ఆ సుగుణాలు ఆనందాన్నిచ్చేందుకు దోహదపడతాయి. అంచేత అవి కావాలి. అంతేకాని ఆనందం బదులు వాటిని కోరుకోము.

అంతిమ లక్ష్యం సంపూర్ణమైనది, తిరుగులేనిది; దానిని ఏ ఇతర ప్రయోజనాలతోనూ పోల్చలేము. అది దానంతటదే స్వయం సమృద్ధం. స్వయం సమృద్ధమంటే ఒక వ్యక్తికి మాత్రమే కాకుండా, అతడి కుటుంబానికి, అతడి స్నేహితులకు, అతడున్న సమాజంలోని ఇతర సభ్యులకు అందరికి ప్రయోజనం చేకూర్చేదై ఉండాలి. జీవితం అందరికి ఆమోదయోగ్యము, ఆనందదాయకము అయినట్లైతే అది స్వయం సమృద్ధము. ఆనందం అటువంటి అంతిమ ఆశయం.

ఆనందాన్ని పొందేదెలాగ? చదువు; అభ్యాసము; తర్ఫీదుల వలన సాధ్యమా? లేదా దైవానుగ్రహమా? ఏదేమైనా భగవంతుడు మనిషికిచ్చిన కానుకలన్నిటిలోకి ఆనందం తలమానికమైనది. దైవంతో సమానమైనది. సుగుణవంతులు తమ ప్రయత్నంతో ఆనందాన్ని పొందవచ్చు. అనుకోకుండానో, అకస్మాత్తుగానో కలిగే ఆనందం కంటే ప్రయత్న పూర్వకమైనదే మంచిది. అదృష్టానికో, విధికో ఆనందాన్ని కట్టబెట్టడం చాలా పొరపాటు. ఆనందం మనిషి జీవితధర్మం. అది అతడి శరీరానికి, మేధస్సుకి, ఆత్మకి సంబంధించినది. మంచి అనేది కూడ ఆ వ్యక్తికున్న సుగుణానికనుగుణమైనది; ఆత్మకు సంబంధించిన చర్య అది.

బాహ్య ప్రపంచము, శరీరము వీటికి సంబంధించి మనం ఆనందం కోసం స్నేహితుల్ని, సంపదని, రాజకీయ బలుపుని ఆయుధాలుగా/ పనిముట్లుగా వాడుతాము. అందుకని కొందరు ఫలానా వారిది 'మంచి పుట్టుక' అని; పిల్లల్ని 'మంచి పిల్లలు; ఫలానావారికి అందముందని అంటూంటారు. మరికొందరు 'సుగుణమే' అదృష్టమని అంటారు. ఆనందం మేధో ప్రవృత్తికి ఆలంబనగా ఉంటుంది. అదే దాని స్వభావం. ఆకలి అనేది అన్నిట్లోను ఉంటుంది. ఒక్కొక్క దానిలో ఒక్కొక్క విధంగా వ్యక్తమవుతుంది. ఎందుకంటే అది జ్ఞానానికి సంబంధించినది. ఇంద్రియాలకు సంబంధించినది. జ్ఞానం లేనిచోట ప్రకృతి సిద్ధమైన ఆకలి మాత్రమే ఉంటుంది.

శారీరకమైన ఆకలి, లైంగికమైన కోరిక ఇవే శరీరానికి సంబంధించిన ఆనందాలు. ఇవి ఏ మాత్రమూ ముఖ్యమైనవి కావు. మేధస్సుకు సంబంధించినవి మాత్రమే ప్రధానమైనవి. మేధస్సుకున్న ఆకలిని తీర్చగలిగినప్పుడే ఆనందం లభిస్తుంది.

ఆనందం ఆత్మకు సంబంధించినది. అది మనిషి సుగుణానికి సంబంధించినది. సుగుణం మనస్సుకు/ఆత్మకు సంబంధించినది. శరీరానికి సంబంధం లేనిది.

మనిషి జీవితంలో అత్యున్నతమైన ఆశయం; లక్ష్యము భగవద్ సంకల్పం. సర్వోత్కృష్టమైన మేలు – అదే భగవంతుని అనుగ్రహం.

ముగింపుగా పలికేది ఒకటే. మనిషికి ఆనందం చేకూర్చే సత్యాన్వేషణ మాత్రమే. అదొక్కటే సరి అయినది. ఇది మనిషికి మాత్రమే పరిమితమైనది. ఇది స్వయం సమృద్ధమైన ఆశయం; దానికదే సాటి. దానికి ఇంకొక ఉ ద్దేశం లేదు. ఈ ఆశయ సిద్ధికోసం మనిషి బాహ్యామైన విషయాలమీద ఆధారపడనవసరం లేదు. ఇదే అన్నింటి లక్ష్యము, పరమార్థము. మానవ జీవిత పరమావధి సత్యాన్వేషణ ఒకటే; జ్ఞానచింతన, సత్యాన్వేషణ మాత్రమే ఆధ్యాత్మికమైన లక్ష్యాలు.

అధ్యాయం 11

# ఆధ్యాత్మిక జీవనం

## ఆధ్యాత్మిక మార్గదర్శి

యుగయుగాలుగ జ్ఞానమార్గంలో పయనించే అన్వేషకుడు ఆ మార్గంలో అతడిని నడిపించే గురువు, ధ్యానమార్గంలోనూ, దీక్షామార్గం లోనూ ప్రాముఖ్యం వహించారు. అన్ని మార్గాలలోను ఆధ్యాత్మిక గురువు యొక్క ఆవశ్యకతను నొక్కి వక్కాణించడం జరిగింది. అన్వేషకుడు ఆధ్యాత్మిక మార్గంలో ఏ స్థాయిలో ఉన్నాడో అతడికి రాబోయే విపత్తులు అడ్డంకులేవో చెప్పగలిగిన శక్తి కలవాడు గురువు.

ఆధ్యాత్మిక మార్గంలో అనేక సంప్రదాయాలున్నాయి. ఏ సంప్రదాయం ప్రత్యేకత దానిదే. తాను ఏ సంప్రదాయానికి చెందినవాడో ఆ సంప్రదాయంలో బోధన, రీతి రివాజులు గురువుకి పూర్తిగ అవగాహన ఉండడం జరుగుతుంది. ఈ సంప్రదాయాలలో కొన్ని లిఖితపూర్వక శాస్త్రాలు, కొన్ని మౌఖిక సాంప్రదాయాలు ఉన్నాయి. ఒక గురువు నుండి తన శిష్యుడికి, ఆ శిష్యుడు గురువుగా పరిణమించినపుడు అతడి శిష్యుడికి ఆధ్యాత్మిక సంపద ఒక పరంపరగా కొనసాగుతుంది. ఈ గురుశిష్య పరంపర పద్ధతి అన్ని సాంప్రదాయాలలోనూ ఉన్నది.

ఆ గురుశిష్యుల మధ్యనున్న సంబంధం; వారసత్వం రక్తసంబంధమైన వారసత్వం కంటే ఏ విధంగానూ తక్కువకాదు. సోక్రటీసును ఆదర్శమైన గురువుగా ఎంచుకొని kierkgaard అనే తత్వవేత్త మనిషికి మనిషికి మధ్యనున్న సంబంధబాంధవ్యాల పరిణామంలో ఈ గురుశిష్య సంబంధం అత్యున్నతమైనది అంటాడు. సోక్రటీసు తన శిష్యుడికి పురుడుపోసే

మంత్రసాని పనికి ఎందుకు పూనుకొన్నాడంటే మానవసంబంధాలలో అన్నింటి కంటె ఇది ఉత్కృష్టమైనది అని కూడ విశదీకరిస్తాడు kierkgaard.

ఈ విశ్వ వ్యవస్థలలో గురువుది మధ్యస్థానం. అతడిని గురువనండి, మంత్రసాని అనండి, బోధిసత్వుడనండి అతడి స్థానం మధ్యస్థమే. సువ్యవస్థితమైన ఈ బ్రహ్మాండంలో అన్నింటికంటె అగ్రభాగానుండేది బ్రహ్మ పదార్థము. స్వచ్ఛమైన ఆత్మ (ఆకాశము లేదా) అంతరిక్షం పైన; అడుగు భాగంలో భూమి ఉంటుంది. దీక్ష ఇచ్చిన శిష్యుడికి దీక్షకనర్హుడనుకొన్న వ్యక్తికి పైన, అగ్రభాగానికి నడుమనుండేది గురువు.

ఆకారంలేని అంతరాత్మ ప్రభోదానుసారం పయనించే మోక్షగామి గురించి అన్ని సంప్రదాయాలు చేప్తాయి. బాహ్యామైన, భౌతికమైన గురువును సంప్రదించకుండ కేవలం అంతరాత్మనే గురువుగా స్వీకరించడం చాలా అరుదు.

తన అంతర్గతాన్ని తానే తెలుసుకోజాలని వ్యక్తి, తనంతట తాను తనలోని ఆధ్యాత్మిక కాంక్షను తెలుసుకోలేని వ్యక్తి  ఒక గురువు నెన్నుకొని అతడి సాయంతో తనలోకి తానెలా తొంగిచూడాలో తెలుసుకోవాలి. కాని మొట్టమొదట అతడిలో జ్ఞానాభిలాష కలగాలి. అది కలగకుండ గురువునెన్నుకొని కూడా ప్రయోజనముండదు. ముందుగా తనలోనే ఇమిడి ఉన్న గురువుని గుర్తించగలగాలి. ఆ విధంగా గుర్తించగలగడమే మోక్షమార్గ ప్రయాణంలో మొదటి మజిలీ.

పైతాగరస్, సోక్రటీసుల జీవన విధానాలను గమనిస్తే ఆధ్యాత్మిక గురువు అనబడే వ్యక్తి కేవలం మతపరమైన విషయాలలోనే కాకుండా, ఇతర రంగాల, వ్యాసంగాల, బోధనల విషయంలో గూడ మార్గదర్శకత్వం

నిర్వహించడం, స్వీయ పరిణామానికి; తమ తోటివారిలో ఆధ్యాత్మిక చైతన్యం కలిగించడానికి అతడు ప్రముఖంగా ప్రయత్నించాలి.

పైతాగరసు సిద్ధాంతం ప్రకారం అగ్రభాగాన భగవంతుడు, క్రింద మానవుడు నడిమధ్య ఆధ్యాత్మిక గురువు ఉండటం జరుగుతుంది. ఐహికానికి, భౌతికానికి మధ్యనుండేది పైతాగరస్ వంటి గురువు. పైనున్న శక్తిని స్వీకరించి తన క్రిందనున్న శిష్యులకు పంపిణీ చేసేవాడు గురువు.

క్రైస్తవ సంప్రదాయంలో క్రీస్తు ఆ గురువు స్థానంలో ఉండి తన శిష్యులను చేరదీసి వారికి బోధించడం, వారిని సన్మార్గంలో నడిపించడం మనం చూస్తాము. శిష్యులతడి సహవాసంలో ఉండి, అతడి ప్రభోధనలు విని; అతడి చర్యలను గమనించి, అతడిని అనుసరించడం మనకు తెలుసు.

క్రీస్తు ఒకడే మనిషిలోని అంతరాత్మని మేల్కొలిపి, అతడిని మోక్షమార్గంలో నడిపిన గొప్ప ఆధ్యాత్మిక గురువు క్రీస్తుకు సాటి మరొకరు లేరు. ఆ తరువాత కాలంలో క్రైస్తవ సాంప్రదాయంలో ఆధ్యాత్మిక గురువులుగ ఉండడం చాలా కష్టతరమైనదని, కఠినమైనదని భావించడం జరిగింది. అదే విధంగా గురువులలో కొందరు మోసగాళ్ళు అయ్యే ప్రమాదముంది కనుక వారి జోలికి పోకుండా ఉండడం మంచిదని భావించడమూ జరిగింది.

ఇస్లాం సంప్రదాయంలో సూఫీ గురువు, బౌద్ధ గురువు వలె ఎంతో మంచి దేహదారుఢ్యము, ఉత్సాహము, జీవశక్తి, మనోబలము కలవ్యక్తి.

shari'ah (షారియా) అందరు ముసల్మానులు ఆచరించాల్సిన పవిత్ర సూత్రాల సమాహారం. దానికి అగ్రభాగానుండేది tarigah (తరీఖా) ఆ మార్గంలో పయనించాలనుకొనే వ్యక్తిని murid (మురీద్– అనగా ఆధ్యాత్మిక

మార్గంలో పయనించాలని నిర్ణయించుకొన్నవ్యక్తి) అతడి గురువు shaykh or pir. ఏ గురువూ లభించకపోతే సైతాను అతడి గురువయ్యే ప్రమాదముంది.

గురువు శిష్యుడు ఏ విధంగా ప్రవర్తించాలి అనేది బోధిస్తాడు అందరికి ఒకే మూసకట్టు బోధనలు చేయకపోవచ్చు. మోక్షగాములైన తమ శిష్యులు మనస్తత్వాలని, వారి శక్తియుక్తులను గ్రహించగలిగి ఉండాలి గురువు; ఆ ప్రకారమే వారిని నడిపించాలి. ఏ విధంగా గద్ద, ఒక పిచ్చుక మీద వాలుతుందో అంతే శక్తి కలిగి, శిష్యుని మనసు జయించగలిగి, అతడికి మార్గనిర్దేశము చేయగలిగి ఉండాలి.

సూఫీ తత్వంలో ప్రతి మనిషికి ఒక ఆధ్యాత్మిక గురువు ఉండడం ఆవశ్యకము. సూఫీమతంలోని మూల సిద్ధాంతాలలో ఒకటి గురువు ననుసరించి పయనించడం. సూఫీ మత గురువైన Abu said Idn Abi at khar జీవిత చరిత్ర గమనిస్తే మనకొక విషయం తెలుస్తుంది అదేమిటంటే ఎవరైనా ఒక వ్యక్తి కఠినమైన నియమాలు పాటించి, కఠోరమైన సన్యాసాశ్రమ జీవితం గడిపి ఏ గురువు సహాయము, మార్గదర్శకత్వమూ లేకుండానే ఉన్నత ఆధ్యాత్మిక స్థాయిని పొంది; మార్మికమైన శక్తులను పొందినా, ఆ వ్యక్తిని సూఫీలు తమవాడిగ పరిగణించరు.

ధ్యానం వంటి ఆధ్యాత్మిక కార్యక్రమాలలో తర్ఫీదుపొంది విరాగి అయిన గురువు ఆయా కార్యక్రమాలను తన శిష్యులకు నేర్పేపనిలో నిమగ్నుడై ఉంటాడు. ఉపవాస దీక్ష, జాగారం, ఇతరత్రా ఆధ్యాత్మిక కార్యాలను ఏ విధంగా నెరవేర్చాలో నేర్పించడం కూడ గురువు విధి. ఇవన్నీ చేస్తున్నప్పటికి సామాన్యులవలె అతడు కూడ వ్యాపారం, వర్తకం చేస్తాడు. అందరితో కలసి తినడం, నిద్రించడం చేస్తాడు. వివాహం చేసుకొని గృహస్థు జీవితం గడుపుతాడు.

కొన్ని భారతీయ సంప్రదాయాలలో గురువునే దైవ సమానంగ పూజించడం కద్దు. మరికొన్ని సంప్రదాయాలలో భక్తునికి, భగవంతునికి మధ్యన అనుసంధాన కర్తగ భావిస్తారు. బౌద్ధంలో గురువు తప్పనిసరిగ శీలవంతుడై ఉండాలనే నియమముంది. మోక్షగామియై ఉండాలని కూడ నమ్మకముంది. గురువంటేనే సన్మార్గుడైన మిత్రుడని పేరు. అతను తన స్వానుభవంతో సాధించిన పరిజ్ఞానాన్ని తన శిష్యులకు చేరవేయడం జరుగుతుంది. శాక్యముని అయిన గౌతమబుద్ధుడు తనని తాను తన శిష్యగణానికి 'ఆప్తమిత్రుడిగానే అభివర్ణించుకొంటాడు. తన శిష్య పరమాణువులను పుట్టుక, ముసలితనం, రోగము, మరణముతో కూడిన జీవితము నుండి విముక్తి కలిగించే మార్గదర్శిగా తెలియచేసుకొంటాడు.

పలు ధర్మసందేహాలతో వేధింపబడిన సిద్ధార్థుడు తన సందేహాలను తీర్చే గురువుల కోసం వెతుకుతు అరణ్యమార్గము ననుసరించాడు. ఎందరో గొప్ప ఋషుల శుశ్రూష చేసాడు. మహామునుల బోధనలు విన్నాడు. వారు ఆదేశించిన నియమాలన్నీ ఆచరించాడు. అయినా అతడి ఆధ్యాత్మిక దాహం తీరలేదు. తృప్తి కలగలేదు. తనంతట తానే మోక్షసాధనకై తపస్సు నాచరించాడు. అతడి తపస్సు ఫలించి దివ్యజ్ఞానం కలిగిన తరువాత చాలా దినాల వరకు అతడు ఆ సమాధి స్థితిలోనే ఉండిపోయాడు. తనకు కలిగిన జ్ఞానప్రాప్తిని జనసామాన్యానికి అందచేస్తే ఏ విధమైన అనర్థా లెదురవుతాయో అని యోచిస్తూ ఉండిపోయాడు. ధ్యాన సముద్రుడై అందరికి దూరంగా ఉండాలని ఒంటరిగ తపస్సులో ఉండిపోవాలని తలంచిన అతను ఆ ఆలోచనను విరమించుకొని తన జ్ఞాన సంపదను అందరికి బోధించాలని, జనసామాన్యానికి గురువుగా, మార్గదర్శిగా ఉండాలని నిర్ణయించుకొని ఆ మర్గా న్ననుసరించాడు. సత్యాన్వేషణ చేసే శిష్యులకు పరమ గురువుగ అవతరించాడు. బౌద్ధం ఆ సాంప్రదాయాన్నే కొనసాగిస్తున్నది.

బౌద్ధంలోని మహాయాన సాంప్రదాయ ప్రకారం దివ్యజ్ఞానం కలిగిన బోధిసత్వుడు తన మోక్షం కొరకు తపించడం కాకుండ ఇతరులను మోక్షమార్గంలో నడిపించడమే తన ప్రధాన కర్తవ్యంగ భావిస్తాడు. 'ప్రజ్ఞ' సాధించి చైతన్యవంతుడైన బోధిసత్వుడు ఇతరుల శ్రేయస్సుకొరకు 'ఉపాయం' ద్వారా పాటుపడతాడు 'ప్రజ్ఞ' 'ఉపాయము' రెండూ ముఖ్యమే. ఒకటి లేనిదే మరొకటి సాధ్యం కాదు. భవబంధాలనుండి విముక్తి సాధించాలంటే ఈ రెండింటి సమన్వయము ఎంతో ముఖ్యము. కరుణతో ఇతరులకు మార్గదర్శకం వహించడం ద్వారా బోధిసత్వుడైన వ్యక్తికి కూడ ప్రయోజనం కలుగుతుంది. అతడు ఆధ్యాత్మికంగా ఎదగడం జరుగుతుంది.

బోధిసత్వుడు అనగా జ్ఞానసిద్ధి పొందినవాడు. అటువంటి వ్యక్తి ఈ లోకపు భ్రమలు, మోహజాలాల నుండి విముక్తి పొందినవాడై ఉంటాడు. గురువుకుండవలసిన లక్షణాలన్ని అనగా బోధించవలసిన అంశాల ఎరుక; బోధపరిచే దురంధరత; మార్గదర్శకత్వం వగైరా అతడిలో పుష్కలంగా ఉంటాయి. తన జ్ఞాననేత్రంతో అతడు శిష్యుడి అంతరంగంలోకి తొంగిచూసి, శిష్యుడి శక్తి సామర్థ్యాలను అంచనా వేసి, తదనుగుణంగ శిష్యుడిని మలచగలిగి ఉంటాడు.

బౌద్ధంలో గురువు స్థానం ప్రముఖమైనది (నలందా స్థూపం?) గురువు గురించి ఇలా చెప్పబడినది.

బుద్ధుని (ముందు) పూర్వం ఎవరైనా గురువు ఉండెనో లేదో, వేల కల్పాలలోని బుద్ధులు గురువు ద్వారానే ప్రకటితమయ్యారు.

ప్రతి సాంప్రదాయంలోనూ ఆధ్యాత్మిక అన్వేషణలో గురుశిష్య పరంపర; మౌఖిక బోధన ముఖ్యపాత్ర వహించాయి. జెన్ బౌద్ధం (Zen Buddism) ఈ సూత్రం మీదే ఆధారపడి ఉంది. చైనాలోని Ch'an ప్రవక్త బోధిధర్మ ప్రకారం; గురు శిష్య పరంపర ఈ విధంగ సాగేది.

మాటలతో, పదాలతో పనిలేదు.
కలుగును నేరుగ ఆత్మ సంపర్కం.
తొంగి చూసికొనును తనలోకి తాను
అంది పుచ్చుకొనును తథాగత్వము

Hui - reng మరణం నుండి తొమ్మిదవ శతాబ్దంలోని బౌద్ధం యొక్క అంతిమదశ వరకు Ch'an (ప్రవక్త) బోధనలు ఉచ్ఛదశలో ఉండేవి. ఆ గురువులు తమ శిష్యులను తమ విపరీత ధోరణులతో (ఒక్కొక్క తడవ హింసాత్మకమైన) ఆకట్టుకొనేవారు.

అటువంటివారిలో Ma-tsu (d 786) ఒకరు. అతడిది భారీకాయము. అతడు ఎద్దువలె రంకె వేసేవాడు, సింహం వలె గర్జించేవాడు. అతడే 'హెూ' అనే అరుపును ప్రవేశపెట్టాడు. అతడి గురించి ఒక కథ ప్రచారంలో ఉంది. అతడు తన శిష్యుడొకడితో సంభాషించిన పిదప శిష్యుడి నాసికను గభాలున పట్టుకొని దానిని గట్టిగా పిండేసరికి, ఆ శిష్యుడు బాధతో గట్టిగ అరవడం జరిగింది. ఆ వెనువెంటనే అతడికి జ్ఞానోదయమయ్యింది. అదే సాంప్రదాయానికి చెందిన Lin - chi అనే గురువు తన శిష్యులలో జ్ఞానోదయం కలిగించేందుకు విపరీతమైన పద్ధతులను పాటించేవాడు. గట్టిగ, బిగ్గరగ అరవడంతోపాటు తన శిష్యులను విపరీతంగా కొట్టేవాడు. ప్రవచనాలు, బోధనలు, ఎన్ని కొనసాగించినా రాని 'జ్ఞానోదయం' ఈ దెబ్బలతో వచ్చి తీరుతుందని Lin - chi నమ్మకం; అతని అనుభవం.

Hakuin అనే గురువు జపానులో zen సాంప్రదాయానికి చెందిన వారిలో ముఖ్యులు. ఆయనిలా అంటారు. 'పతనావస్థలో నున్న ఈ కాలంలో ధర్మం పూర్తిగ తుడిచిపెట్టుకొని పోతుంది. అదెంతో బాధాకరం. ప్రసిద్ధిచెందిన బౌద్ధ భిక్షువులు, సన్యాసులు, తమ శిష్యులను జడపదార్థాలుగ

తయారుచేస్తున్నారు. 'ఆలోచనా రాహిత్యాన్ని' 'శూన్యత్వాన్ని' బోధిస్తున్నారు. అవే zen సాంప్రదాయానికి ముఖ్యమని చెప్తున్నారు. మౌనంగా, అచేతనంగా కూర్చోవడమే, సమాధి అవస్త పొందడాన్నే గొప్పగా అభివర్ణిస్తున్నారు. ఉదాసీనత, తటస్తంగా ఉండడాన్నే లక్ష్యాలుగ చెప్తున్నారు. ఇది విచారకరం. zen గురువుల ఉద్దేశము, ఆశయము, లక్ష్యము ఒకటే ధర్మాన్ని బోధించగల, కొనసాగించగల శిష్యుడిని తయారుచేయడమే. తగిన శిష్యులు లేక పోవడం వలన చాలా వరకు గురు పరంపరలు ఆగిపోయాయి. ధర్మబోధనలు నిలచిపోయాయి.

తత్వచింతనలో, ధర్మ ప్రచారంలో ఆధ్యాత్మిక గురువుకి ప్రముఖ స్థానమివ్వడమనే ప్రక్రియ భారతదేశంలో అనాదిగ వస్తున్న ఆచారం. రుగ్వేదకాలంలో ఆధ్యాత్మిక గురువుని 'ముని' అని 'సాధువు' అని వ్యవహరించేవారు. అతడిని లోతైన జ్ఞానం కలవాడిగా పరిగణించేవారు. వేదోక్తులతడి జ్ఞానసంపదలోని భాగాలు. ఆ తరువాత కాలంలో అతడిని 'ఆచార్యుడని', 'బ్రాహ్మణుడని', 'స్వామి' అని వ్యవహరించేవారు. నేడది 'గురువు'గా కొనసాగుతున్నది.

చందోగ్య ఉపనిషత్తు ప్రకారము గురుముఖతః నేర్చుకొన్న విద్య మాత్రమే శిష్యుడిని తన లక్ష్యసాధనలో కృతకృత్యుడిని చేస్తుంది. ఇహలోకం లోని అనేకానేక విషయాలను ఛేదించుకొని ఆధ్యాత్మిక చింతన చేయాలంటే గురువు బోధనలు అత్యవసరము అనికూడ చెప్తుంది.

మార్మికమైన జ్ఞానాన్ని రహస్యంగా బోధించే అవకాశముండటం అనేది వేధించే అంశం. ఒక తండ్రి తన రహస్యజ్ఞానాన్ని తన పెద్దకొడుక్కిగాని, తగిన అర్హత గల విద్యార్థికి గాని బోధించవచ్చు. ఎంత ధనమిస్తానన్నా ఇంకెవరికి బోధించరాదు. అయితరేయ అరణ్యకం విద్యార్థి కనీసం

సంవత్సర కాలమైనా గురువుతో గడపలేని పక్షాన గాని భవిష్యత్తులో తనుగూడ గురువు కాలేని యెడల అటువంటి విద్యార్థికి విద్యార్హత లేదని చెపుతుంది. గరువులు విద్యార్థిని ఎన్నో విధాల పరీక్షచేసిన పిదపే విద్యార్థిగా స్వీకరించడం జరుగుతుంది.

గురువు అనేమాట మొదటిసారి చందోగ్య ఉపనిషత్తులో వాడబడింది. ఆ మాటకు వ్యుత్పత్తి అర్థం 'బరువైన' అన్నది. పవిత్రమైనవారు, గురువులు బరువైన వారిగ పరిగణింపబడ్డారు.

భారత సాంప్రదాయం ప్రకారం అంతర్గత గురువును బాహ్యగురువు వద్దకు చేరవేస్తే బాహ్యగురువు అంతర్గత గురువుని వెల్లడిస్తాడు.

గురువే దైవమనే సిద్ధాంతం కాలక్రమేణ రూపొందినప్పటికీ దానిని స్వేతాశ్వతార ఉపనిషత్తులో ఉదహరించడం మనం గమనించొచ్చు. దైవాన్ని ఏ భక్తి తత్పరతలతో, ప్రేమతో కొలుస్తారో అదే భక్తి తత్పరతను గురువు యెడల చూపడం గురించి అందులో రాశారు. భక్తకవి కబీరు గురువునే దైవంగా భావించాలని చెప్తాడు. అదే భావాన్ని చైతన్య ప్రభు కూడ వ్యక్తపరిచారు.

ఈ భావన ఎంత దూరమెళ్ళిందంటే గురువు భగవంతుని స్థానాన్ని ఆక్రమించడం జరిగింది. శైవపురాణాలు ఇలా చెప్తాయి, "శివునికి ఆగ్రహం కలిగితే గురువు శిష్యుణ్ణి శాంతింప చేయగలుగుతాడు. కాని గురువుకి కోపమొస్తే ఆతడినెవ్వరూ శాంతింప చేయలేరు" ఈ భావనే నేటికీ గురువు అనుగ్రహం కింద చెలామణిలో ఉంది. భారతీయ సత్యాన్వేషకులనేకులు గురువు సన్నిధే మోక్షమార్గానికి చాలని భావిస్తారు. ఇది అందరి అభిప్రాయం మట్టుకి కాదు. శిష్యుడి గాఢాభినివేశము, లోతైన ఆధ్యాత్మిక చింతన అన్నింటికంటె ముఖ్యమని గురువు కేవలం అనుసంధానకర్త మాత్రమే

అని మరికొందరి అభిప్రాయం. ఈ అభిప్రాయం వల్లనో ఏమో గురువులకు కొదవేమీ లేదు; సరియైన శిష్యులే కొరతగా ఉన్నారన్నమాటలు వెలవడడం జరిగింది. ఈ ఆధుని యుగంలో కూడ గురువు ప్రశస్తి తగ్గకుండా ఉండేందుకు దోహదపడ్డవారు మహానుభావులు, తమ శిష్యులపై ప్రగాఢమైన ప్రభావమున్నవారు, అధికారమున్నవారు అయిన గురువులు: శ్రీ రామకృష్ణ, రమణమహర్షి, శ్రీ సత్యసాయి వంటివారు.

ఆధునికయుగంలో గురువుల ఆధ్యాత్మిక గొప్పతనాన్ని ప్రశ్నించేవారు ఎక్కువౌతున్నారు. వారి బాహ్యచర్యల ఆధారంగా గురువులను గురించి మాట్లాడడం తగనిపని అనిపిస్తుంది. వారు చేసేపని, తీసుకొనే నిర్ణయం లోతుపాతులు తెలుసుకోడం కష్టం. విట్టల్‌పంత్ అనే శిష్యుడిని అతడి గురువు వైవాహిక జీవితాన్ని చేపట్టమని ఆదేశించాడు. శిష్యుడికిది ఏమాత్రమూ ఇష్టంలేకపోయినా గురువాజ్ఞను శిరసావహించాడు. అతడెంతో బాధపడాల్సి వచ్చింది కూడాను. కాని అతడికి ఆ వైవాహిక జీవితం ద్వారా ఆణిముత్యాల వంటి ముగ్గురు పుత్రులు, ఒక పుత్రిక జన్మించడం జరిగింది. వారు నివృత్తినాద్, జ్ఞానేశ్వర్, సోపానదేవ, ముక్తాబాయి అనబడే గొప్పమునీశ్వరులుగా, జ్ఞాన సంపన్నులుగా అవతరించారు. గురువాజ్ఞలో ఉన్న మహత్తు అటువంటిది.

### ఆధ్యాత్మిక క్రమశిక్షణ

ఆత్మప్రభోదం లేదా దివ్యజ్ఞానం కలిగిన పిమ్మట సత్యాన్వేషకుడు ఒక గురువునో, కొన్ని ప్రవచనాలనో తనకు తోడుఇవ ఉండటానికి ఎన్నుకోవలసి ఉంటుంది. విషయాలను విశదీకరించడానికి, తాను ఆచరించవలసిన కార్యక్రమాల వివరాలను తెలుసుకోవటానికి, తద్వారా తాను సమూలంగ మారడానికి ఇది తప్పనిసరి.

ఒక గురువును ఎన్నుకొన్న పిదప తాను పూర్తిగా పరిణామం చెందేవరకు శిష్యుడు కొన్ని ఆహార వ్యవహార నియమాలను పాటించవలసి ఉంటుంది. అటువంటి ప్రయత్నాలన్నీ కలిపి ఆధ్యాత్మిక క్రమశిక్షణ అంటారు. ఆ క్రమశిక్షణ ద్వారా తమపూర్తి శక్తి సామర్థ్యాలను తెలుసుకోడానికి సాధ్యమవుతుంది.

ఆధ్యాత్మికమార్గంలో పయనించే అన్వేషకుడు కేవలం మానవుడు మాత్రమే కాదు మానవోత్తముడిగా పరిణామం చెందాలని కోరుకునేవ్యక్తి. ఒక ఆదర్శం కోసం, ఒక ఆశయం కోసం ఆ బాట పట్టినవాడు గురువు ఆధ్యాత్మిక మార్గంలో పయనించే బాటసారిని, మహాయాన బౌద్ధులు బోధి కార్యావతారమని అంటారు. అతడు జ్ఞాన ప్రకాశం కోసం బయలుదేరిన తెరువరి. యూదులు దానిని Halakhah- అనగా 'వెళ్ళేదారి' అంటారు. హిందు శాస్త్రాలు దానికని మూడు మార్గాలు ఏర్పరిచాయి: సరియైన కార్యాచరణ, సరియైన ధ్యానము, సరియైన విశ్వాసము. అసలీ 'బ్రహ్మాండమే' ఒక తోవ; ఒకదారి; ఒక తెరువు అంటారు.

చైనాకు చెందిన తావోలు (Tao).

ప్రతిమతము ఒక్కొక్క ప్రపంచదృక్పథాన్ని ప్రతిఫలింపచేస్తుంది. అవి భిన్న రూపాలలో గోచరించవచ్చు. ఆయా రూపాలలోని విశిష్టరూపాన్ని; సంపూర్ణత్వాన్ని ఆయా మతాలను అనుసరించేవారు అందుకోవాలని ఆశిస్తారు. అది జీవన సాఫల్యం కావచ్చు, శూన్యత్వం కావచ్చు, మంచి జీవితాన్ననుభవించాలని కోరుకోవడం కావచ్చు, సునాయాస మరణం కావచ్చు. లక్ష్యం ఏదైనా కావచ్చు ఆయా మతాలు ఆ లక్ష్యాలను ఏ విధంగా సాధించవచ్చో తెలియచేస్తాయి.

క్రమశిక్షణ లేనట్లయితే ఆధ్యాత్మిక బాటసారి కూడ తడబడతాడు. 'సూఫీ సాధువు Jalal al-Din Rumi ఈ విధంగా వివరిస్తాడు, 'మార్గదర్శి

లేనట్లయితే రెండుదినాల ప్రయాణం రెండు వందల సంవత్సరాలు పడ్తుంది. క్రమశిక్షణ అనగానే కొందరికి 'శిక్ష' గుర్తొస్తుంది. కొందరి విషయంలో అది నిజం కావచ్చు, కాని 'క్రమశిక్షణ' అనే పదానికి అర్ధమదికాదు; దానికి నానార్థాలు ఉన్నమాట కూడ వాస్తవమే.

క్రమశిక్షణతో ముందుకు సాగడం అంటే ఒక గురువును కాని, ఒక సంప్రదాయాన్నికాని; ఆశయాల సమాహారంకాని, ఒక ప్రవచనాల గుత్తికాని కావచ్చు. వాటి ప్రకారం తన నడవడిని, తన ప్రవర్తనని తీర్చిదిద్దుకొని ఆ విలువలకు కట్టుబడి తన జీవితాన్ని, జీవిత పయనాన్ని సాగించడం చేస్తాడు. ఆ విలువలకతడు బంధీ అవుతాడు. క్రమశిక్షణను ఒక శిక్షగా పరిగణించడు. విలువలకు బంధీ కావడాన్ని ఆనందంగా స్వీకరిస్తారు. ఎంత క్రమశిక్షణతో నడుచుకొంటే మనిషి అంత స్వేచ్ఛగా ఉండగలుగుతాడు. అదే zen బౌద్ధుల నమ్మకం.

**క్రమశిక్షణలో రకాలు**

గురుశిష్య సంబంధం భిన్న సాంప్రదాయాలలో భిన్నంగా ఉంటుంది. ఒకే సాంప్రదాయంలో కూడ వేరు వేరుగా ఉండే అవకాశముంది. ఈ సంబంధం ఈ విధంగ ఉంటుంది అని చెప్పడానికి వీలుకాదు. దానిని మూడు విధాలుగ విభజించవచ్చు. 1. భిన్న నియమాలు కలిగినది. 2. స్వయం ప్రతిపత్తి కలిగినది 3. పరస్పర ప్రభావాలు కలది. సాధారణంగ ఆధ్యాత్మిక విద్యార్థి/అన్వేషకుడు వీటిలో ఏదో ఒక్కదాన్ని కాకుండ మూడింటిని కొద్దికొద్దిగా ఆచరణలో పెట్టడం జరుగుతుంది.

Heteronymous: భిన్న నియమాలు కలది. ఈ విధానంలో విద్యార్థి/ అన్వేషకుడు ఒక గురువు లేదా ఒక నియమానికి, ఒక అధికారానికి లోబడి ఉంటాడు. ఆ అధికారం ఒక వ్యక్తిరూపంలోగాని; ఒక నియమం రూపంలో

గాని ఉండొచ్చు. సాధారణంగా ఈ గురుశిష్య సంబంధాన్ని సృష్టికర్త – ప్రాణి; యజమాని – సేవకుడు ఉపాధ్యాయుడు – విద్యార్థి; తండ్రి–బిడ్డ, గొఱ్ఱెల కాపరి– గొఱ్ఱె, జ్ఞాని–అజ్ఞాని, న్యాయాధికారి–దోషిగా వర్ణిస్తారు. అన్వేషకుడు తన గురువు ఆజ్ఞలకు లోబడి, అతడు ఏర్పరచిన నియమాలననుసరించి పయనిస్తు తన గమ్యాన్ని చేరుకొంటాడు. యజమాని అధికారానికి తలయొగ్గి ఉండడం ఇక్కడ ముఖ్యసూత్రం Ch'an బౌద్ధంలో శిష్యుడు గురువు ఇల్లు ఊడ్వడం, అంట్లు తోమడం వంటివి చేస్తాడు. హిందువు ధర్మశాస్త్రాల అనుసారం నడుచుకొంటాడు. బాహ్యమైన అధికారానికి లొంగి ఉంటాడు.

గురువు కాలంలోను దూరంలోను సుదూరంగ ఉండడం గాని జరిగితే విద్యార్థి తనకంటె ప్రజ్ఞ కలిగిన ఇతర విద్యార్థుల నుండి నేర్చుకొంటాడు; లేదా పవిత్రగ్రంథాలలో నున్న విలువైన సమాచారం నుండి నేర్చుకొంటాడు.

దీనికి ఉదాహరణగా ఇస్లాం ఆధ్యాత్మిక సాంప్రదాయాన్ని గురించి చెప్పవచ్చు. ప్రతి ముసల్మాను, తనశక్తి సామర్థ్యాలను గురించి అల్లా ఇచ్చిన ఆజ్ఞను నెరవేర్చడమే అతడి లేదా ఆమె జీవిత ధర్మము. దేవుడు/అల్లా మనిషని తన ఆజ్ఞను పాటించడానికే ఈ లోకంలో జన్మింపచేస్తాడు. అతడిని సరియైన మార్గంలో నడిపించడానికి తన ప్రవక్తలను; విలువైన ఆధ్యాత్మిక సాహిత్యాన్ని మనిషికి చేదోడుగ పంపుతాడు. ముస్లింలను గురించే పవిత్రమైన షారియా (shariah) ఖురానునుండి వెలువడినదే. నీళ్ళు దొరకని యెడారిలో నీరు దొరికే చోటు లభించడమే ఆ యడారివాసులకొక వరం. ఇస్లాంకు సంబంధించిన పవిత్ర సమాచారాన్ని నీటి ఊటగ అభివర్ణించడం ఎంతో సమంజసము. రమజాన్ దైనందిన పవిత్రమాసంలో ప్రార్థనలు, దానమివ్వడం, ఉపవాస దీక్షలు చేయడం వంటివన్నీ ముసల్మానుల కర్తవ్యంగా వారి మతగ్రంథాలు బోధిస్తాయి.

సూఫీ సాంప్రదాయానుసరించి దైవసన్నిధి చేరగోరే భక్తుడు, జ్ఞానదాహంతో తపించే విద్యార్థి తనను నడిపించేందుకు మార్గదర్శిగా ఒక గురువును ఎన్నుకోవడం జరుగుతుంది. ప్రయాణం కఠినతరము; లక్ష్యము సుదూరంలో ఉండడమే కాక దశలవారీగా కొనసాగించాల్సిన అవసరముంది. గురువు అన్ని దశలలోనూ విద్యార్థికి అండదండగ ఉంటాడు. తన శిష్యుడి అంతరంగంలోకి తొంగిచూసి, అతడి కలలను, ఆశలను పరిశీలించి చూసి తదనుగుణంగ అతడికి ఉపదేశం చేస్తాడు. అతడే పరిణామదశలో ఉన్నాడో గ్రహించి అతడు పూర్తిగ సాయుజ్యం చెందే విధంగ సాయం చేస్తాడు. అతడి సందేహాలను నివృత్తి చేస్తాడు. విద్యార్థిని పలువిధాలుగ సానబెడ్తాడు. నలభయి దినములు కఠినమైన చర్యలు ఆచరించే విధానం నేర్పిస్తాడు. అంతే కాకుండ తనవంటి సత్యాన్వేషకుల సమూహంలో ఉండి, వారి నుండి ఉత్తేజము; సహకారము పొందే ఏర్పాటుచేస్తాడు.

విద్యార్థి మనసు పూర్తిగ ఆధ్యాత్మికతవైపే ఉండేలాగున పర్యవేక్షిస్తాడు. అతడు దశలవారిగ లక్ష్యం/గమ్యం చేరుకొనేందుకు అవసరమైన విధులను, మానసిక, శారీరక పరిపక్వత కలిగించే పశ్చాత్తాపం/పరితాపము; పరిత్యాగము, ఉపవాసము, సమర్పణ, కృతజ్ఞత, బీదరికము వంటి వాటిని అనుభవించే విధివిధానాలను నేర్పిస్తాడు. తనలోని అహంకారాన్ని పూర్తిగ వదిలివేసి, ప్రేమను ఆలింగనం చేసేవిధంగ తయారుచేస్తాడు. మానవుడికి సాధారణంగ ఉండే బలహీనతలను వదిలించుకొని, దైవత్వం వేపు నడిచేందుకు సాయం చేస్తాడు గురువు.

స్వయం సమృద్ధమైన క్రమశిక్షణ గురువు ఎక్కడో లేడు నీలోనే దాగి ఉన్నాడు. బాహ్య ప్రపంచంలోని గురువును వెదికే ప్రయాస అవసరంలేదు. నీ అంతరంగంలోనే ఉన్న నీ గురువును కనుగొనుము. అని చెప్పేది ఈ

స్వయంసిద్ధికి చెందిన క్రమశిక్షణ. నీ అంతరంగం లోతుల్లో నున్న నీ గురువు బాహ్య ప్రపంచంలో జరిగే ఏ సంఘటనలకీ చెలించకుండ చెక్కు చెదరకుండ నిలచి ఉండి అనునిత్యము నీతోనే ఉంటాడు. సత్యాన్వేషకుడు అటువంటి స్థిత ప్రజ్ఞతను సాధించ గలగాలి. తనలోని గురువును ఆవిష్కరింపచేసుకొని, అంతరాత్మ ప్రబోధంతో ఆధ్యాత్మిక పయనం సాగించే విధానాన్నే స్వయం సమృద్ధమైన క్రమశిక్షణ అంటారు.

దీనికి గొప్ప ఉదాహరణ సిద్ధార్థుని జీవితము; అతడు బుద్ధుడిగ అవతరించడం, రాజకుమారుడిగ సిద్ధార్థుడు సకల వైభవాలను అనుభవించాడు. యువకుడిగ తన తండ్రికి చెందిన రాజప్రాసాదంలో ఆనందంగా జీవించాడు. తన భవనం నుండి బయట ప్రపంచంలో అడుగుపెట్టి, దుఃఖ భాజనమైన దృశ్యాలను చూశాడు. జరాభారంతో ఒంగిపోయిన వృద్ధుడిని; రోగ భూయిష్టమైన రోగపీడితుడిని, ఒక శవాన్ని చూసి అతడు చలించిపోయాడు. నిర్ఘాంత పోయాడు, కృంగిపోయాడు.

మనిషి దుఃఖానికి కారణమేమిటో, ఆ దుఃఖాన్ని ఏవిధంగా అధిగమించాలో తెలుసుకోవాలనే జిజ్ఞాసతో, మానవాళికి సహాయం చేయాలనే కోరికతో తన 29వ ఏట తన వైభవోపేతమైన సాంసారిక జీవనాన్ని త్యజించి తన సందేహాలను తీర్చే గురువుని అన్వేషిస్తూ బయలుదేరాడు. ముందుగా ఇద్దరు గురువులని ఆశ్రయించాడు. కొంత కాలానికే ఆ గురువులని వదిలి ముందుకుసాగాడు. ఆ కొద్ది కాలములోనే వారివద్ద నేర్చుకోవలసినదంతా నేర్చుకొన్నాడు. అయినా తన సందేహనివృత్తి కాలేదు. అసంతృప్తితో రగులుతున్న మనసుతో సత్యాన్వేషణ కొనసాగించాడు. అడవిలో ఒక నిర్జన ప్రదేశాన్ని ఎన్నుకొని అక్కడ తన గురువులు చెప్పిన నియమ నిష్ఠలను పాటించాడు, కఠినమైన ఉపవాస దీక్షలు చేసి దేహాన్ని శుష్కింపచేశాడు. ఆ విధంగా చేయడం వలన అతడు

శారీరకంగ బలహీనపడ్డాడే కాని అతడాశించిన మానసిక సంకల్ప బలం కలగలేదు. అంచేత ఆ కఠినమైన పద్ధతులను వదలివేసి 'మధ్యేమార్గాన్ని' ఆశ్రయించాడు. శరీరాన్ని కృశింపచేసే హఠయోగానికి, శరీరసుఖమే పరమావధి అయిన భోగలాలసతకు మధ్యలో రెండు విపరీతాలకు మధ్యస్థంగా, అటు ఇటు కాకుండ బ్రతికి ఉండడానికవసరమైనంత తిండి, నిద్ర, వస్త్రధారణ మాత్రమే చాలు అనుకొని బ్రతకడమే మధ్యేమార్గం. అతడు సమాధిలో ఉండగా ఎన్నోరకాల పైశాచిక శక్తులతని ధ్యానాన్ని భగ్నం చేయాలని చూశాయి. కాని కృతకృత్యం కాలేదు.

గౌతముడు నాలుగు దశల ధ్యానాలు చేశాడు. ఒక్కోదశ గడిచిన కొద్దీ ఆధ్యాత్మికలో లోతుకు వెళ్ళడం జరిగింది. దుఃఖం తీరుతెన్నులు తెలుసుకోడం జరిగింది. ఒక నిండు పున్నమినాడు పూర్తిగ జ్ఞానోదయము కలిగిన గౌతముడు, బుద్ధుడై లేచి నిలిచాడు. అతడికి నాలుగు నిత్యసత్యాలు బోధపడ్డాయి. దుఃఖం జీవితంలో తప్పనిసరి భాగమని అర్థమయ్యింది. దుఃఖానికి హేతువుంటుందని, కోరికే దానికి కారణమనీ, దుఃఖోపశమనానికి కోరిక లేకుండ ఉండటమే మార్గమని, కోరికలేకుండ జీవించడానికి అష్టాంగ మార్గమే శరణ్యమని ఆయన తెలుసుకొన్న నిత్యసత్యాలు: ఆయన చెప్పిన ఎనిమిది సూత్రాలివి: సరియైన ఆలోచన, సరియైన మాట, సరియైన కార్యాచరణ, అహింస, దొంగిలించకుండుట, అక్రమసంబంధం లేకుండుట, న్యాయమార్గంలో సంపాదించుట, పక్షపాతం లేకుండుట, ఔదార్యం కలిగి ఉండుట.

సరియైన/సక్రమమైన ధ్యాన మార్గాలననుసరించుట. ఈ అష్టాంగ మార్గాలనుసరించడం వలన అన్వేషకుడికి జ్ఞానము, నీతి, ఏకాగ్రత అన్నీ లభిస్తాయి.

బౌద్ధ గ్రంథాలు మనకొక విషయం తెలుపుతాయి. గౌతముడు తనకు తానే గురుత్వం వహించి జ్ఞానోదయం పొంది బుద్ధుడయ్యాడని, జ్ఞానోదయమయిన బుద్ధుడు తనంతట తానే ఈ విషయం వెల్లడించాడని తెలుస్తుంది. 'ఈ బుద్ధి, జ్ఞానం నాకు నేనే సంపాదించుకొన్నాను. ఇది నాలోనే ఉద్భవించింది. ఇది ఇంతకు ముందెన్నడూ, ఎవరికీ జరగలేదు.

గౌతముడు బుద్ధుడైన వైనం ఒక విషయాన్ని తెలుపుతున్నది. జ్ఞానోదయమైన బుద్ధుడు తనమార్గమె సరైనదని, తన ప్రవచనాలే సత్యాలని, తానొక్కడే సరియైన/అసలైన గురువని చెప్పలేదు. జ్ఞానోదయమందరికి సాధ్యమైనదే అనీ, ప్రతి ఒక్కరు అది సాధించే వీలున్నదని చెప్పాడు. తను ప్రత్యేకత కలవాడని కాని, తానుపదేశించిన మార్గము అత్యుత్తమమైనదని గాని చెప్పలేదు. 'బంగారాన్ని పుటం వేసి, కాల్చి, గీటురాతిమీద గీచి దాని నాణ్యత తెలుసుకొన్నట్లు మీరు నేను చెప్పిన విధానాన్ని పరీక్షించి, పరిశీలించి, నిగ్గుతేల్చుకోండి; నేను చెప్పానని మాత్రం అనుసరించకండి' అని బోధించాడు.

అంతర్గతము, బాహ్యము ఒకదానిపై మరొకటి పరస్పర ప్రభావముండే క్రమశిక్షణ. ఈ ప్రక్రియలో గురువు అన్వేషకుడికి అటు పూర్తిగా బాహ్యము కాదు ఇటు పూర్తిగా అంతర్గతమూ కాదు. ఇందులో తత్వవిచారం తార్కిక విమర్శతో కూడి ఉంటుంది. ఆ వాద ప్రతివాదాలే అన్వేషకుడిని పరిణామ మార్గాన నడిపిస్తాయి.

బాహ్యరూపంలో మనిషిని నడిపించేది సంప్రదాయము; ప్రకృతిలోని సహజసిద్ధమైన అమరికలు. నీటిమీద అన్వేషకుడి ఆశలు, అతడి అభిప్రాయాయి. అతడి చదువు వగైరా ప్రభావం చూపుతాయి. అంతర్గతం మీద బాహ్యరూపాలు, బాహ్య రూపాలు మీద అంతర్గతము పరస్పర ప్రభావం కలిగి ఉండి అన్వేషకుడిపై పనిచేస్తాయి.

సౌందర్యనిర్ణయానికి సంబంధించిన కళల విషయంలో ఈ క్రమశిక్షణ యొక్క ఉపయోగము చూడవచ్చు. ఒక చేయి తిరిగిన వడ్రంగి ఒక అందమైన కుర్చీని తయారు చేయవచ్చు. ఒక శిల్పి పాలరాతిలో చక్కటి ఆకారాన్ని చెక్కవచ్చు, ఒక జంత్ర వాద్యగాడొక మధురమైన బాణీని సితారు మీద వాయించవచ్చు. ఈ ప్రక్రియలలో పనివంతుడు తన ఊహలకు రూపకల్పన చేయవచ్చు. కాని ఆ ఊహకు దోహదం చేసేది ఉనికిలో ఉన్న యధార్థము. పరస్పరాధార భూతమైనదీ ప్రక్రియ. అందమైన ఆకారాన్ని సృష్టించడంలో అన్వేషకుడు ఒక పనిముట్టుగా ఒక అనుసంధానకర్తగ వ్యవహరించడం జరుగుతుంది. అతడి జీవితంలో ఒకానొక క్షణంలో అటువంటి అవకాశం కలుగుతుంది. అప్పుడతడు ధైర్యంగా దానిని వినియోగించుకోవాలి. అతడిచేయి తడబడరాదు. అతడి చూపు చెదరరాదు అంటాడు గొప్ప చిత్రకారుడైన Vincent van Gogh కళకు సంబంధించి ఆ కళాకారుడిని స్వంతమైన వ్యక్తిగత అభిప్రాయాలు కావచ్చు. తన ఊహకు రూపకల్పన చేస్తున్నట్లు భావించినప్పటికీ ఆ ప్రత్యేక సందర్భంలో అతడు నేను ఆవేశంతో, తనకు ప్రమేయంలేని ఒక ఆకారాన్ని సృష్టించడం జరుగుతుంది. అతడిచేయి, అతడికి తెలియకుండానే తనపని (ఏదో ఒక దివ్యశక్తి నడిపిస్తున్నట్లుగా) తాను చేసుకొంటూ పోతుంది.

ఈ తతంగంలో కళాకారుడు ఏదో ఒక పెద్ద కార్యక్రమంలో ఒక భాగస్థుడిగా పనిచేయడం జరుగుతుంది. బాహ్య గురువు అంతర్గత గురువు ఇద్దరూ అన్వేషికుడిపై ప్రభావం చూపుతారు.

అనునిత్యము (మారుతున్న) ప్రపంచ స్థితిగతులలోని మార్మికశక్తిని అర్థం చేసుకొనే యత్నంలో ఉంటాడు. అన్వేషకుడు నిత్యసత్యాలను వాటిల్లో సందర్శించే ప్రయత్నం చేస్తాడు. మానవబుద్ధికతీతమైన సృష్టిలోని లయని ఆకళింపుచేసుకొనే ప్రయత్నం చేస్తాడు. దీనినే అభ్యాసం చేసేవ్యక్తి తన

దైనందిన జీవితంలో చేసే సాధారణ చర్యలలో కూడ సౌందర్యాన్ని కనుగొంటాడు. తిండి తినడం, నిద్రపోవడం, శరీరాన్ని కదిలించడం వంటి అన్ని చర్యలలోనూ ప్రత్యేకత కనుగొంటాడు. జ్ఞానమార్గంలో అవి కూడ భాగమేనని భావిస్తాడు. ఆ చర్యల ఉనికిలోనే సౌందర్యారాధకుడికి ప్రత్యేకత కనిపిస్తుంది. ఆ చర్యలలోనే సౌందర్యం, వాటంతటదే సౌందర్యాన్ని సంతరించుకొని ఉండడం అతడు చూస్తాడు. ఆ దృష్టికోణమే అతడిని జ్ఞానమార్గంలో నడిపిస్తుంది. జీవితంలోని లయని, సౌందర్యాన్ని దర్శించగల శక్తిని దానితో మమేకమయ్యే శక్తిని కనుగొన్న అన్వేషకుడు జ్ఞానమార్గంలో ముందుకు సాగడం జరుగుతుంది. ఉన్నదాన్ని ఉన్నట్లే గ్రహించడం ఇందులో ముఖ్యం. పరస్పరాధార భరితమైన ఈ క్రమశిక్షణలో గురువు వేరు విద్యార్థి వేరు కాదు. ఇక్కడ ద్వంద్వానికి తావులేదు. 'నేను' వేరు 'నీవు' వేరుకాదు. గురువు, విద్యార్థి దశలు మారుతూ ఉంటాయి. మార్గద్వేషి, మార్గదర్శి ఒకరే అవుతారు.

**క్రమశిక్షణ విధానాలు**

పైన వివరించిన మూడు విధాల క్రమశిక్షణలు వేరు వేరు అయినప్పటికి అవి ఒకదానితో మరొకటి సంబంధం కలిగి ఉన్నాయి. గౌతముడు తన శిష్యులకు తననే గురువుగా స్వీకరించాల్సిన అవసరం లేదని, ఎవరంతట వారు స్వయంగా జ్ఞానసిద్ధికి ప్రయత్నించి బుద్ధులు కావచ్చు అని చెప్పినప్పటికీ అతడి శిష్యులు అతడిని, అతడి ప్రవచనాలని, అతడు చెప్పిన నియమాలని ఔదలదాల్చారు. సూఫీ సాంప్రదాయంలోని అన్వేషకుడు మొదట ఒక గురువుని అనుసరించినా చివరికి తనంతట తానుగా శూన్యత్వాన్ని సాధించడం జరుగుతుంది.

ఈ మూడు విధానాలలోనూ అన్వేషకుడు, అతడు పాటించే సాంప్రదాయము, పయనించే మార్గము పెనవేసుకొని ఉంటాయి. ఈ

మూడు విధానాలలోని నియమాలలో తనకవసరమైన వాటిని అన్వేషకుడు పాటించడం గమనించొచ్చు. ఇవి: అలౌకికమైన క్రమశిక్షణ, ఆచరణాత్మక క్రమశిక్షణ, శారీరక క్రమశిక్షణ, మానసిక క్రమశిక్షణ, హృదయ సంబంధమైన క్రమశిక్షణ, మానవసంబంధపరమైన క్రమశిక్షణ. ఇది నిజానికి పూర్తిగా వేరు వేరు కావు. అధ్యయనం కొరకు విభజించడం జరిగింది.

## పారవశ్య స్థితి / సమాధి స్థితి

శరీరం భౌతికంగ ఒక కాలపరిమితికి లోబడి ఉంటుంది. దానికి చెందిన శీతోష్ణస్థితిగతుల, మానసికమైన, భావోద్వేగ పరమైన స్థితిగతులకు లోనై ఉంటుంది. దాదాపు అన్ని మతాలకు చెందిన సాంప్రదాయాలు 'అలౌకికానందం' అటు వర్షంలోనో, పర్వత శిఖరాల ఆవలనో, సముద్ర గర్భంలోనో నిక్షిప్తమై ఉంటుందని భావిస్తాయి. పరలోకమని దానిని ప్రస్తావిస్తారు. అన్వేషకుడు ఆ లోకంలోని శక్తులతో అనుసంధానం చేసుకొని అలౌకికమైన ఆనందం పొందగలడు. దాని కొరకు ఇహలోకంలోని తన శరీరాన్ని, పరిసరాల్ని తాత్కాలికంగా విస్మరించాల్సి ఉంది. తన శరీరపు ఉనికినే మరచి, తాదాత్మ్యం పొందడాన్ని అలౌకికానందము అంటారు.

ఇందుకోసం శరీరం యొక్క ప్రాధాన్యత తగ్గించడం అవసరము. శారీరానికి ఆనందాలకు ప్రాధాన్యత ఇవ్వడం తగ్గించుకొని నెమ్మది నెమ్మదిగా ఒంటరితనాన్ని, కోరుకోవాలి.

ఈ లోకపు రీతినుండి బయటపడి ప్రశాంతతని ఏర్పరుచుకోడానికి మార్గసూచిగా ఒక గురువు అవసరమౌతాడు. గురువు సహాయంతో సమాధిస్థితిని పొందిన శిష్యుడు పరలోకంలోనున్న దేవదూతలతో సంపర్కం పొందే అవకాశముంది.

సమాధి స్థితిని పొందిన అన్వేషకుడు మరణానంతర స్థితిని చేరుకొంటాడు. గురువు సాయంతో పునరుజ్జీవం చెందుతాడు. తాత్కాలికంగానైనా ఇహలోకం నుండి పరలోక ప్రయాణం చేయడం జరుగుతుంది. ఆ స్థితిని సంపాదించడం ప్రతిమతం యొక్క ఆశయం. టిబెట్ సాంప్రదాయంలో అన్వేషకుడు మరణము – పునరుజ్జీవనాల నడుమ ఊగిసలాడుతూ నలభై తొమ్మిది దినములు గడపగలడు. అతడికి ఆ విధమైన శిక్షణ ఇవ్వడం జరుగుతుంది. ఆ దశను మధ్యస్థదిశగా వర్ణిస్తారు. దానికి సంబంధించిన సమాచారమంతా టిబెట్‌లో మరణానికి సంబంధించిన పుస్తకంలో ఉంటుంది. మరణం తరువాత పునరుజ్జీవం చెందే దశలన్నింటిలోను మతం అన్వేషకుడికి అందుబాటులో ఉంటుంది.

**క్రియాశీలకమైన క్రమశిక్షణ**

అన్వేషకుడిలోనున్న అనవసరమైన (ప్రమాదకరమైన, చెడుగుణాలను) లోపాలను సవరించడం అతడిని బాగుపరిచేది ఒక పద్ధతి. ఇంకొక పద్ధతి అతడిలోనున్న మంచి గుణాలను పెంపొందించేది. క్రియాశీలకమైన క్రమశిక్షణ రెండవ పద్ధతి మీద మనసు పెడుతుంది.

తమకంటే ముందు దేవతలు, తమ పూర్వీకులు ఒక క్రతువుని ఏ విధంగా ఆచరించేవారో నేర్చుకొని అదేవిధంగా వీరూ ఆచరిస్తారు. ఉత్తములైన, దైవసమానులైన వారి అడుగుజాడలలో నడిచి వారివలె ఉత్తములు కావాలనే కాంక్షతో పనిచేస్తారు.

ఒక యాగం గాని, క్రతువుగాని ఆచరించడానికి కొన్ని వస్తువులు, కొన్ని పాత్రలు అవసరమవుతాయి. ఒక కళాకారుడు, ఒక మంచి చేతిపని చేసేవ్యక్తి ఏనుగుబొమ్మగాని, ఒక దేవుని బొమ్మగాని, ఒక కడవ బొమ్మగాని చేయడం జరిగితే అది దైవసృష్టిని అనుకరిస్తూ చేస్తాడు అంటుంది

అయితరేయ బ్రాహ్మణం. సృష్టికర్తవలె సృష్టించడం, సృష్టికర్తను అనుకరించడం ప్రతి ఒక్క అన్వేషకుడిలోనూ దాగి ఉంటుందనేది అన్ని సాంప్రదాయాలలోనూ ఉంటుంది. పదునైదవ శతాబ్దానికి చెందిన క్రైస్తవ సన్యాసి థామస్ ఎకెంపిస్ ఇలా చెప్పాడు, "క్రీస్తును అనుకరించండి, మేరీని అనుకరించండి. దేవుని బిడ్డలుగా జీవించండి, మోసము, కుట్ర, అసూయ లను దూరం పెట్టండి. 'ప్రాపంచిక విషయాలపై నుండి మీ దృష్టిని ఆధ్యాత్మిక విషయాలపై కేంద్రీకరించండి. దేవుని రాజ్యము మీలోనే దాగి ఉన్నది.

చైనాకు సంబంధించిన. Neo-confucian సంప్రదాయం ప్రకారం ప్రతి ఒక్కరు సాధుత్వం పొందే ప్రయత్నం చేయాలి. Chang Tsai (1021–1077) సాధువంటే ఎవరు అనేది నిర్వచించాడు. మనిషి తనలోని సామరస్య నైజాన్ని, ప్రకృతి సహజమైన గుణాన్ని నిలబెట్టుకోవాలి. ప్రకృతిలో ఒకరిగా లీనమైపోవాలి. తనకు ప్రకృతికి వ్యత్యాసం లేదని గ్రహించాలి. ఈ స్థితిని చేరుకోవడానికి Neo-confucian సంప్రదాయం కొన్ని పద్ధతులను, కొన్ని నియమాలను ఏర్పరచింది. Kao P'an Lung (1562–1626) కొన్ని సిద్ధాంతాలను, కొన్ని క్రియాశీలక ఆచరణలను అనుసరించమని చెప్పాడు. అన్నింటిపట్ల ఒకేరకమైన సద్భావన కలిగి ఉండడం, మనసు తలుపు తెరచి ఉంచడం, ప్రకృతిని ఆరాధించడం, అంతర్గతాన్ని బాహ్యంతో ముడివేయడం, శరీరాన్ని మనస్సును ఏకముఖం చెయ్యడం వంటివాటిని ప్రతిపాదించాడు. అదే మనిషి సహజమైన గుణమని అతడు భావించాడు.

శారీరక క్రమశిక్షణ తన ఇంద్రియాలను తృప్తి పరచడం, తన శరీరం మీదే దృష్టిని కేంద్రీకరించడం ద్వారా శరీరం ఆధ్యాత్మికం వైపు వెళ్ళకుండ ఇహలోక సుఖాలే ప్రధానంగా భావిస్తుందని దాదాపు అన్ని మతాల అభిప్రాయము. ఈ సత్యాన్వేషణకుడు శరీరవాంఛలకు లొంగకుండ, దానిని అదుపులో పెట్టుకోవాలని కూడ అన్ని మతాలు అనుకొంటాయి. క్రైస్తవ

సన్యాసుల జీవితాన్ని పరికిస్తే ఇది విశదమౌతుంది. ఆరవ శతాబ్దానికి చెందిన Benedict Nursia ఇలా వ్రాస్తాడు. సాధువులు తమ శరీరాలను, తమ సంకల్పాలను తమ అధీనంలో ఉంచుకోవాలి కనుక రోజుకొక రొట్టె మాత్రమే తినాలి. వారు మద్యాన్ని సేవించరాదు అన్నారు. ఈనాటి సాధువులంత కఠినమైన నియమాలను ఆచరించలేరు కనుక, సాధువులు అతిగ తినరాదు, అతిగ తాగరాదు అని మాత్రం చెప్పడం జరిగింది.

Benedict ప్రకారం సాధువులు పూర్తిగ భోగలాలసత్వం వదిలివేయాలి. తనకంటూ వ్యక్తిగతంగా దేన్నీ పొందగూడదు, ఒక కలంగాని, ఒక పుస్తకం గాని, దేనినీ తన ఆస్తిగా భావించరాదు అన్నాడు. ఆరు శతాబ్దాల తరువాత Francis of Assisi కొద్దిగా మార్పుచేసి ఆ నియమాలనే మళ్ళీ నొక్కి చెప్పాడు. సాధువులు తమకున్నదంతా బీదల కిచ్చేసేయాలి. ముతక బట్టలు మాత్రమే ధరించాలి అని.

పతంజలి రాజయోగ సంప్రదాయము, వ్యాసుని యోగభ్యాసము వాచస్పతి మిశ్రుని తత్వసారధి శరీరాన్ని అదుపులో పెట్టడం గురించి సవివరంగా తెలియచేస్తాయి. కైవల్యానికి ఎనిమిది మార్గాలు. అష్టాంగ మార్గాలున్నాయి. పతంజలి యోగ శాస్త్రము ఆ ఎనిమిది దశలు ఇవి. మొదటిది: 'యమ' నియమం. జీవహింస చేయరాదు, అనృతమాడరాదు, దొంగతనం చేయరాదు, అక్రమ లైంగిక సంబంధం పెట్టుకోరాదు, ఇతరుల సంపదను చూసి ఈర్ష్య పడరాదు. రెండవది: పంచసూత్రాలతో కూడినది. శుభ్రత, స్థితప్రజ్ఞత, సన్యాసత్వం, శాస్త్రపఠనం, యజమాని పట్ల వినయము. మూడవదశ: యోగాసనాల శిక్షణ, కొనసాగింపు కఠినమైన సన్యాసాశ్రమ జీవితం గడపడం వలన శరీరం పటుత్వం కోల్పోకుండా ఆసనాలు వేయడం అవసరం. నాల్గవది: ప్రాణాయామం. ఉచ్ఛ్వాస నిశ్వాసాలను నియంత్రించడం, సుదీర్ఘకాలం ఊపిరి బిగబట్టడం సాధన చేస్తారు.

ఐదవదశలో అన్వేషకుడు 'ప్రత్యాహారి' పాటిస్తాడు. తన ఏకాగ్రత నంతా నాసిక పైభాగాన, రెండు కనుబొమల మధ్య కేంద్రీకరిస్తాడు. తక్కిన వాటినుండి, ఇంద్రియాలన్నింటి నుండి ధ్యాసను మరల్చి కేవలం కనుబొమ్మల మధ్యనున్న బిందువు మీదే కేంద్రీకరిస్తాడు. దానివలన అతడికి తన శరీరమంతటి మీద అధికారం సంపాదిస్తాడు. ఎంతో శక్తిని సంపాదిస్తాడు.

ఆరవదశలో యోగి 'ధారణ అనే ప్రక్రియను చేపడ్తాడు. అదొక మానసికమైన కార్యక్రమము. యోగి తన ఏకాగ్రతనంతా ఒక 'మంత్రం' మీదకాని, ఒక యంత్రం మీద కాని కేంద్రీకరించి, తన మనస్సును అటూ ఇటూ  పోనీకుండ దానిమీదే నిలుపుతాడు. ఈ చర్యవలన తన ఆత్మ విశ్వం యొక్క ఆత్మతో విలీనం చేస్తాడు.

పైన చెప్పిన ఆరు దశలలోనూ యోగి తన స్పందనలను, కోరికలను, కదలికలను, ఉచ్ఛ్వాస నిశ్వాసాలను, భౌతిక శరీరానికి సంబంధించిన అనేక క్రియలను నియంత్రించడం జరుగుతుంది. ఈ ఆరుదశలలోనూ యోగి ఏడు, ఎనిమిదవ దశల కోసం సమాయత్తం కావడం జరుగుతుంది. ఏడవదశ ధ్యానములో గడుస్తుంది. తన అంతరంగంలో విశ్వాత్మ కాంతిని దర్శించడం జరుగుతుంది. ఎనిమిదవది, ఆఖరిది సమాధి స్థితిలో గడపవలసి ఉంది. ఈ దశలో యోగి పూర్తి చైతన్యవంతుడై, అన్ని విధాల బాధల నుండి విముక్తి పొందినవాడై, చావు పుట్టుల బంధం నుండి విమోచనం పొంది, పూర్తిగ స్వేచ్ఛను, శాంతిని, ఆనందాన్ని పొందడం జరుగుతుంది.

**మానసిక క్రమశిక్షణ**

శరీరంలాగే మనసు కూడ మనిషిని ఆధ్యాత్మికతవైపు పోకుండా అతడిని ఇతర విషయాలవైపు ఆకర్షిస్తుందని మతాల విశ్వాసం. దానిని

కట్టడి చేయాల్సిన అవసరముందని గుర్తించారు. ఆధ్యాత్మిక గురువులు తమ శిష్యులను పగటికలలు కనవద్దని కోప్పడుతుంటారు. ప్రతి విషయాన్నీ మరీ నిశితంగ విశ్లేషణ చేయవద్దని కూడ చెప్తారు.

కఠోపనిషత్తులోని నచికేతుడి కథలో ఇదే విషయాన్ని చెప్పడం జరిగింది. జ్ఞానార్థియై యమధర్మరాజును చేరిన బాలుడు నచికేతుడు. వారిద్దరి మధ్య జరిగిన సంభాషణ ద్వారా మనం చాలా విషయాలు తెలుసుకోవచ్చు. ఏ విధంగానైతే రథచోదకుడు ఆ రథాన్ని లాగే గుర్రాలను తను చెప్పిన విధంగా నడిచేటట్లు చేస్తాడో ఆ విధంగా మనం మన మనసును కట్టడి చేయాల్సి ఉంటుంది. మన తెలివి రథచోదకుడు, మన మనసు గుఱ్ఱాలకు కట్టిన తాడు. తన ఇంద్రియాలను నిగ్రహించుకోలేనివాడు రథాలను కట్టడి చేయలేనివాడు ఒకటే. తన కోరికలను జయించలేని వ్యక్తి, గుఱ్ఱాలను అదుపు చేయలేని రథసారథి. యమధర్మరాజు నచికేతుడికింకొక ధర్మ రహస్యం వివరిస్తాడిలాగ. మనలోనే పరమాత్మ స్వరూపం దాగి ఉంది. అదే అంతిమ సత్యం. దానిని కనుగొనగలిగితే ఆ వ్యక్తి జననమరణ బంధచక్రం నుండి విముక్తుడవుతాడు. కాని దానిని కనుగొనడం చాలా కష్టం. ఎందుకంటే రూపురేఖలేవీ లేవు. ఫలానా గుణగణాలు ఉన్నాయని చెప్పడానికి వీలులేదు. నిర్దిష్టమైన గుణగణాలేవీ లేవు. దానికి శబ్దం లేదు, స్పర్శలేదు, ఒక ఆకారం లేదు, దానికి నాశనం లేదు, రంగు, రుచి, వాసనలేదు, దానికి మొదలు తుదిలేదు.

మండూకోపనిషత్తు ఇలా చెప్తుంది. ప్రశాంత చిత్తం కలిగిన శిష్యుడిని మాత్రమే గురువు అంగీకరించాలి. బ్రహ్మపదార్థం యొక్క స్వరూపాన్ని తెలుసుకోవాలంటే ఆత్మ సందర్శనము తప్పనిసరి.

బృహదారుణ్యక ఉపనిషత్తుల యాజ్ఞవల్క్యుడు ప్రతీదాన్నీ “ఇది కాదు, ఇదికాదు” అని పదే పదే చెప్తాడు. ప్రపంచం మనకొక రకంగా అగుపిస్తుంది.

మనిషి తన గురించి తానొక అభిప్రాయం కలిగి ఉంటాడు. కాని ప్రపంచ నిజస్వరూపం అదికాదు; మనిషి నైజం అదికాదు ఆధ్యాత్మిక విద్యార్థి మానసికంగా తనమనస్సుకు ఇచ్చిన శిక్షణ ఆధారంగా వస్తువుల అసలు స్వరూపం గ్రహించే శక్తిని పొందుతాడు.

క్రైస్తవ మార్మిక సంప్రదాయం కూడ ఇటువంటి బోధనే చేస్తుంది. లెక్కలు, కొలతలు, విస్తీర్ణాలు, ఎత్తులు, పల్లాలతో కూడిన ఈ ప్రపంచం, మనకు కళ్ళకు కనపడే ఈ ప్రపంచం నిజమైనదికాదు. దానిని ఛేదించండి, ముక్కలుగా విరగ్గొట్టండి, దాని నిజస్వరూపం కనుగొనండి అని చెప్తుంది. Dionysius, The Areopagize ఈ విధంగా చెప్తారు 'ఈ విశ్వానికి కారణభూతమైన దానికి ఆకారం లేదు. ఒక ఘనములేదు, దానికొక స్వభావంలేదు, దానికి బరువులేదు, కంటికి కనపడదు, అది సదృశ్యం కాదు. ఆయన తన అనుచరులకు ఇలా ఉపదేశించారు. "మీ మేధస్సుని, మీ ఇంద్రియాలని వదలివేయండి. చరాచర జగత్తును విస్మరించండి. అన్నింటికి అతీతమైన ఆ మూలశక్తిని చేరుకొనే ప్రయత్నం చేయండి. ఈ ప్రాపంచిక జ్ఞానాన్ని, విజ్ఞానాన్ని వదిలివెయ్యండి.

**హృదయ క్రమశిక్షణ**

గాఢమైన అజరామరమైన ప్రేమ విశ్వానికి, సృష్టికి మూలాధారమని కొన్ని సాంప్రదాయాల నమ్మకము. ప్రేమే మొదలు, తుదీ అని వారికి నమ్మకం. ప్రేమే దివ్యత్వము, ప్రేమే మార్గము. ప్రేమ హృదయానికి సంబంధించినది ఆత్మకు కాదు. ఇది ప్రపంచాన్ని ఆ దృష్టితో చూడడం ఉదాత్తమైన భావన. సూఫీకవి మొహమ్మద్ గిజుదరజ్ ఇలా చెప్తారు. ప్రతి అందమైన సృష్టిలోను నాకు దేవుని ప్రతిభ కనపడుతుంది.

జలాలుద్దీన్ రూమీ "ప్రకృతిలోని ప్రతి వస్తువు దేవుని ప్రేమకు చిహ్నామనిపిస్తుంది. ప్రేమే లేనట్లయితే ఈ ప్రపంచంలో స్వచ్ఛతే లేదు.

ప్రేమే లేనట్లయితే సూర్యునిలో వేడే (ఉష్ణమే) ఉండదు. భూమి పర్వతము – వీటిలో ప్రేమే లేనట్లయితే అసలు గడ్డి కూడ మొలవదు."

హీబ్రూ సాంప్రదాయంలో 'భగవంతుడు – భక్తుడు' వీరిద్దరి మధ్య సంబంధం – వరుడు వధువుల మధ్యనున్న సంబంధము. స్త్రీ – పురుషుల మధ్యనున్న ప్రేమ. హీబ్రూ Song of Songs పాట ప్రకారం దేవుడు ప్రేమిస్తాడు. తన ప్రేమకు బదులు ప్రేమను తప్ప ఇంకేమీ కోరడు. ప్రేమకోసమే ప్రేమిస్తాడు. ఎవరైతే దైవాన్ని ప్రేమిస్తారో ఆ ప్రేమే వారిని దీవిస్తుంది.

క్రైస్తవ మార్మికులు దేవుని పురుషునిగాను, (భక్తుని స్త్రీగాను వర్ణిస్తారు. వారిద్దరి సంబంధమే ఉదాత్తమైన ప్రేమ సంబంధము (సెయింట్ విక్టర్) Saint-victor కు చెందిన Richard ఆత్మ పరమాత్మల సంబంధాన్ని నాలుగు దశలలో జరిగే ప్రక్రియగా వర్ణిస్తాడు మొదటిదశలో పరమాత్మ ఆత్మలో ప్రవేశిస్తాడు. ఆత్మ అంతర్ముఖమవుతుంది. రెండవ దశలో ఆత్మ తనున్న స్థాయి నుండి పై స్థాయికి ఎదుగుతుంది. మూడవ దశలో భగవంతుని దరిదాపులకు చేరుకొంటుంది. భగవంతునిలో విలీనమవుతుంది. నాల్గవదశలో ఆత్మ భగవంతుని స్వరూపంగా మారిపోతుంది.

హృదయానికి సంబంధించిన ఈ క్రమశిక్షణ అన్వేషకుడిని ఎంతో ఔన్నత్యానికి తీసుకొని వెళ్తుంది. భగవద్గీతలో కృష్ణుడు అర్జునుడికి ఇలా తెలియచేస్తాడు.

భక్తి ద్వారా నేనెవరో తెలుసుకోగలుగుతాడు భక్తుడు నన్ను తెలుసుకోగానే నాలో చేరిపోతాడు.

**కలకాలం మన్నిక గల సంబంధ బాంధవ్యాలు**

స్వచ్ఛమైన లేదా ఉదాత్తమైన వ్యక్తిగత సంబంధాలను, కుటుంబ సంబంధాలను కలిగి ఉండాలి. అదే విధంగా దైవానికి, మనుషులకు మధ్య శ్రేష్ఠమైన సంబంధ బాంధవ్యాలుండాలని కొన్ని సాంప్రదాయాలు చెబుతాయి. దీనికి ఉదాహరణగా యూదులు గౌరవించే 'mitzvah' అనే దైవాజ్ఞ గురించి చెప్పొచ్చు. యూదుల మతగురువు ప్రకారము దేవుడు ఇశ్రాయిల్ వాసులకు 613 ఆజ్ఞలిచ్చాడు. అందులో 248 సానుకూల, 365 వ్యతిరేకమైన ఆదేశాలివ్వడం జరిగింది. దేవుడిచ్చిన ఆదేశాలలో మనకు బాగా తెలిసినవి 'Ten commandments'- 'పది దివ్యాదేశాలు'. ఇవి దేవుడొక్కడే అనే సిద్ధాంతాన్ని ప్రతిపాదించడమే కాకుండ హింసతో కూడిన సామాజిక ప్రవర్తనను నిరోధింపచేసే సూత్రాలు కలిగి ఉన్నాయి.

ఈ సూత్రాల ప్రకారము ఇశ్రాయెలు వాసులు 'యెహోవా'ను తప్ప మరెవరినీ పూజించరాదు. విగ్రహారాధన చేయరాదు. దేవుడి పేరును అన్యదా ఉపయోగించరాదు, వారానికొక దినం సెలవుదినంగా పాటించాలి, తల్లిదండ్రులను గౌరవించాలి, హత్య చేయరాదు, దొంగిలించరాదు, తప్పుడు సాక్ష్యమివ్వరాదు, ఇతరుల సంపదను చూసి ఈర్ష్య పడరాదు. ఈ పది ఆదేశాలు పాటించడంతోనే ఇశ్రాయిలు కర్తవ్యం ముగియలేదని మతపెద్దల ఆదేశం ప్రకారం యూదులు తప్పనిసరిగా వివాహం చేసుకొని ఇద్దరు సంతానాన్ని బడయాలని, తమ జాతి అభివృద్ధికి పాటుపడాలని కూడ బోధించారు.

ఇటువంటి ఆదేశాలనే Paul తన అనుచరులైన Hellenized Jewish-Christians కి ఇవ్వడం జరిగింది. దేవుని ఉనికి తెలియని అనాగరికుల వలె భోగలాలసత, శారీరక కాంక్షలో మునిగి తేలరాదని, ఇరుగు పొరుగువారిని సోదర సమానులుగా పరిగణించి, వారికి హాని తలపెట్టరాదని, వారి హక్కులను కాలరాసే ప్రయత్నం చేయరాదని, అట్టి

